# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

❧

అక్టోబరు 1984

సంపుటము : 61 సంచిక : 10

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు



# వి ష యా ను క్ర మ ణి క

## అక్టోబరు 1984

# వందనం

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

పునరావృతం కావడం ప్రకృతి లక్షణం
అనంతమైన కాలానికి ఆదిలేదు___ అది
ఆద్యంత రహిత వలయం
ఖద్యోతన కాంతి నిలయం!

జనన మరణాల మధ్య ఇరుక్కున్న జీవితం
జగాన్నంతా ఏలాలని కోరుతుంది.
ఆఖరి క్షణాలని ఇంకా మీదికి...
అందరాని దూరాలకి తోయాలని పోరుతుంది.

ఆశలు తీరుతాయన్న దురాశే
అందరి ఆయుష్షునీ పొడిగిస్తుంది.
ఆకాశం నుంచి పడిపోయిన ఆపస్సు
వెనక్కి పోవాలని చేస్తుంది తపస్సు!

అజరామరమైన జీవితం
ఆశించేవాళ్లు మూర్ఖులు
ఆర్తీ ఆకలీ అంతం లేని బ్రతుక్కి
అనంత మార్గంలో ప్రయాణం!
అను బంధాలు పెంచుకుంటూ
ఆశాసౌధాలు నిర్మించుకుంటూ
ఐహిక సుఖాల వలల్లో చిక్కుకొని
ఆఖరికి ఏం చేయగలం
అరగడియేనా కామే స్వతంత్రులం!

ఇటు కబంధ హస్త బంధాలు
అటు పునాదుల్లేని సౌధాలు!!!

కోరింత దగ్గులాగ, గోరింట రంగులాగ
పట్టుకుంటే వదలదు బ్రతుకుమీది ఆశ!
పెరుగుతూ విరుగుతూ
పరుగులు పెడుతూ ముందుకురుకుతూ
తిరిగి వెనక్కి మళ్లుతుంది నురగలు కక్కుతూ కెరటం!

అజరామర కీర్తి పతాకాన్ని
ఆవిష్కరించు! బ్రతుకు బరువు
అంతం కావాలంటే
అందరికీ ఆనందం పంచు!

మిన్నులు పడ్డచోటికి చేరాలని
ఎంత ముందుకి నడిచినా అది అందదు;
తన నీడని దాటిపోవాలనే
మనిషి యత్నం సాఫల్యం పొందదు!

ఒక ఉషస్సు వెలుగుతుంది
ఒక తపస్సు మలుగుతుంది;
ప్రతి హృదయ స్పందనమూ
పరమేశ్వరునికి వందనం!



# పెద్దకల

## శ్రీ వసంతరావు వెంకటరావు

అతి దీర్ఘ స్వప్నమిది
మృతి చెందు వరకికే
మతి చెరచి సత్యమని
సతము బోధిస్తుండు.
కలగన్న తరువాత
కలత చెందుచు లేచి
"కలగంటి" మనుకొంచు
కలవరం పడుచుంటు
పరిపాటి, ప్రతివారి
పరిధిలో జరుగునది
తరువాత శాంతించి
స్థిరపడును హృదయమ్ము
తెలివి వచ్చిన పిదప
కలవరము తగ్గగా
కల కల్లగా నెంచి,
కలత మాయగ నెరిగి
కలలోని సంఘటన
లలవోకగా మరచి
నిలువెల్ల ఆనంద
కలితమై యుప్పొంగు
కలలెన్ని కన్న, ఆ
కలలెంత హృద్బాధ
కలిగించినా సరే
తెలివి వచ్చిన పిదప
తాత్కాలిక స్వప్న
లోకాల నుంటిమని,
ఉత్కంఠ మిథ్యయని
నిష్కర్షగా తెలియు
అతి దీర్ఘమైన జీ
విత స్వప్న మంతమై,
మతిపోయి తుదకొక్క
చైతన్య మూర్తిగా
నిర్గమించి ప్రయాణ
మార్గమెరుగని నాడు
స్వర్గమో నరకమో
దుర్గమంబగు నాడు,
ఇల జీవితము పెద్ద
కలగా నెరింగినా
ఫలమేమి? తన బ్రతుకు
మలచుకోలేనపుడు?

శ్రీ ఎ. విజయ దత్తాత్రేయశర్మ

# గుంటూరుజిల్లా గ్రామనామములు ఒక పరిశీలన

"ఈ జిల్లా 15° 18' - 16° 50' ఉత్తర అక్షాంశముల మధ్యను, 78°-10' - 80' 55' తూర్పు తులాంశముల మధ్యను ఉన్నది. దీనికి ఉత్తరమున కృష్ణానదియు, దానివెంబడి తెలంగాణము లోని నల్గొండ జిల్లాయు, తూర్పున కృష్ణాజిల్లాయు, బంగాళాఖాతమును దక్షిణమున నెల్లూరు (ప్రస్తుతం ప్రకాశం) జిల్లాయు, పశ్చిమమున నెల్లూరు, కర్నూలు, మహబూబ్‌నగర్ (ప్రస్తుతం ప్రకాశం, మహబూబ్‌నగర్) జిల్లాయును సరిహద్దులుగా నున్నవి.[1]

1975 సం॥ ఆంధ్రప్రదేశ్ స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్‌ను అనుసరించి ఈ జిల్లాలోని గ్రామముల / పట్టణముల సంఖ్యా వివరములు పట్టిక-1లో నున్నవి.[2]

## చారిత్రక నేపథ్యము

చరిత్ర పూర్వకాలము నుంచి ఈజిల్లా ప్రాంతం జనావాస యోగ్యమై యుండినది. ఇప్పట్నం(గుం), కారెంపూడి(ప) నాగార్జున కొండలలో ప్రాచీన శిలాయుగమునకు సంబంధించిన అవశేషములు లభించినవి. నాగార్జునకొండ, లాము(గుం), నెమిలిపురము(ప) మద్దూరు[3], తుమ్మలపాలెం[4], యనమదల[5]లో మధ్యప్రాచీన శిలాయుగములు బయల్పడినవి. నాగార్జునకొండ, చేబ్రోలు(తె)లలో నవీన శిలాయుగ చిహ్నములు కనుగొనబడినవి.[6] రాకాసిగుళ్ళు అనబడే పురాతనకాలపు సమాధులు దోలి, గుత్తిగొండ, కారెంపూడి, మల్లవరం (అన్నీ ప), బొల్లపల్లి, చింతలచెరువు, దొండపాడు, గండిగనమల, గరికపాడు, గోకనకొండ (అన్నీ వి), బొప్పుడి, కొండవీడు, రాజుపేట (అన్నీ న) లలో గుర్తింపబడినవి.

మౌర్య, శాతవాహన. ఇక్ష్వాకు, పల్లవ, శాలంకాయన, ఆనందగోత్ర, విష్ణుకుండిన, తూర్పుచాళుక్య, చాళుక్య-చోళ, పశ్చిమచాళుక్య, వెలనాటిచోళ, తెలుగుచోళ (కొట్లదొన, పెదచెరుకూరు), పల్నాటి హైహయ. కొండపడుమటి, పరిచ్ఛేది, కోట, మందాడి (సత్తెనపల్లి), చాగి (వినుకొండ), కాకతీయ కొండవీటిరెడ్డి సామ్రాజ్యాంతర్గతభాగముగ, స్థానిక రాజవంశముల కాటపట్టుగ ఈజిల్లా ప్రాచీన మధ్యయుగములందు ప్రవర్తిల్లినది. "ముగ్గురు రాజులకును మోహంబు పుట్టించు గుబ్బతైన యురిత్రాడు కొండవీడు" అని శ్రీనాథుడు ప్రశంసించిన కొండవీడు ఆధిపత్యమునకై శతధా యత్నించువారు గజపతి, విజయనగర, బహమనీ ప్రభువులు. కుతుబ్‌షాహి, మొఘల్, ఆసఫ్‌జాహీల పాలన ఈజిల్లా అనుభవించినది. ఆధునిక కాలమున వాసిరెడ్డి (అమరావతి, చెబ్రుకూరు), యర్లాజు (నరసరావుపేట), మాణిక్యారావు (రాచూరు-రేపల్లె), మానూరు (చిలకలూరిపేట, సత్తెనపల్లి) జమీందారీ కుటుంబములు ఈ జిల్లాలో పలు ప్రాంతములపై పెత్తనము వహించినవి.

పట్టిక - 1

| క్రమసంఖ్య | తాలూకా × | గ్రామముల సంఖ్య జనావాసం కలవి | లేనివి | పట్టణముల సంఖ్య | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1 | బాపట్ల | 61 | 2 | 2 | 65 |
| 2 | గుంటూరు | 125 | 4 | 3 | 132 |
| 3 | నరసరావుపేట | 67 | 5 | 2 | 74 |
| 4 | పల్నాడు | 87 | 6 | 3 | 96 |
| 5 | రేపల్లె | 58 | 1 | 2 | 61 |
| 6 | సత్తెనపల్లి | 127 | 3 | 2 | 132 |
| 7 | తెనాలి | 90 | 3 | 1 | 94 |
| 8 | వినుకొండ | 73 | 4 | 1 | 78 |
| | మొత్తం | 688 | 28 | 16 | 732 |

## ప్రాచీన మధ్యయుగములలో పాలనా విభాగములు

మండలము, రాష్ట్రము,రాజ్యము, దేశము, విషయము. నాడు, వాడి, పథము, మార్గము, సీమ, భూమి, క్షితి, స్థలము, వంటి పాలనా విభాగములు, ప్రాచుర్యములో నుండెడివి. ఇందు కొన్ని సమానార్థక ములు, కాగా మరికొన్ని అంతర్గత విభాగములై యుండెడివి. ఒకే విభాగమునకు వివిధకాలములలో వేరు వేరు పేర్లు వాడబడుటకలదు. ఆంధ్ర, ఇక్ష్వాక వీరపురుష దత్తుని జగ్గియపేట ప్రాంత శాసనములో కమ్మాకరత[8]మని చెప్పబడిన ప్రాంతము,పల్లవుల,తొలిచాళుక్యుల శాసన ములలో కమ్మాకరాష్ట్రమనియు,కమ్మరాష్ట్రమనియు,కర్మరాష్ట్రమనియు పేర్కొనబడినది [9] క్రీ.శ.1209నాటి గణపతిదేవుని ఇడపులపాడు శాసన ములో[10] కర్మరాష్ట్రమని చెప్పబడినది. నన్నిచోడుని దేగరమూడి శాసనము[11] (శా. సం. 1002), కామచోడుని కొణిదెనశాసనము[12] (శా. 1087), రాజేంద్రచోడుని అప్పికట్ల శాసనము[13] (శా. 1094) లలో కమ్మనాడనియు, కన్నరదేవచోడుని మంత్రిమారని తంగెడుమల్లి శాసనము[14] (శా. 1087) లో కర్మక్షితి అనియు, పరిటిమైలారరెడ్డి తిరువళిక్కేణి శాసనము[15] (శా.1350) కమ్మవిషయమనియు చెప్పబడి నది. అట్లే కొండవీడురాజ్యము,[16] విషయము,[17] సీమ,[18] అని చెప్ప బడినది. గజపతుల కాలములో కొండవీటి దండపాట అని పేర్కొన బడినది.[19] (శ. సం. 1380) నాటిదగు ఒక శాసనము[20] నందు సంస్కృత భాగమున ఓంకార మార్గమనియు, తెలుగుభాగమున ఓంగేఱు మార్గమనిన్ని వ్రాయబడిన విభాగమే మరియొక శాసనమున[21] ఓంగేరు మార్గ విషయమని ప్రస్తావింపబడినది. ఒంగేఱు మార్గ్రతయ మను ప్రశంసకూడ శాసనములందు గానవచ్చుచున్నది.[22] పల్లినాడు విషయము [23] వెలనాటిపల్లి విషయము[24] అను అంతర్గత విభాగములు కానవచ్చుచున్నవి.

ఆంధ్రపథము : "మైదవోలు, ఉరియేంద్రశాసనస్థల నిర్దేశమును బట్టి ఆంధ్రపథము పల్లవ, చాణరాజుల కాలములో గుంటూరు మండలము నుండి దక్షిణ దిగ్భాగమైన నేటి ఆంధ్రప్రదేశమునకు సరివచ్చుదేశమని తలంపవచ్చును.[25]

**నాడులు :**

ఉత్తమచోడపలనాడు : కమ్మనాడు వుత్తమచోళవలనాడ్కి లోని దని కొన్ని శాసనములు పేర్కొనుచున్నవి.[26] "ఉత్తరమున సింహా చలము. దక్షిణమున బాపట్లవఱకు ఉత్తమచోడవలనాడు వ్యాపించి యుండెనని." పత్తిశోధకాభిప్రాయము [27]

### కమ్మనాడు :

"గుంటూరు మండలములో బాపట్ల మొదలు, వినుకొండ, నరసరావుపేట తాలూకాలు, సత్తెనపల్లి తాలూకాలలో కొంతభాగము కమ్మనాడుగా నుండెడిదనిచెప్పవచ్చును.[28]"మల్లంపల్లివారి అభిప్రాయం ప్రకారము కమ్మనాటి విషయము నరసరావుపేట,బాపట్ల (నేడు ప్రకాశం జిల్లాలో చేరియున్న ఒంగోలు తాలూకా) తాలూకాప్రాంతము నకు సరిపోవును.[29]

### పల్నాడు :

రెండవచాళుక్య విష్ణువర్ధమని కోనేకిశాసనమున (క్రీ.శ.869)[30] పల్లిరాష్ట్ర మనియు దాగివేతరాజు మాచెర్లశాసనము (శా.శ. 1033)[31] పల్లిదేశమనియు,కులోత్తుంగ చోడ గొంకరాజుశాసనము(శా.శ.1069[32] కాకతి రుద్రమదేవి దుర్గిశాసనము (శా. శ. 1191) [33] మొII వాటి యందు పల్లినాడు ఇత్యాదిగా పేర్కొనబడినవి. వినుకొండ వల్లభ రాయని క్రీడాభిరామమందు పలినాడు, పల్నాడు, పల్లెనాడు, పల్లిదేశ మనియును, పల్నాటివీరచరిత్రలో పలినాడు పల్లెనాడు అని రెండు విధములుగను వుండుటను బట్టి ఇవి యన్నియు ఒకే ప్రాంతమును సూచించుచున్నవని తెలియవగును. "ఆంధ్రరాజధానీనగరమగు ధాన్య కటకమునకు దక్షిణభాగమున జైన, బౌద్ధ శైవ మతముల నవలంబిం చిన పహ్లవాదులు వేనవేలు నివసించుచు క్రమముగా నాంధ్రులతో గలిసిపోయి యాంధ్ర పహ్లవులనబడుచుండిరి. ఈ యాంధ్ర పహ్లవులే పల్లవులైరి. ఈ పల్లవులు నివసించు ప్రదేశమే పల్లవనాడని పేరం బిలువబడుచుండెను. ఈ పల్లవనాడే నేడు పల్నాడని పిలువబడుచు గుంటూరు మండలములో నున్నది. (చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రుల చరిత్రము, ప్రథమభాగము, పుట 126). ఈ పల్నాడనునది 'పల్లి' శబ్దముతో సంబంధము గలదనియు, పల్లియను పదమునకు బౌద్ధ లేక జైన నివాసస్థలమని యర్థమనియు ప్రాచీనకాలమున బౌద్ధమత వ్యాప్తికి స్థావరమైన సుప్రసిద్ధ నాగార్జునాచార్య బౌద్ధసంఘారామమునకు నిల యమై, బౌద్ధనివాసముల కాటపట్టగుటచే నియ్యది పల్లెనాడై, తరువాత పల్నాడైనదని యూహించుటయే సమంజసము పల్నాడుత్పత్తికి దక్షిణ

తీరమున సత్తెనపల్లి తాలూకాకు పడమటయు వినుకొండ తాలూకాకు ఉత్తరమున నున్న నేటిపల్నాటితాలూకా ప్రాంతభూమి[34]

## వెలనాడు :

“వెలనాడు గుంటూరు మండలములోని కమ్మనాటి కుత్తరమునను, కృష్ణామండలమున దివితాలూకాయును, గుంటూరు, రేపల్లె తాలూకాయును, సత్తెనపల్లి తాలూకాలో పల్నాటికి తూర్పు భాగమును, బాపట్ల తాలూకాలో ఉత్తర భాగమును, తూర్పున సముద్రము గల ప్రదేశమని చెప్పవచ్చును. ఈ వెలనాడే ఆరువేల గ్రామములుండుటచేత ఆర్వేలనాడు అయినది. సంస్కృతములో దీనికి షట్సహస్రావనీ దేశము అని పేరు”[35]. వెలనాటిపల్లి విషయము తెనాలితాలూకా ప్రాంతమునకు సరిపోలినదిగా గుర్తింపబడినది[36] శ. సం. 1053 నాటిదగు నొక శాసనములో[37] ఆంధ్ర భూతలము పదాఱువేలని చెప్పబడినది.

## కంద్రవాడి :

ఉత్తర కంద్రవాడి,[38] ఈవని కంద్రవాడి,[39] దొడ్డి కంద్రవాడి,[40] గుడ్ల కంద్రవాడి,[41] అను అంతర్భాగములు గలిగియుండెడిది:

“కంద్రవాడి లేక కందరవాడి కందరరాజు లేలిన ప్రాంతము అనుకొనవలెను.”[42] క్రీ. శ. 4వ శతాబ్ది మధ్యభాగమున నీప్రాంతము నేలిన ఆనంద గోత్రీయుల రాజధాని కందరపురమును బట్టి (ఆ వంశ మూలపురుషుడు కందరుడు) ఈ పేరేర్పడి యుండవచ్చును.[43] “కందేరువాడనగా నేటి గుంటూరు, సత్తెనపల్లి తాలూకా ప్రాంతమని తెలుచున్నది”[44] తెనాలితాలూకా ఉత్తరభాగము కూడ నిందులో చేరియున్నదని మరియొక గమనింపు[45] ఉత్తర కంద్రవాడి సత్తెనపల్లి తాలూకాలోని ఆగ్నేయ భాగమునకు సరివచ్చునని.[46] ఈవని కంద్రవాడి నేటి తెనాలి తాలూకాలోని ఈమని కేంద్రముగా నుండిన విభాగమై యుండును. కృష్ణకు దక్షిణమున నుండుటచే ఆ విభాగమునకు దొడ్డి కంద్రవాడి అని పేరు వచ్చియుండును.[47] ‘గుడ్ల’ కందేరు వాడనునది గుండ్ల-గుళ్ళ ఇత్యాదిగా పరిణామము చెందినదనియు, అమరేశ్వరాలయము, బౌద్ధ చైత్యములు గలిగిన అమరావతి ప్రాంతమునిదే సూచించునని యు భావింపబడినది.[48]

## కొండనతవాడి :

నతవాడి, కొన్నాతవాడి అనికూడ శాసనములందు ప్రసిద్ధమైన ఈ విభాగపు పరిధి గూర్చి విభిన్నాభిప్రాయములు గలవు. డా॥ నేలటూరి వేంకటరమణయ్య[49]గారు ఇది కృష్ణాజిల్లా లోని నందిగామ తాలూకా ప్రాంతమనియు, ఈశ్వరదత్తు[50] గారు సత్తెనపల్లి తాలూకా తూర్పుభాగమనియు, డా॥ యశోదాదేవి[51]గారు బెజవాడ అమరావతి ప్రాంతమనియు అభిప్రాయపడినారు.

## ఓంకార లేక ఒంగేఱు మార్గము/విషయము :

“నరసరావుపేట తాలూకాలోని చేజెర్ల (ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో నున్నది) గ్రామమునుండి ‘ఓంకార’ అను నది ప్రవహించుచు ఒంగోలు తాలూకాలో కలియుచున్నది. దీనికి ఒంగేఱు అను పేరు కూడ కలదు. ప్రస్తుతము దీనిని జొగేరు అని పిలుచుచున్నారు. ఈ నది కిరు ప్రక్కలనున్న ప్రాంతమునకు ఒంగేరు మార్గమని వ్యవహారము కలదు”[52] “ఈ ఒంగేఱు గిరి పశ్చిమము, వెలనాడు, కమ్మనాటి లో ప్రవహించుటచే నీ మూడును గలిసి యొంగేఱు మార్గత్రయమని పేరు గలిగి యుండవచ్చును”[53]

## కొండ పడమట దేశము :

“ఈ కొండపడమటి దేశమునకే సంస్కృత రూపములు గిరిపశ్చిమ దేశము, గిరి ప్రతీచీదేశము, కుత్కీలప్రత్యగుర్వీ యనునవి కొండవీటి కొండకు పశ్చిమదిశలో నున్న దేశమునకే కొండ పడమటి దేశమని పేరు... కొండపడమటి దేశము సత్తెనపల్లి తాలూకాలోని తూర్పుభాగము, నరసారావుపేట, గుంటూరు తాలూకాలోని కొంత భాగమునై యుండవలెను”[54]

## కోటభూమి/దేశము :

“కోటభూమి లేక కోటదేశము షట్సహస్రావని లేక అరువేల నాడని తెలియగలదు. కోట భూమిశులొసగిన దాన శాసనములలో కొండపడమటి, కొండనతవాడి, కంద్రవాడి సీమలలోని గ్రామములు పేర్కొనబడినవి. కావున కోటభూమిలోన ఈ సీమలు గలిసి ఉన్నవని తెలిసికొనవచ్చును.[55]

## సీమలు

## కుండినసీమ :

రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు (1761-1816) చేసిన ప్రతిష్ఠలు వర్ణించు నొక చాటు పద్యమునందు బాపట్ల, గుంటూరు,

చింతలపల్లి మొ॥ గ్రామములు కుండినసీమ లోనివిగా చెప్పబడుటచే నిది ఆ తాలూకాల ప్రాంతమని ఎంచవచ్చును గుండ్లకమ్మకు కుంతి, బ్రహ్మకుండి, కుండిజా అను పేర్లుండుటను బట్టియు, కొండవీడునకు కుండిన నగరమనునది పర్యాయపదము[56] కావున ఈ సీమకు ఆ పేరు వచ్చియుండును.

కొండవీడుసీమ :

శ. సం. 1442 నాటిదగు కృష్ణదేవరాయల కొండవీడు శాసనము నందు పేర్కొనబడిన గ్రామ నిర్దేశనమును బట్టి గుంటూరు, నరసరావు పేట తాలూకాల ప్రాంతము సీమా ప్రాంతమునకు సరిపోవునదిగా ఎంచవచ్చును.

గురిందాల (గురిజాల) సీమ గజపతుల కాలమునాటి శాసనములలో ప్రసక్తమైనది.[58]

తంగెడసీమ :

అప్పకవీయమున తంగెడ విషయమని కూడ చెప్పబడినది. సదాశివరాయల కాలమునాటి శాసనములలో నీ సీమలోనివిగా చెప్ప బడిన గ్రామములు నేటి పల్నాడు తాలూకాలో నుండుటయు, తంగెడ కూడ ఆ తాలూకాలోని గ్రామమే అయి యుండుటయునుబట్టి ఈ సీమ ఆ గ్రామము కేంద్రముగా నేర్పడి యుండునని నిశ్చయింప వచ్చును.[59]

నాగార్జునకొండసీమ :

కృష్ణదేవరాయల కాలమునాటి శాసనములలో ప్రసక్తమైన ఈ సీమ పల్నాటి తాలూకాలో నంతర్భాగముగా గుర్తింపబడినది.[60]

పల్నాటిసీమ :

ఇది పల్లి దేశాంతర్గతభాగము.[61]

బెల్లముకొండసీమ :

16, 17, 18 శతాబ్దములనాటి కొన్ని శాసనములలో బెల్లము కొండ సీమ లోనివిగా చెప్పబడిన గ్రామముల నిర్దేశనమును బట్టి ఈ సీమ బెల్లముకొండ గిరిదుర్గ సమీప ప్రాంతమగు నేటి సత్తెన పల్లి తాలూకాలోని కొంత ప్రాంతమై యుండునని పరిశోధకాభి ప్రాయము.[62]

వినుకొండసీమ :

హంపీ విజయనగర, సూర్యవంశ గజపతుల శాసనములలో ప్రసక్తమైన ఈ సీమ వినుకొండగిరి దుర్గ సమీప ప్రాంతమైన వినుకొండ తాలూకా ప్రాంతముగా ఎంచవచ్చును.[63]

## స్థలములు

గజపతుల పరిపాలనా కాలములో రాజమండ్రి రాజ్యము లేక దండపాట లోనివిగా చెప్పబడిన స్థలములలో ఈ జిల్లాలోని ఈ క్రిందివి గలవు. 1) పల్నాటిస్థల, 2) కోట.[64] కొంటవీడు దండపాటలో నంతర్భాగముగ కొండవీడు స్థలము గలదు.[65] గురిందాల స్థలము గురిజాల ప్రాంతముగాను, కొండూరు స్థలము తెనాలి తాలూకా ప్రాంతముగాను, కోట స్థలము గుంటూరు తాలూకాలోని ధరణికోట ప్రాంతముగను, మహదేవిచర్ల స్థలము మాచెర్ల ప్రాంతముగను, పింగలి స్థలము గురిందాల స్థలముతో బాటుగనే పేర్కొని యుండుటను బట్టి ఆ గ్రామముల ప్రాంతముగను, తంగెడ స్థలము పల్నాడు తాలూకా లోనిదిగను, కొప్పారము స్థలము నరసరావుపేట తాలూకాలో కొంత భాగముగను, చుండూరి స్థలము తెనాలి తాలూకాలో కొంత భాగముగను గుర్తింపబడినది.[66]

పై వివరణ వలన ప్రాచీన, మధ్య యుగములందు పలు విధములైన విభాగములు పరిపాలనా సౌలభ్యమును కలుగజేయుచు నేర్పడియుండినట్లు తెలుస్తోంది. వాటికాయా పేర్లు భౌగోళిక ప్రత్యేకతల వలనను (ఉదా॥ కొండ పడమటిదేశము, కొండ కతవాడి, వెలనాడు), నదీనామ ప్రకారము (ఉదా॥ ఒంగేరు మార్గము, కుండిన సీమ), పాలక వంశముల ప్రభావ మూలకముగను (ఉదా॥ పల్నాడు, కంద్రవాడి), ముఖ్యపట్టణములు, గిరిదుర్గముల పరముగను (ఉదా॥ కోటభూమి, బెల్లముకొండ సీమ, వినుకొండ సీమ) ఇత్యాదిగా నేర్పడినట్లు గ్రహించగలము.

పట్టిక–2లో ఉదాహరణ పూర్వకముగా ఈ జిల్లాలోని కొన్ని గ్రామముల పేర్లు కాలగతిని పొందిన మార్పును, కొన్ని తావులందు అవి శతాబ్దములు గడిచినను తొల్లింటి పేరును నిలుపు కొనుటను తెలియజేయును.

## పట్టిక - 2

## శాసనములు - గ్రామనామములు

| క్రమ సంఖ్య | శాసనములలో గ్రామనామము | ప్రస్తుత గ్రామనామము | తాలూకా | శాసనకాలము శ. సం. | ఆధారము |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | గొంటూరు | గుంటూరు | గుంటూరు | క్రీ.శ 918-25 | డా॥ బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్ర శాసనాలు (హైదరాబాద్, 1971), పు 185 & 304 |
| | గుంటూరు | ,, | ,, | శ. 1440 | యస్. ఐ. ఐ. 4 నెం. 703 |
| 2 | మంగళపుర | మంగళగిరి | ,, | 7 శతాబ్ది | 'ది మారుటూరు గ్రాంట్ ఆఫ్ పులకేశి 2' ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఆర్కియోలజికల్ సిరీస్. నెం. 6 (హైదరాబాద్, 1962) పు 33-34. |
| | మంగళగిరి | ,, | ,, | శ. 1480 | యస్. ఐ. ఐ. 4, నెం. 709. |
| 3 | పెదపలకలూరు | పెదపలకలూరు | ,, | శ. 1300 | 'ది పెదపలకలూరు ప్లేట్స్ ఆఫ్ అనవేమారెడ్డి'- ఆం. ప్ర. ఆ. సి. నెం. 6. పు 198. |
| 4 | దామరపల్లి | దామరపల్లి | ,, | ,, | పైది. టెక్ట్స్ ఫిగర్-1 |
| 5 | వెలింగండ్ల | వెనిగండ్ల | ,, | శ. 1440 | యస్. ఐ. ఐ. 4 నెం. 702 |
| 6 | నంబూరు | నంబూరు | ,, | ,, | పైది. |
| 7 | క్రంజ / క్రాజ | కాజ | ,, | 8-9 శతాబ్దులు | ప్రాచీనాంధ్ర శాసనాలు, పు 293. |
| 8 | కన్దేఱు | కంతేరు | ,, | క్రీ.శ. 669 | పైది, పు 176, 177&262. |
| | క్రంతేఱు | ,, | ,, | శ. 1104 | ఎ. ఇం. 4 పు 147-60 |
| 9 | గుండిమెడ | గుండిమెడ | ,, | శ. 1065 | యస్. ఐ. ఐ 10 నెం. 109 |
| 10 | కుఱుంగల్లు | కూరగల్లు | ,, | ,, | పైది. నెం. 112 |
| 11 | మందడము | మందడము | ,, | శ. 1188 | యస్. ఐ. ఐ. 10 నెం. 395 |
| 12 | వెలంగపూండి | వెలగపూడి | ,, | ,, | ,, |
| 13 | రావిపూండి | రాయపూడి | ,, | ,, | ,, |
| 14 | పెనుంబాక | పెనుమాక | ,, | ,, | ,, |
| 15 | అప్పలపాడు | ఉప్పలపాడు | ,, | ,, | ,, |
| 16 | లాము | లాము | ,, | శ. 1480 | పైది. 4 నెం. 709 |
| 17 | కంతమరాజుకొండూరు | కంతమరాజుకొండూరు | ,, | ,, | ,, |
| 18 | తాణ్టికొణ్ణ | తాడికొండ | ,, | క్రీసుమారు945 | ప్రాచీనాంధ్ర శాసనాలు, పు 188&331 |
| 19 | అమ్మలపూణ్టి | అనుమర్లపూడి | ,, | ,, | ,, ,, ,, |
| 20 | జొన్నలగడ్డ | జొన్నలగడ్డ | ,, | శ. 1095 | యస్. ఐ. ఐ. 10 నెం. 188 |
| 21 | నిడుబ(ప)ఱు | నిడమఱ్ఱు | ,, | క్రీ.శ 633-663 | ప్రాచీనాంధ్ర శాసనాలు పు 173 & 362 |
| 22 | నూదెంకి | నూతక్కి | ,, | శ. 1080 | యస్. ఐ. ఐ. 10 నెం 143 "దీనికి నూట్టెంకి, నూదెంకి, నూతక్కి యను వ్యవహారము శాసనములలో కనబడుచున్నది". —భూగోళ సర్వస్వము, మొదటి సంపుటముక్కిపు 13. |
| 23 | వేంబల్లె | వేమల్లిపాడు | ,, | శ. 1442 | ఎ. ఇం. 6 నెం. 22 |
| 24 | యెన్నందల | ఎనమదల | ,, | శ. 928 | యస్. ఐ. ఐ. 6 నెం. 102 |
| 25 | గోరెంట | గోరంట్ల | ,, | శ. 1440 | పైది 4 నెం. 702 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 26 | చెం్బోం | చేబ్రోలు | తెనాలి | శ. 928 | యస్. ఐ. ఐ. 6 నెం. 102 |
| 27 | చదలవాడ | చదలవాడ | ,, | శ. 1411 | ఎ. ఇం. 8 |
| 28 | అముతునూరు | అ ః్తలూరు | ,, | శ. 1054 | యస్. ఐ. ఐ. 10 నెం. 90 |
| 29 | తెనాలి | తెనాలి | ,, | శ. 1065 | పైది. నెం 112 |
| 30 | ఇంపట్లు | ఈపూరు | ,, | క్రీశ921_927 | ది వెలంబట్లు గ్రాంట్ ఆఫ్ అమ్మరాజు విష్ణువర్ధన ఎ. ఆం. 3 (హైదరాబాద్, 1974) పు 44 |
| 31 | కుచ్చారిపట్టు | కుచ్చెళ్ళపాడు | ,, | ,, | ,, ,, ,, ,, ,, |
| 32 | వేమూరు | వేమూరు | ,, | ,, | ,, ,, ,, ,, ,, |
| 33 | వలివేరు | వలివేరు | ,, | శ. 965 | యఫ్. ఐ. ఐ.10 నెం. 6 ప్రాచీనాంధ్ర శాసనాలు పు 479 |
| 34 | నంద్దివెలుగు<br>నందివెలుంగు<br>నందివెలుగు | నందివెలుగు | ,, | శ. 1(4)86 | పైది 4 నెం. 698 |
| 35 | ఈవని | ఈమని | ,, | శ. 1065 | పైది 10 నెం. 109&112 |
| 36 | దుగ్గిజెలపూండి | దుగ్గిరాల | ,, | శ. 1056 | పై ది. నెం. 96 |
|  | దుగ్గిరాల | ,, | ,, | శ. 1480 | పై ది. 4 నెం. 709 |
| 37 | దావులూరు | దావులూరు | ,, | శ. 1068 | పైది. 10 నెం. 109 |
| 38 | చింతలపూడి | చింతలపూడి | ,, | శ. 1423 | ఎమ్. ఇ. ఆర్. 1931_33, నెం. 332 |
| 39 | పెర్వలి | పెరవలి | ,, | శ. 1260 | ఎ.ఇం.5 పు13. భూగోళ సర్వస్వము,మొదటిసంపుటము పు294 |
| 40 | వేలూరు | వేలూరు | నరసరావుపేట | శ. 930 | యస్. ఐ. ఐ. 10 నెం. 4 |
| 41 | కొండవీడు | కొండవీడు | ,, | శ. 1436 | పైది. 4 నెం. 282 |
| 42 | దేగరబూడి | గడేరమూడి | ,, | శ. 1002 | పై ది. నెం 58 |
| 43 | మారుటూరు | మారుటూరు | ,, | 7వ శతాబ్ది | ది మారుటూరు గ్రాంట్ ఆఫ్ పులకేశి 2, ఆం. ప్ర. గ. ఆ.సి. నెం 6. పు 33_34 |
| 44 | మైదవోలు | మైదవోలు | ,, | శ. 1442 | ఎ. ఇం. 6 నెం. 22 |
| 45 | కాకణ్డివాడ | కాకాని | ,, | శ. 654 | ఎ. ఇం. 18, పు 58_60 ప్రాచీనాంధ్ర శాసనాలు, పు269 |
| 46 | కొట్లదొన | కొణిదెన | ,, | శ. 1002 | యస్. ఐ. ఐ. 10 నెం 58 |
|  | కొట్టియదొన | ,, | ,, | శ. 1140 | పైది. 6 నెం. 628 |
| 47 | అనుంగురాజుపల్లి | అనుగురాజుపల్లి | పల్నాడు | శ. 1181 | పైది 10 నెం. 270 |
| 48 | దుగ్గపట్టణము | దుగ్గి | ,, | శ. 1173 | పైది. నెం 334 |
| 49 | తంగెడ | తంగెడ | ,, | శ. 1295 | పై ది. నెం 557 భూగోళసర్వస్వము, రెండవసంపుటము పు 42 |
| 50 | ఆకళరాజుపల్లి | ఆకురాజుపల్లి | ,, | ,, | ,, ,, ,, |
| 51 | గ్రాములపాడు | గామాలపాడు | ,, | ,, | ,, ,, ,, |
| 52 | నగార్లపాడు | దినగార్లపాడు | ,, | ,, | ,, ,, ,, |
| 53 | కామెపల్లి | కామేపల్లి | ,, | ,, | ,, ,, ,, |
| 54 | రేకులగడ్డ | రేగులగడ్డి | ,, | ,, | ,, ,, ,, |
| 55 | పింగలి | పిన్నలి | ,, | శ. 1263 | పైది. నెం 549 భూగోళసర్వస్వము, మొదటిసంపుటము, పు 404 & 609 |
| 56 | మహాదేవిచర్ల | మాచెర్ల | ,, | శ॥ 1173 | యస్. ఐ. ఐ. 10 నెం 334 |
| 57 | కొణెకి | కొణెకి | ,, | శ॥ 591 | ఎ. ఇం. 31, నెం 12 ప్రాచీనాంధ్ర శాసనాలు పు 284 |
| 58 | కోలగుట్ల | కోలగుట్ల | ,, | శ॥ 1519 | ఎమ్. ఇ. ఆర్. 1929-30, నెం 88 |
| 59 | జావికల్లు | జూలకల్లు | ,, | 8వ శతాబ్దము | ది అల్లువాలు గ్రాంట్ ఆఫ్ విజయాదిత్య1, ఎ.ఆం, 3, పు2 |
| 60 | చింతపల్లి | చింతపల్లి |  |  |  |
| 61 | పిల్లుట్ల | పిల్లుట్ల | ,, | శ॥ 1141 | ది మొగలుట్ల ప్లేట్స్ ఆఫ్ కోటగణపాంబ ఎ. ఆం, 4 పు98 |

 

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 62 | కంబముపాడు | కంబముపాడు | | | యస్. ఐ. ఐ. 10 నెం. 66 భూగోళ సర్వస్వము మూడవ |
| 63 | మాడువుల | మాడగుల | పల్నాడు | శ॥ 1073 | సంపుటము పు 94 |
| 64 | పొందువుల | పొందుగుల | | | |
| 65 | అతుకూరు | అందుకూరు (ఆత్మకూరు) | ,, | శ॥ 591 | ఎ. ఇం. 31, పు 74 - 80 ప్రాచీనాంధ్ర శాసనాలు, పు 225 |
| 66 | తేజాల | తెఱాల | ,, | శ॥ 1213 | కార్పస్ ఆఫ్ తెలంగాణా ఇన్స్క్రిప్షన్స్, పార్ట్ 4 (హైదరాబాద్, 1973) నెం 35, పు 78 - 79 |
| | | | | శ॥ 1165 | పైది. నెం 46 పు 92 - 93 |
| | | | | శ॥ 1366 | పైది. నెం 49 పు 95 |
| 67 | పెణుకపఱు | పెణుకపర్రు | బాపట్ల | క్రీశ 696-709 | ఎ. ఇం. 17, ప్రాచీనాంధ్ర శాసనాలు పు 179 |
| 68 | జడవల్లి | జడవల్లి | ,, | శ॥ 1474 | 'ది జడవల్లి గ్రాంట్ ఆఫ్ సదాశివరాయ కాపర్ ప్లేట్' ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆం. ప్ర గవర్నమెంట్ మ్యూజియం, వాల్యూం II (హైదరాబాద్, 1970), పు 22 - 23 |
| 69 | కామలి | కోమలి | ,, | ,, | పైది. |
| 70 | కాకుమ్రాను | కాకుమాను | ,, | 10 శతాబ్దం | 'ది కాకుమాను గ్రాంట్ ఆఫ్ చాళుక్య భీమ I, ఎ. ఇం. III, పు 20 |
| 71 | మఱిపూడి | మర్రిపూడి | ,, | శ. 1094 | యస్. ఐ. ఐ. 4 నెం. 124 |
| 72 | అప్పికట్ల | అప్పికట్ల | ,, | ,, | ,, ,, ,, |
| 73 | మంచాళ్ల | మంచాళ్ళ | ,, | శ. 1262 | రెడ్డిసంచిక అనుబంధము పు 8 |
| 74 | మామిడ్డిపల్లి | మామిళ్ళపల్లి | ,, | క్రీశ. 709-46 | సి. పి. నెం. 8/1914-15 ప్రాచీనాంధ్ర శాసనాలు పు 199 |
| 75 | పెరువలి | పెరవలి (పెరాలి) | ,, | ,, | పైది |
| 76 | వ్రేంపల్లి | రేపల్లె | రేపల్లె | శ. 1073 | యస్. ఐ. ఐ. 6 నెం. 12 భూగోళసర్వస్వము, మొదటి సంపుటము, పు 415-16 |
| 77 | నిజాంపట్నము | నిజాంపట్నం | ,, | శ. 1515 | పైది 4, 30. 711. |
| 78 | ఎలవఱ్ఱు | ఎలవర్రు | ,, | క్రీశ 945-70 | ఇం. ఐ. 12 పు 91-98. ప్రాచీనాంధ్ర శాసనాలు పు 190 |
| 79 | ఆరుంబాక | ఆరుంబాక | ,, | క్రీ.శ 973-99 | ఎ. ఇం. 21, పు 137. ప్రాచీనాంధ్ర శాసనాలు పు 193 |
| 80 | కావూరు | కావూరు | ,, | ,, | ,, ,, ,, |
| 81 | శ్రీపూండి | సిరిపూడి | ,, | ,, | ,, ,, ,, |
| 82 | వనికుంట | వనికుంట | వినుకొండ | శ. 1619 | ప్రాచీనాంధ్ర చారిత్ర భూగోళము, పు 297 |
| 83 | పువ్వాడ | పువ్వాడ | ,, | శ. 1268 | 'ది పువ్వాడ గ్రాంట్ ఆఫ్ ప్రోలయవేమ ఆఫ్ కొండవీడు, కాపర్ ప్లేట్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు మ్యూజియమ్, వాల్యూం I, పు 178. |
| 84 | చిల్లగర | చల్లగరిగె | సత్తెనపల్లి | శ 1104 | యస్. ఐ. ఐ. 10 నెం. 199 |
| 85 | తాడివాడ | తాడువాయి | ,, | ,, | పైది 6 నెం. 229. |
| 86 | సత్తెనపల్లి | సత్తెనపల్లి | ,, | ,, | ఎ. ఇం. 6 నెం. 15 |
| 87 | చింతపల్లి | చింతపల్లి | ,, | ,, | ,, |
| 88 | మేడికొండూరు | మేడికొండూరు | ,, | ,, | ,, |
| 89 | గింజపాడు | గింజపల్లి | ,, | ,, | ,, |
| 90 | పెదమక్కెన | పెదమక్కెన | ,, | శ. 1339 | ఎమ్. ఇ. ఆర్, 1931-33 నెం. 331. |
| 91 | బిక్కబండ | భృగుబండ | ,, | శ. 1040 | పైది. 1932-33, నెం. 263 |
| 92 | ధూళిపాళ్ళ | ధూళిపాళ్ళ | ,, | శ. 1679 | పైది. నెం. 269 |
| 93 | గుడ్లపల్లి | గుండ్లపల్లి | ,, | శ. 1551 | పైది. నెం. 277 |
| 94 | క్రోసూరు | క్రోసూరు | ,, | శ. 1660 | పైది. నెం. 281 |
| 95 | ఉప్పులపాడు | ఉప్పులపాడు | ,, | శ. 1449 | పైది. నెం. 341 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 96 | సిరిపురము | సిరిపురము | సత్తెనపల్లి | శ. 1093 | యస్. ఐ. ఐ. 10 నెం. 117. |
| 97 | పడిదరము | పణిదెమి | ,, | శ. 1104 | ఎ. ఇం. 6 నెం. 15 |
| 98 | కూకిపఱ్ఱు | డోకిప్రఱ్రు | ,, | క్రీశ892,922 | ఎ. ఇం 5 పు 127-131. ప్రాచీనాంధ్రశాసనాలు, పు 280, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము. పు 50 |
| 99 | ఒంకదొన | అయ్యంండొన | ,, | శ. 1104 | యస్. ఐ. ఐ. 6 నెం. 238. |
| 100 | కుణూరు | కొండూరు | ,, | క్రీ.శ. 554 | ఎ.ఇం. 15 పు 249-252 ప్రాచీనాంధ్రశాసనాలు, పు171&277 |

## పౌరాణిక హిందూ మత సంబంధములు

### అమరావతి (గుం)

ఆంధ్రదేశమున గల పంచారామములలో మొదటిదిగాను, అమరేశ్వరుడైన యింద్రునిచే ప్రతిష్ఠితమైనదగుటచే 'అమరేశ్వరంబు' గాను తెలియనగు నీ ప్రాంతమునకు తత్కారణముగా 'అమరావతి' యను పేరు నొప్పెను.

### అమర్తలూరు (తె)

ఈ గ్రామ ప్రశంస శ. సం॥ 1054 నాటిదగు నొక శిలా శాసనమున గలదు.[67] పూర్వమీ గ్రామమునకు అమృతలూరు అను వ్యవహారము గలదు. "శ్రీ అమృతేశ్వరస్వామి పేరును బట్టి, ఈ గ్రామమునకు అమృతలూరు అని నామకరణము చేయబడినది"[68] "అముతునూరు అను రూపము అమృతలూరు అనుటకు ప్రాకృత రూపము కావచ్చును. దేవునకిచ్చు అమృతపడి (నైవేద్యము) అముద పడి అని శాసనములలో వ్రాయబడుచుండును. తెలుగులో ల, న వర్ణములు తారుమారు అగుచుండును. తెనుగు-తెలుగు, మునగ-ములగ, సెనగ-సెలగ వంటివి పరిచితములైన శబ్ద రూపములు."[69] ఇది ఇట్లుండగా, "జొన్నలగడ్డ గ్రామమునందలి అమరేశ్వరాలయము నందు వేయించబడిన శాసనములో నీ గ్రామ నామమున్నది. (యస్. ఐ. ఐ. 10 నెం. 215). ఇట్టి పేరు గలదియే అమృతలూరు (అముతునూరు), తెనాలి తాలూకాలో ఉన్నది. కృష్ణా తీరమందలి అమరేశ్వర దేవుని పేరనే ఆయా గ్రామ నామములు ఏర్పడి యుండవచ్చును[70]" అని వేరొక అభిప్రాయం.

### ఎల్లమంద (న)

ఆంధ్ర దేశమునగల ప్రసిద్ధ పురాతన శైవ క్షేత్రములలో కోటప్పకొండయొకటి. "ఈ ప్రదేశమున బ్రహ్మాది ఋషులు గుంపుగా గూడియుండుటచే ఈ క్షేత్రమునకు 'ఎల్లమంద' క్షేత్రమనియు, మునిమంద అనియు, ఈ కొండకు నుత్తర భాగమునవున్న గ్రామము నకు 'ఎల్లమంద' అనియు పేర్లు వచ్చినవి."[71]

### ఓబులేశునిపాలెం (ప)

ఓబులేశుని పల్లి అని కూడ పేరు గలిగిన ఈ గ్రామమునకు ఆపేరు అచట వెలసియున్న ఓబులేశ్వర (అహోబలేశ్వర) స్వామి వలన ఏర్పడినది.

### గోవిందపురం (న)

క్రీ శ. 1128లో నిమ్మానాయకుడను వ్యక్తి ఈ చోట భీమేశ్వర స్వామి ఆలయమును, గ్రామమును నిర్మించి దానికి గోవిందపురమని పేరుంచాడు. కాకతీయుల కాలంలో జగన్నాథస్వామి ఆలయ నిర్మాణం జరిగి ఊరికి కూడ జగన్నాథపురం అని పేరుంచడం జరిగింది. కాని జనవ్యవహారంలో గోవిందపురమనే వాడుకయే మిగిలినది. జగన్నాథ గోవింద నామములు విష్ణుసహస్ర నామములలోనివియై యున్నవి.[73]

### చేబ్రోలు (తె)[74]

శాసనములలో చేంబ్రోల, తాంబ్రపుర, కుందరపుర, స్కంద పుర ఇత్యాదిగా పేర్కొనబడినది. స్కందుని (కుమారస్వామి) ఆలయమునకు ప్రసిద్ధిగాంచిన చేబ్రోలు తొలుత ఆస్వామి నామధేయమును పురస్కరించుకొని (స్కందపురము) ఏర్పడినదని మల్లంపల్లివారి అభిప్రాయం. "చేంబ్రోల"నగా చక్కని చెరువు అని అర్థమున్నది.[75] ఇక్కడమందిన బ్రహ్మదేవుని ఆలయమును బట్టి దీనిని చతుర్ముఖపుర మని పేరుకూడ నుండినట్లు తెలుస్తోంది.[76]

### దుగ్గిరాల (తె)

దుగ్గిరాలకుండి, దుర్గంకుండి, దుగ్గిరాలపూండి అని శ. 1006-1198 నాటిశాసనములో పేర్కొనబడిన దుగ్గిరాల పార్వతీదేవి మరి యొక నామధేయమైన దుర్గపరంగా ఏర్పడిందని తెలియుచున్నది.[77]

### దుర్గి (ప)

ఆనంద గోత్రఅత్రివర్మ ఆరాధించిన వంకేశ్వర శంభువుని అర్థాంగి దుర్గ: ఆమె దేవాలయమచట నుండుటచే ఈ గ్రామనామము ఆమె పేర దుర్గిగా వర్థిల్లినది.[78]

### నందూరు (బా)

శివునివాహనమైన నందికి సంబంధించిన ఊరు.[79] ఈ లెక్కన అదేతాలూకాలోగల పెదనంది పాడు గ్రామముకూడ 'నంది'కి సంబంధించినదిగానే పరిగణన చేయవచ్చును.

### నంబూరు (గుం)

'నంబుల' వలన ఈ ఊరికి ఆపేరు సిద్ధించినదట. తమిళమున నంబి అనగా శివుడు. ఇచట శివాలయమున్నది. శివుని పేరుననే ఈ ఊరికానామము సిద్ధించినదని ఒక గుర్తింపు.[81]

### నందివెలుగు (తె)

ఈ గ్రామమునగల అగస్త్యేశ్వర స్వామి అలయమునందుగల పెద్దినందినుంచి 'వెలుగు' వెలువడుచుండెడిదనియు, కాబట్టి ఈ గ్రామమునకు నందివెలుగు అని పేరు వచ్చినదనియు ఒక కథనం.[82]

### నల్లపాడు (గుం)

నరసింగపురమనికూడ వ్యవహారము గల ఈ గ్రామమునకా నామము, ఆ గ్రామ సమీపమునగల కొండగుట్టపై వెలసిన నరసింహస్వామి వలన వచ్చినదని జన విశ్వాసం.[83]

### పెదవలి (తె)

లోకల్ రికార్డ్స్ ప్రకారం ఈ ఊరు రామాయణం అంత పురాతనమైనది. చావలి, తెరవలి వలనే ఇదికూడ 'వాలి' జ్ఞాపకార్థము నిర్మించబడినదని స్థానిక కథనం.[84] ఈ ఊరి పేరుని 'వాలి'కి ముడిపెడుతున్న మరొక ఆధార గ్రంథం. ఆ 'వాలి' ని 'గాడ్ ఆఫ్ ది విండ్స్, ఫాదర్ ఆఫ్ హనుమాన్' అని పేర్కొన్నది.[85] 'వాలి' కి 'వాయువు'కి తేడా గుర్తించడంలో పాశ్చాత్యుల పొరపాటని సరిపెట్టుకోవాలిమరి. పౌరాణిక పాత్రలకి, గ్రామనామములకు సంబంధం కల్పించడం 'చమత్కృతే' కావొచ్చుగాని చరిత్రగతేమిటన్నది ప్రశ్న!? ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఓరెండు అటువంటి ఉదాహరణలు పేర్కొనడం అప్రస్తుత ప్రశంస కాదు. "...ఆ గ్రామం పేరు 'పెరవలి' హిందీ అధికార భాషగా ఆంధ్రప్రదేశ్ అంగీకరించిన తదుపరి ప్రాంతీయ భాషలన్నీ సౌకర్యం కోసం నాగరలిపిని ప్రభుత్వలిపిగా ఆమోదించిన సందర్భంలో 'పెరవలి' 'పేర్వాలి'గా మారింది. కారణం నాగరలిపిలో హ్రస్వ 'ఎ' కారంలేదు. హిందీ ఉచ్చారణ సాంప్రదాయాన్నిబట్టి రెండవ అక్షరం హలంత మౌతుంది. అందువల్ల 'పెరవలి' 'పేర్‌వాలి'లు 'పెర్వలి' గా మారింది. ఆకాశవాణి వార్తా ప్రసారకులు దానిని 'పేర్వాలి' గా మార్చివేశారు. పై ప్రపంచంతో సంబంధంలేని ఏ ముదుసలి అవ్వలో తప్ప ఇప్పుడు ఆ గ్రామాన్ని 'పెరవలి' అని ఎవ్వరూ అనరు. 'పేర్వాలి' నామం స్థిరపడిపోయింది. అయితే 'పేర్వాలి' శబ్దాన్ని సాధువుగా నిరూపించిన ఘనత మహామహోపాధ్యాయ పండిట్ మోరి అశోక వర్ధనరాజుగారిది. తన పరిశోధనల ఫలితంగా ఆయన నిరూపించింది ఏమంటే రామాయణ కాలంలో గోదావరి తీరమంతా కిష్కింధగా పేరెన్నిక గన్నది. శ్రీరాములవారి చేతిలో వీరమరణం పొందిన వాలిస్మృతి చిహ్నంగా అతని తమ్ముడైన సుగ్రీవుడు, తన వదినగారూ, తదుపరి భార్య అయిన తారాదేవి ప్రోద్బలం వల్ల, వాలి మరణించిన ప్రదేశంలో ఒక మహాపట్టణాన్ని నిర్మించి దానికి 'పేర్వాలి' అని నామకరణం చేశాడు. (ద్రావిడ భాషలో పేర్-అపసర్థక శ్రేష్ఠార్థకము) కాల క్రమేణా ఆ మహాపట్టణం కుగ్రామంగా కురచబడింది. పేరుఅపభ్రంశమై పెరవలిగా మారింది, ఆంధ్రుల అదృష్టంకొద్దీ హిందీయులు కలుగజేసుకొనిదీనిని పూర్వ నామం పునఃప్రతిష్ఠచేసి లోకానికి మహోపకారం చేశారని."[86] ఇటువంటి ఘనమైన పరిశోధనచేసే అపాత్ర తాను మౌర్యఅశోకుడి వారసుణ్ణని అనుకుంటూ ఉంటుంది. "మాయింటి పేరు మొదట్లో మౌర్యేనండి. అట్టా అట్టా మారి మోరై పోయింది." అని ముగించారు అశోక వర్ధన రాజుగారు.[87]

పైన వివరించినట్లు కల్పనాసాహిత్యంలో పాత్రలను పోలినవారు యదార్థంగానూ వుంటారనడానికి ఒక ఉదాహరణ. కీ. శే. చిట్టిపిళ్ల వారి వాక్యాల్లో "శబ్దాలకు యీయన చెప్పే వ్యుత్పత్తులు చాలా విచిత్రంగా వుంటాయి. యీయనకి శ్రీకృష్ణుని యందు భక్తి మెండు. అందుచేత కాంతోలును స్వగ్రామం గొల్లప్రోలు (తూర్పుగోదావరిజిల్లా పిఠాపురం తాలూకా - అన్నట్లు మా అభిజనమూ అదేనండోయ్) - గొల్లలుండే వూరు - అనేదానికి, గొల్లప్పజోలు, అని అర్థంచెప్పి, పూర్వం యశోదాదేవి శ్రీకృష్ణుణ్ణి జోలియందు కట్టిపెట్టిన స్థలం అదే

నేనిన్ని చెప్పి ఆనందిస్తూవుంటారు. ఆయా అర్థాన్ని, "గొల్లప్పతోటి గట్టెను. అల్లమరాట్లోనగట్టె" అంటూ పతి పద్యంలో ఇమిడ్చి వున్నారు. యీయన చెప్పే వ్యుత్పత్తులు సరియైనవి కాకపోయినప్ప టికీ యెంతో ఆహ్లాదజనకాలుగా వుంటాయి.[88]"

పింగళి (ప)

ఈ గ్రామము నేడు 'పిన్నలి' అని వ్యవహరింపబడుచున్నది. "సూర్యపరివార దేవతలలో పింగళుడొకడు. పింగళివారింటిపేరు ఈ పరివార దేవుని వలన ఏర్పడినదేమో ?[89]"

బాపట్ల (బా)

"పేంపల్లి భావనారాయణస్వామి వారి విడిదిపట్టు అగుటచే భావపట్ల బాపట్ల అయినదేమో ![90]"

పొన్నూరు (గుం)

"పూర్వమిచటగల యొక వనమునందు మహర్షులు గోష్ఠులు జరుపుచుండిరట. అందుకే దానికి గోష్ఠీవనమని పేరుండెను.[91]"

భట్టిప్రోలు (రే)

"కృతయుగం ప్రారంభంలో 'విఠలేశ్వరుని' పేరిట ఋషుల చేత ఒక మహాలింగం ప్రతిష్ఠచేయబడింది. అందువల్ల ఈ ప్రదేశానికి విఠలేశ్వరమని పేరు వచ్చింది. [92]"

మంగళగిరి (గుం)

"ఇది ఆంధ్రదేశమునందుగల 32 సుప్రసిద్ధ నృసింహ క్షేత్ర ములలో నొకటియైవున్నది. ఈ క్షేత్రనామము బట్టియే దానిచెంత నున్న గ్రామమునకు మంగళగిరి యను నామమేర్పడెను. దేవతిర్య ఙ్మనుష్యాదుల పాపములను హరించి శ్రీస్వామి మంగళములను ప్రసా దించుచుండుట వలన 'మంగళాద్రి' అను పేరేర్పడినది.[93]"

మాచెర్ల (ప)

"మాచెర్ల" పట్టణమును పూర్వము శాసనములలో యస్.ఐ.ఐ. Xనెం 818 శ.సం. (114) "మహాదేవి తటాకము" అనునామమున లిఖిం చెడివారు 'మహాదేవి తటాకము' అను సంస్కృత పదమునకు ప్రాకృతీ కరణ మొనర్చిన తెలుగు పదమే మహాచర్ల లేక మాచర్ల అని తోచు చున్నది. ఎట్లనగా లక్ష్మీవాచకమైన మహాదేవి శబ్దము హ్రస్వమై 'మా' అని జనవ్యవహారమున మారినదని తెలియుచున్నది. 'నామైకదేశేనామ గ్రహణం' అన్నట్లు 'మా' అనునది మాత్రమే మహాదేవి శబ్దమున గ్రహింపబడినది. 'మా' అను శబ్దమునకు లక్ష్మి అనియు నర్థమున్నది. 'తటాక' అను శబ్దము తెలుగు శబ్దమగు 'చెరువు' గా మారి ఆ చెరువు శబ్దమే క్రమముగా జనవ్యవహారమున చెరల, చరల, చెర్ల, చర్లగా నేర్పడి మా + చెర్ల = మాచెర్ల, మాచర్ల అని యేర్పడినట్లు భావింప వీలగుచున్నది.[94]" ఇట్లుగాక, "పల్నాటివీరుల చరిత్రతో ప్రబల సంబంధము కలిగిన బ్రహ్మనాయుడు మజిలీచేసినచోటుగావున (చంద్ర వంకకు వచ్చి జలకమ్ములాడి మజిలీచేసిన చోటు మాచెర్లయనుచు పట్నంబునకు పేరు పరగంగబెట్టె) మాచెర్ల యని పేరు వచ్చెనని కొందరు, మాచమనాయకుడు అను ఏలికపేర మాచెర్ల యను పేరు వచ్చెనని కొందరు, మారీచుడేలిన ప్రదేశము గావున మాచెర్ల అయినదని కొందరు పరిపరి విధముల మాచెర్ల నామచరిత్రమ వింత వింతలుగ చెప్పుదురు.[94]" 'మావి' అనగా మామిడిచెట్టు సంబంధముగా నాపేరు వచ్చినదనువారును కలరు. [96]

మూల్పూరు (తె)

స్థానిక కథనాల ప్రకారం ఇది మునుల వాసస్థలంగా వుండి మునిపురమని మొదటచెప్పబడి తరువాత కాలంలో మూల్పూరుగా అప భ్రంశం చెందినది.[97]

వినుకొండ (వి)

శ్రుత పర్వతమని దానికి సాహిత్య వ్యవహారం. రామలక్ష్మ ణులు జటాయువు ద్వారా సీతాపహరణ వార్త నా చోట వినుటచే నిది 'విన్నకొండ' యై తరువాత వినుకొండగా మారినదని నమ్మిక.[98] శ్రీరాముండేకొండ శిఖరమునఁ గన్నిట నాలించె సీతాపహరణ వార్త అని" నవయుగ కవి చక్రవర్తి జాషువా.

వెదుళ్ళపల్లి (బా)

"ఈ గ్రామాన్ని మొదట్లో వేణుపురి అనేవారు. వేణుగోపాల స్వామి ఈ వూరిదైవం. వేణువుకు వెదురు అని కూడా అర్థంవుంది. పూర్వమిక్కడ వెదుళ్లు ఎక్కువగా వుండేవట. అందుకని వేణుపురి వెదుళ్లపల్లిగా మారింది.[99]"

వేల్పూరు (స)

రామలింగేశ్వర, చెన్నకేశ్వర, విశ్వేశ్వరుల ప్రాచీన దేవాలయ ములున్న ఊరు. ఇందరు వేల్పులు వెంచేసి యున్న ఊరు వేల్పూరు అను సార్థకనామధేయం పొందినది.[100]

వైకుంఠపురం (గుం)

'బంధవిరామ' అను సంస్కృత నామధేయం కలిగి యుండిన ఈ ఊరు శ్రీమహావిష్ణు సదనమైన వైకుంఠపురంగా పేర్వడి నదందురు.[101]

సీతానగరం (గుం)

శ్రీరామచంద్రుని భార్యయైన సీతాదేవి పేర వెలసిన గ్రామములు.[102]

వడ్డేశ్వరం, లచ్చన్నగుడిపాడు, కోవెలమూడి (అన్నిగుం), పెరుమాళ్లపల్లి, శివపురం, వేల్పూరు (అన్నివి), గుడిపూడి, మునిపల్లి (బా), దేవరపల్లి, గుడివాడ, మునిగోటిపురం, వరాహపురం, (తె), విశ్వేశ్వరం (రే), చెర్లగుడిపాలెం (ప), గుడిపాలెం, గుడిపూడి, పలి దేవర్లపాడు, (స) వంటి గ్రామనామములు కూడా హిందూదేవతా, మతవిశ్వాసపూర్వజనితములని పేర్కొన వచ్చును.

బౌద్ధ, జైన, సంబంధములు

బుద్ధాం (బా)

"ఈ గ్రామమునకు మొదట బుద్ధగ్రామమని పేరుండి అది క్రమముగ బుద్ధగామము, బుద్ధగాం, బుద్దాంగ మారియుండును. ఈ గ్రామం మొత్తముమీద బౌద్ధశిథిలములేని ఇల్లు ఒక్కటియైనను లేదు"[103]

లాము (గుం)

ఇది ఒక ప్రాచీన బౌద్ధస్థావర మగుటచేత బౌద్ధ 'లామా' నివాసమైయుండి ఆ పేరు తెచ్చుకొని యుండవచ్చునని భావింపబడినది.[104]

దీపాలదిన్నె (గుం)

అమరావతి స్థూపముండిన ప్రదేశమును "ప్రజలు 'దీపాలదిన్నె దీపాలతిన్నె, దీపాలదివ్వె, దీపాలదిబ్బ దీపాలకొండ, యను స్థానిక నామములతో పిలుచుచున్నారు.... చైత్యమును దాతుగర్భమని యందురు. దాతుగర్భమునకే 'దాగోబా' అని బౌద్ధమత పరిభాషలో అందురు. దాగోబా పదము 'దిబ్బ' యను రూపము పొందినదనియు ఎచ్చట ధరణికోట మహాచైత్యము దీపాలంకారయుతమై, ప్రకాశమానమై యుండెనో, ఆ దాగోబా దిబ్బయే, దీపాలదిన్నె' యనుపేరు పొంది యున్నదనియు అభిజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు.[105]"

దీపాలదిన్నె పాలెం(వి)

"పశ్చిమం గ్రామమునకు పశ్చిమభాగమున, అత్తలూరుకు ఉత్తరమునను, 60 అడుగుల వ్యాసము 8 అడుగుల ఎత్తునుకల దీపాల దిన్నె అను ఒక వృత్తాకారముగల మట్టిదిబ్బకలదు. దానిపై దీపాల దిన్నెపాలెం అను గ్రామమున్నది[106]"

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 'నాగార్జునకొండ' బౌద్ధాచార్యుడైన నాగార్జునుని పేరు కలిగియున్నది.

'పాడు'లు

'పాడు' నామాంత్యముగల గ్రామములు ఒకప్పుడు జైనస్థావరములని భావిస్తారు. వీరశైవ, వైష్ణవ విజృంభణలో అవి 'పాడు' లైనవని ఒక సిద్ధాంతం.[107] ఉదాహరణకు ఈ జిల్లాలో కంభముపాడు (స) అను గ్రామములో జైనాలయ శేషములున్నవి. కాని ఈ జిల్లాలో పాడులు శతాధికముగ నున్నవి. ఉదా ఉప్పలపాడు (గుం&న& స&ప), కంభంపాడు (స&ప&వి) తక్కెళ్లపాడు (గుం&స) గరికపాడు (బా& వి) కాట్రపాడు (గుం&బా) గారపాడు(స&గుం). ఇవి యన్నియు ఒకప్పటి జైనమత ప్రభవజనితములేనా అనునది వివేచింపవలసిన విషయము కాగా 'పాడు' అనగా ఒక పెద్ద గ్రామమును చేరి యున్న చిన్న గ్రామము అను వేరొక వివరణ యున్నది.[108] మంగళగిరి - మంగళగిరిపాడు (గుం), అన్నవరం - అన్నవరప్పాడు (న) వంటి గ్రామములు ఒకదానికొకటి చేరువగనే యుండియుండిన ఈ వివరణయు అర్థవంతముగనే తోచును.

(సశేషం)

# వివరింపుమా భారతీ!

## శ్రీ కుంటిమద్ది శేషశర్మ

ఆరువదియేండ్లు నిండినవి యమ్మరో భారతి! నీకు : కాని యీ
యరువదియేండ్ల ఖండము ననాదియనంతమునైన కాల ని
ర్ఝరమున, నీటిచుక్క కును సాటికి వచ్చునె సాగరమ్ము నం
దరసిన? నైన సారతమ మయ్యది మానుష జీవితమ్మునన్. 1

కాశీనాథుని పెంపకాన మృదపత్కం జాత సంచార లీ
లా శోభా రతి, భారతీ! పరపి, బాల్య క్రీడలందేలి, సు
ధ్యా శీతుస్సల్‌గని, ప్రౌఢవై, సకలవిద్యా ప్రౌఢిమల్ జూపినా,
వా శాంతమ్ములఁగీర్తి వల్లరులు పూయల్ బాండితీ పుష్పముల్ 2

భారతి! తావకీన పద పంకజ నూపుర కింకిణీ ఝణ
త్కారము దూరమైన యొక కమ్మని వాఙ్మయము న్నె? నీదయాఽఽ
సారములేని శాసన విచారము గానగరాదు; లేదు నీ
కూరిమి నోచుకోని మది గూర్చెడి హాస్యపు భావ చిత్రముల్ 3

కవి మూర్ధన్యుల కావ్యకన్యల జగత్కల్యాణ లావణ్యముల్
సువిమర్శా నలపాక పక్వముగ సంశోధించి, బాగోగువన్
చవి చూపించుటెకాదు లోకులకు, ప్రోత్సాహంబు గల్పించుచున్
కవి భూష్ణ గ్రథితమ్ములౌ కృతులకున్ ప్రఖ్యాతి గల్పింపవే! 4

పాండిత్య ప్రతిభా సముజ్జ్వలకవుల్, వాచార్థ సౌందర్యముల్
నిండారన్, ధ్వనివృత్తిగమ్య రసికాళీ శ్లాఘ్య నానార్థవున్
భాండారమ్ములు ప్రాసముల్ యతులు సంభావించి; పద్యములు
ద్దండుల్ వ్రాయగ, నిచ్చమెచ్చితివి తత్సారస్యమున్ భారతీ! 5

గణయతి ప్రాసాలు కవిత కన్నియ కాలు
కదలింపనేని శృంఖలము లంచు,
నైఘంటి కార్థముల్ నట్టేటిలో ముంచి,
నేయార్థకమ్ములనే గ్రథించి,
ఇన్ని గణమ్ములే నిన్ని మాత్రలు నేసి
పంక్తికి యను పరిపాటి దించి,
వాచ్యవాచక నైజ బంధాలు తొలగించి
శాబ్దిక ప్రక్రియా సంధులుడిపి,

“నేను దలచిన భావమ్ము దీనినుండి
తెలిసికొను” డంచు. కొంగ్రొత్తతెగ కవిత్వ
మంచు గవిపుంగవుల్ వ్రాయు నట్టి కావ్య
రీతులను గూడ నావిష్కరించినావు. 6

అడుగు చుంటిని భారతీ! అరువదేండ్ల
యనుభవమ్మును జీర్ణించుకొనిన దాన,
వరమరికలేక వివరింపుమా కవిత్వ
మేది లోకమ్ము ప్రగతి సంపాదకమ్ము? 7

నీకు జోహారు నిర్నిద్ర నిత్యనూత్న
కాంతులెసగించి, లోక విఖ్యాతి గాంచి,
అంధతమసమ్ములో నయనాంధ్యముడుప
భారతీ! వెల్గు మా చంద్ర తారకముగ, 8



## శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# శ్రీకూర్మ చాళుక్యులు

తెలుగునాటి ఉత్తర ప్రాంతాల్ని మధ్యయుగాల్లో పాలనచేసిన అనేక మాండలిక కుటుంబాలలో శ్రీ కూర్మ చాళుక్య శాఖ ఒకటి.[1] చంద్రవంశీయులమని, రాజరాజనరేంద్రుని సంతతివారమని ప్రకటించు కొనిన యీ శాఖీయులు తూర్పు గాంగ వంశీయుల మంత్రులుగా, సామంతులుగా ప్రస్తుత శ్రీకాకుళపు జిల్లా ప్రాంతాల్ని పదమూడు, పదునాల్గు శతాబ్దుల్లో ఆక్రమించినట్లు వారి శాసనాలు తెల్పుతున్నాయి. సమ కాలీన రాజకీయరంగంలో తమదైన ఒక ప్రత్యేకముద్ర నేర్పరచుకొని గణుతికెక్కనప్పటికీ మాండలికులుగా స్థానిక చరిత్రపై వీరి ప్రభావము స్వల్పము కాదు. వీరి ఆధిపత్యమా ప్రాంతాల్లో నాలుగు తరములవరకు కొనసాగింది.

ఈ వంశీయుల చరిత్ర తెలుసు కొనుటకు ప్రముఖముగా శ్రీకూర్మ[2], సింహాచల[3] ఆలయములలోని వారి శాసనములే ఆధారము, ఈ శాసనాలలో వీరు, వేంగీ చాళుక్యులలో చివరి వారై క్రీ.శ. 11వ శతాబ్దిలో పాలించిన విమలాదిత్యుని, రాజరాజ నరేంద్రుని తమకు పూర్వీకులుగా చాటుకొన్నను, తమ శాసనములందెచ్చటను చాళుక్యుల వంశ ప్రశస్తిని మాత్రము చెప్పుకొనలేదు. సుమారుగా యిదే కాలములోని యితర మాండలిక వంశములైన జననాథపుర, ఎలమంచి, నిరవద్యపుర చాళుక్య వంశములు కూడ వేంగీ చాళుక్యుల సంతతివారమని చెప్పుకోవటాన్ని బట్టి[4], యీ వారసత్వాన్ని గూర్చి చాటుకోవటమనేది సాధారణ విషయముగనే గుర్తించటం భావ్యం వేంగీ చాళుక్యులతో వీరెవరికి ప్రత్యక్ష సంబంధము లేకపోవుటయే కాక యీ శ్రీ కూర్మ శాఖకు సంబంధించినంత వరకు విమలాదిత్యుడు వీరి వంశమును ఉత్తర కళింగమున స్థాపించెననుటకు యితరాధారమేదియును లేదు. విమలాదిత్యుని పుత్రుల మూలంగా వీరి వంశస్థాపన జరిగెననుటకును కుందవ దేవేరి వలన రాజరాజ నరేంద్రుడును, మేడవ మహా దేవివలన విజయాదిత్యుడును తప్ప విమలాదిత్యుని కితరసంతతి లేదు. రాజరాజ నరేంద్రుని ఏకైకపుత్రుడైన రాజేంద్రుడు కులోత్తుంగుడై చోళమండలమునకు వలస పోవుటయు, విజయాదిత్యుని పుత్రుడైన రెండవశక్తి వర్మ తండ్రి కన్నముందుగనే పరమపదించుటయు జరుగుటచే వీరిలో నెవరును ప్రత్యేక శాఖలనేర్పరచి నట్లు తోచదు. కనుక వేంగీచాళుక్యుల తోడి వంశీయుల సంబంధము సంప్రదాయకమైనవి కావచ్చును గాని స్పష్టమైనది కాదు. తూర్పు గాంగులతోడి సన్నిహిత బాంధవ్యములే యీ కుటుంబమునకు ఉత్తరాంధ్ర రాజకీయములతో సంబంధమేర్పరచినది. మొదటి వీర భాను దేవుని రాణిజక్కులదేవి, మూడవ రాజరాజు భార్యయైన మంకుందదేవి, మూడవ భానుదేవుని దేవేరి యైన హీరాదేవి మున్నగువారు చాళుక్యవంశజులగుట కొంత వరకు వీరి ఉత్తర కళింగ ప్రవేశమునకు వీలు కల్పించి యుండవచ్చును.

శ్రీ కూర్మమునందలి శాసనములలో వీరి వంశానుక్రమణిక దిగువవిధముగా సూచింపబడినది.[6] ఇతర శాసనములందలి అంశములు లేనిది సరిపడుటచే దీనిని ప్రామాణికముగనే గ్రహింప వచ్చును.




వీరిలో మొదటి విజయాదిత్య, రాజరాజుల శాసనములేవియు లభ్యము కాకపోవుటచే వారి వివరములు పూర్తిగాతెలియవు. ముందు పేర్కొనినట్లు విమలాదిత్య, రాజరాజ నరేంద్రులతోడి వీరి సంబంధము కూడ కేవలము సంప్రదాయకమైనదియే కాదగును. శ్రీ మసునూరి సాంబశివ రామమూర్తిగారు[7] యిందలి మొదటి విజయాదిత్యుని రాజరాజ నరేంద్రుని పుత్రునిగా పరిగణించి ఈతని మూలముననే శ్రీ కూర్మ ప్రాంతములలో చాళుక్యవంశము వ్యాప్తి చెందెనని పేర్కొనియున్నారు. ద్రాక్షారామపు శాసనమున[8] కానవచ్చు సోమలదేవి యీ విజయాదిత్యుని సోదరి యనికూడ భావించినారు. కాని వారు చెప్పినది వాస్తవముగా

-తోచదు. రాజరాజ నరేంద్రునికి విజయాదిత్యుడను పుత్రుడు లేకపోవు -టనుబట్టియు, విజయాదిత్యునికి దేవేరియైన రేవలదేవి వలన పుట్టిన సోమల దేవికి అతడు నిజసోదరుడనుట కేవలము నిరాధారమగునూహ యగుటనుబట్టియు, పారివాదము నంగీకరింప నవకాశము లేదు.[9] ఒక కుటుంబము ప్రఖ్యాతిగన్న ముందువంశముల వారసులమని ప్రకటించు కొనినంతలో ఏ ఆధారము లేకపోయినను వ్యక్తులను సృష్టించి వీరిని వారికి ముడిపెట్టనవసరము లేదు. ఈ శాఖీయులకు వేంగీ చాళుక్యుల వారసులతో దూరపు బాంధవ్యము వుండివుండవచ్చును. అగునంత మాత్రమున యీ శ్రీ కూర్మ శాసనములు వాంఛించు చున్నవను నెప పమున రాజరాజ నరేంద్రుని పుత్రునిగా యింతవరకు ఎరుగని ఒక విజయాదిత్యుని కల్పింప నవసరము లేదు.

ఇక కాలనిర్ణయము విషయము చర్చింతము. ఇందలి మొదటి విజయాదిత్యుని కాలమునుగూర్చి శ్రీమతి యశోదాదేవిగారు క్రీ॥ శ॥ 12వ శతాబ్ది కడపటి దశలోనుండియుండునని భావించినారు[10]. ఈ వంశీ యుల శాసనములలో లభ్యమైన తొలిశాసనము[11] రెండవ విజయా దిత్యుని క్రీ॥ శ॥ 1273 నాటి దగుటచే ఆమె రాజరాజు పాలనాకాల మును సుదీర్ఘకాలముగా క్రీ॥ శ॥ 1273 వరకును పెంచినారు. మధ్యాంధ్ర యుగమున అనంతవర్మచోడ గంగుని వంటిరాజులు కొందరు సుదీర్ఘపాలనా కాలములు కల్గియుండుట చారిత్రిక సత్యములే అయినను, శ్రీకూర్మచాళుక్యుడైన యీరాజరాజునకు ఏ ఆధారము లేనిదే యింత సుదీర్ఘపాలనాకాలము అంగీకరింప దగినదా అని సంశ యము. అదియునుకాక నీతడుస్వయం ప్రతిపత్తి కలపాలకుడుకాడు. కడపటి గంగావంశమున క్రీ॥శ॥ 1238-1263 మధ్యకాలమున పాలిం చిన మొదటి నరసింహుని కీతడు మంత్రియని రెండవ విజయాదిత్యుని శాసనము తెల్పుచున్నది[12] కనుక సుమారులో నీతని కాలమును క్రీ॥ శ॥ 1250 ప్రాంతముగా పరిగణింపవచ్చును. ఈతని తండ్రియైన మొదటి విజయాదిత్యుడు క్రీ॥ శ॥ 1225 ప్రాంతమున యుండియుం డును. మిగిలినపాలకుల అందరిశాసనములు లభ్యమైనను చివరివారైన పురుషోత్తమ, విశ్వనాథుల విషయమున కొంతపరిశీలన అవసరము. పురుషోత్తముని తొలిశాసనము శ్రీ కూర్మముననే క్రీ॥ శ॥ 1277లో యివ్వబడినది.[13] కడపటి శాసనముకూడ అచ్చటనే క్రీ॥శ॥ 1318లో దత్తపరుపబడినది.[14] దీనినిబట్టి సగటు చారిత్రిక పద్ధతిని యీ రెండు శాసనముల మధ్యస్థ కాలమైన నలుబదియొక్క సంవత్సరములను పురుషోత్తముని పాలనాకాలముగా జరుగవలెను. కాని అటుల గుర్తించుటకు వీలుకానటుల క్రీ॥శ॥1307,1308,1309 సంవత్సరముల లోని మూడు శాసనములు[15] పురుషోత్తముని పుత్రుడైన విశ్వనాథుని పాలకునిగా పేర్కొనుచున్నవి. కనుక విశ్వనాథుని క్రీ॥శ॥ 1307 నుండి 1318 వరకు తన తండ్రితోడి సంయుక్తపాలకునిగా గుర్తింప వలెను. వీరి శాసనస్థ విషయములను బట్టి వీరిపాలనాకాలముల నీక్రింది విధముగా వేర్పరుప నవకాశమున్నది.

| | |
|---|---|
| మొదటి విజయాదిత్యుడు | — క్రీ॥ శ॥ 1225-1250 |
| రాజరాజు | — క్రీ॥ శ॥ 1250-1273 |
| రెండవ విజయాదిత్యుడు లేక విజయమార్కుడు | — క్రీ॥ శ॥ 1273-1277 |
| పురుషోత్తముడు | — క్రీ॥ శ॥ 1277-1318 |
| విశ్వనాథుడు లేక జగన్నాథుడు | — క్రీ॥ శ॥ 1307-1318 |

## పూరీ తామ్రపట్టికలయందలి పురుషోత్తము డీ వంశీయుడు కాడా ?

వీరి వంశచరిత్రలోనిది సూక్ష్మ పరిశీలింప దగిన అంశము.

సుమారు అరుదశాబ్దముల క్రిందట ఒరిస్సాలోని పూరీజిల్లాలో నొక తామ్రశాసనము బయల్పడినది.[16] దానికి కడియముగాని రాజ ముద్రికగాని లేవు. విడిరేకులు అరుమాత్రము కలవు. మొదటి ఐదు రేకులపైనను తూర్పుగాంగచక్రవర్తుల ప్రశస్తి, చంద్రునినుండి రెం డవ భానుదేవుని వరకుగల వంశవివరములు పూర్తిగ పేర్కొన బడి నవి. ఈ రేకులపైనున్న వ్రాతను బట్టియు, అయిదవ రేకుదివర ఖాళీస్థ లము విడిచిపెట్టుటను బట్టియు యీరేకులు అవసరమునకుపయోగించు కొనునట్లు ముందుగనే వ్రాయించి యుంచినటుల స్పష్టమగును.[17] ఆరవ రేకు మాత్రము పరిమాణమునను, వ్రాయబడిన విధానమునను పైరేకులతో చాలవరకు పోలియున్నను, దీనికి మిగిలిన రేకులతో సంబంధములేదు. పురుషోత్తమదేవుని ఐదవవిజయరాజ్య సంవత్సరమైన క్రీ॥శ॥ 1312లో నిది యొసగ బడినట్లు ఆరవ రేకునందలి వివరము తెల్పుచున్నది. వీరశ్రీ భానుదేవుని సన్నిధిలో దక్షిణ సముద్ర తీరమున విడిదిచేసి యున్న పురుషోత్తముడు కొన్నిగ్రామములను 'సంధివిగ్రహి' యైన రంగదాస శర్మకు దత్తపరచిన అంశమిందు పేర్కొనబడినది. దీనిని బట్టి యీ శ్రీకూర్మ చాళుక్యుడైన పురుషోత్తముడు క్రీ. శ. 1312లో రెండవ భానుదేవుని కొలువులో పూరీప్రాంతమున నుండినట్లు స్పష్ట మగుచున్నది. కాని ఆర్. డి. బెనర్జీ పండితుడు పై చాళుక్య పురుషో త్తముని పాలన క్రీ॥ శ॥ 1307తో ముగిసి అతని పుత్రుడైన విశ్వ నాథుని పాలన ప్రారంభ మగుటచే క్రీ॥ శ॥ 1312 నాటి యీ పురు షోత్తముని వేరువ్యక్తి కాదగుననియు, ఈతడే భానుదేవుని బంధింది రాజ్యముకై వశమొనర్చుకొని యుండునని ఊహచేసినారు.[18] కాని యీ అభిప్రాయము వాస్తవ దూరమైనది. ఈ పూరీ తామ్రపట్టికలలో కాన వచ్చు పురుషోత్తముని శ్రీ కూర్మశాసనములలో కానవచ్చు పురుషోత్త ముని కన్నా భిన్నుడగువానిగా నిరూపించు అవసరమును, అవకాశ మునుకూడ లేవు. ఇదే సమయమున, ఇదేప్రాంతమున నొకపురుషోత్త

ముడు వీరభానుదేవుని సామంతునిగా కానవచ్చినప్పుడు, అతనిని విడిచి పెట్టి యీ పూరీశాసనమును ఏఆధారమును తెలియని పురుషోత్తమునికి ముడిపెట్ట పోవుట పద్ధతికాదు. కాలానుక్రమణికలో పేర్కొనినట్లు పురుషోత్తముడు క్రీ॥ శ॥ 1277 నుండి 1318 వరకు నుండినట్లు శ్రీకూర్మ శాసనములు తెల్పుచున్నవి. కాని క్రీ॥ శ॥ 1307 నుండి యీతని పుత్రుడైన విశ్వనాథుని పాలకునిగా చేయుటచే, బహుశః ఆ సంవత్సరమున పురుషోత్తముడు శ్రీకూర్మ ప్రాంతముల బాధ్యతనాతని పరముచేసి గాంగ ప్రభువులకొలువులో మరింత గొప్పబాధ్యత నిర్వహించుటకై అచటకేగి యుండును. ఇట్లు భావించుట చారిత్రకాధారములను సమన్వయించుకొనుటకు మాత్రమే. జెనర్జీ పండితుని అభిప్రాయమున యీ పురుషోత్తముడు భానుదేవుని బంధించి రాజ్యాధికారము చేజిక్కించుకొనెను. కాని యీ అభిప్రాయమున కాధారమేది? పైతామ్రపట్టికలు పురుషోత్తముడే ఒసగినను అవి వీర శ్రీభానుదేవుని సన్నిధిలో యివ్వబడినట్లు స్పష్టముగా పేర్కొన బడినదికదా! ఇది విధేయత ప్రకటించుచునట్లు తెలుపదా? తమ శ్రీకూర్మ శాసనములందు యీ సమయమునందే పురుషోత్తమ, విశ్వనాథులు భానుదేవుని సార్వభౌమత గుర్తించుట యీ సందర్భమున పరిగణింపదగినది. కనుక పై తామ్ర శాసనపు పురుషోత్తముని, శ్రీకూర్మచాళుక్య కుటుంబములోని పురుషోత్తమునిగా భావించుట పూర్తిగా సమంజసము.

అయినచో అట్లు గుర్తించుటకు బాధకమగు అంశమొకటి కలదు. శ్రీ కూర్మపురుషోత్తముడు క్రి. శ. 1277 లో అధికారమునకు వచ్చుట సంభవించినది. పూరీ తామ్రశాసన దత్తకాలమైన క్రి.శ 1312 నాటికి అతని పాలనాకాలము 35 సంవత్సరములగును. కాని ఆ శాసనమున అతని ఐదవ విజయరాజ్య సంవత్సరము పేర్కొనబడినది. దీనినిబట్టి అతడు క్రి. శ. 1307 లో పదవికి వచ్చినట్లు తెలియును. సరిగ్గా యిదే సంవత్సరమునుండి యీతని పుత్రుడైన విశ్వనాథుడు శ్రీకూర్మమునుండి పాలన నెఱపుచున్నట్లు శాసనములు తెల్పుచున్నవి. కనుక పూరీ తామ్రశాసనమునందు పురుషోత్తముని విజయరాజ్య సంవత్సరములు క్రి. శ. 1307 నుండి మాత్రమే, అనగా అతని నూతన పదవీ కాలమునుండియే పరిగణింప బడినదని గ్రహించవలసి యుండును.

పదమూడవ శతాబ్దపు రెండవ పాదమునుండి సుమారుగా నూరు సంవత్సరములు ఉత్తర కళింగమున కడపటి గాంగుల మంత్రులుగా, సామంతులుగా వర్ధిల్లిరనుట తప్ప వీరికి ప్రాముఖ్యత కల్గిన రాజకీయ చరిత్రలేదు. 'యవనావనీ వల్లభ' లమని ఘనమైన బిరుదములు దాల్చిన గాంగుల తోడి సంబంధ బాంధవ్యములను బట్టి, యీ శాఖీయులు కూడ వారి తురకల తోడి యుద్ధములలో తమదైనపాత్ర నిర్వహించి యుందురు. శాసనములు రెండవ విజయాదిత్య, పురుషోత్తముల పరాక్రమ శీలములవర్ణించుచున్నవి తప్ప వివరములు పేర్కొనలేదు.[19]

## భారతకర్తృత్వ విషయము

వీరి శాసనములలో మనము గుర్తింపదగిన మిక్కిలి ఆసక్తిదాయకమైన అంశమొకటి మిగిలియున్నది. అది రెండవ విజయాదిత్యుని క్రి. శ. 1273 నాటి శ్రీకూర్మశాసనమున చేయబడిన భారతాంధ్రీకరణమును గూర్చి పేర్కొనుట విచిత్రము కాదు. కాని వీరి శాసనమున చెప్పబడిన విషయము మాత్రము అత్యంత ఆశ్చర్యకరమైనది. ఈ సందర్భములోని శాసన వాక్యాన్ని గమనించండి–

— "శ్రీరాజరాజ నృపతేః సువిశాలకీర్తేః
యస్సూరిభిస్సహకిలస్మృతిజాలసార మంధ్రీ
చకారవర భారతవంశ వృత్తం" —

దీనినిబట్టి రాజరాజనరేంద్రుడే పండితుల సహాయముతో మహాభారతాన్ని ఆంధ్రీకరించినట్లు భావించటాన్కి వీలుంది. కాని దీనిలోని 'ఆంధ్రీచకార' అనుదానిని ప్రేరణార్థకంగా గ్రహిస్తే భారతకర్తృత్వ వివాదం రాదు.

## అధోజ్ఞాపికలు

1. జె. ఎ. హెచ్. ఆర్. యస్, వాల్యూమ్ నెం. 21 పే. 62
2. ఎపిగ్రాఫి యిండికా వాల్యూమ్ నెం. 5 పే 33
3. యస్. ఐ. ఐ. వాల్యూమ్ నెం. 6, 1000, 1002 ము॥
4. ,, ,, నెం. 665
5. హిస్టరీ ఆఫ్ ఒరిస్సా పే. 259, 289
6. రెండువలె
7. 1976లో రామచంద్ర పురమున ఆంధ్ర ప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు సమావేశములలో వారు సమర్పించిన వ్యాసము.
8. యస్. ఐ. ఐ. వాల్యూమ్ 4 నెం. 1007.
9. భారతి. 1981 ఫిబ్రవరి, పే. 19.
10. ఒకటి వలె.
11. రెండు వలె.
12. రెండు వలె.
13. రెండు వలె.
14. రెండు వలె.
15. యస్. ఐ. ఐ. వాల్యూమ్ 5 నెం. 1214; వాల్యూమ్. 6 నెం. 1000, 1002
16. హిస్టరీ ఆఫ్ ఒరిస్సా పే 278
17. పైవలెనే.
18. ,
19. శ్రీమతి యశోదాదేవిగారు పొరపాటున మరికొన్నిశాసనములను కూడ (యస్. ఐ. ఐ. 4 నెం. 1362, 6 నెం. 896), యీ చాళుక్య పురుషోత్తముని శాసనములుగా గుర్తించినారు.
20. రెండు వలె.

# భారం నీదే!

తిన్నని కన్నులా,
మంగళమయమైన మనస్సునా,
సమగ్ర ప్రపంచాన్ని
వీక్షించే దొరా!

నీ తల సాలన

దివ్వియనై వెలుగొందాలని
కప్పురపు బిళ్ళనై కమ్మన లొలుకాలని
కొబ్బరికాయనై బలి అవ్వాలని
అపవర్గాన్ని అందుకోవాలని
ఏవేవో కోర్కెలతో

ఉబలాటపడ్డాను!

కాని

నా తలపుతో

స్నేహం, త్యాగం, నైర్మల్యం
కొఱవడ్డాయి!
ఈ 'మలిన శరీరాన్నే'
నీకర్పిస్తున్నాను!
ఇది కసుమాలమని
రోయకు!
కాలరాయకు!
కృపఝూడు!
దయగను!

# రక్ష రేకులు!

స్వామీ!
పొద్దస్తమానం
నీ నయననీలాబ్జాల చుట్టూ
తుమ్మెదలాగా
పరిభ్రమిస్తూ

వాటిలోని మధురమయిన
"కృపా మకరంద బిందువుల్ని"
కడుపారా గ్రోలుతూ
చొక్కుతుంటాను
సోలుతుంటాను!
రాత్రి మొత్తం
నీ నయన నీలాంబుద వలయాల్లో
తుమ్మెద లాగానే బందీగా పడిఉంటు
గుండెలమీద చేయివేసుకొని
కునుకుతుంటాను
స్వప్నిస్తుంటాను!
ప్రబుద్ధమయినా-ముకుళితమయినా
అవిరతం
అవి నన్ను సాకుతూనే ఉంటాయి
నాకు కాపు గడగానే ఉంటాయి
నన్ను ఎలాంటి పీడలకి
ఎరగాకుండా సంరక్షిస్తూనే ఉంటాయి
విభూ !!


శ్రీ కె. కిశోరు బాబు
శ్రీ కె. అశోకు బాబు

# యశోధర (దృశ్యకావ్యము)

కన్నడమూలము : డా॥ మాస్తి వేంకటేశ అయ్యంగార్

తెనిగింపు : శంకరగంటి రంగాచార్యులు

(గత సంచిక తరువాయి)

(యశోధర అంతఃపురము, యశోధర, అంబిక)

యశో : ఇప్పుడు నగరము వత్తురా వారు, అంబికా ?

అం : ఔను తల్లీ

యశో : ఎదురుకొనుటకై పలుమంది ఏగిరా ?

అం : ఊరు ఊరే బయలుదేరినది.

యశో : ఊరుఊరే వీరినెదురుకొనగా బయలు దేరినది. నేను పోరాదు. నా పుణ్యమును ఏమంచు నిందింతు ? కపిలవస్తువు నందు బాల్యమున వారున్న కాలమున ఇంతంత తెలిసినవారు, తెలియనివారు; అంతి పురితోన ఇంతింత సేవచేసిన వారు, చేయని వారు; దూరమున నిలిచి మ్రొక్కిన వారు; దారిలో చనుచున్న తోడి వారల తోడ' అదె చూడు యువరాజు, సిద్ధార్థుడేగెడిని' అనువారు; గురుతున్నవారు, లేనట్టివారును, వారి పేరు మాత్రమె విన్నవారు, వినని వారు; అందరును, 'మా వాడు, మారాచ కొమరుండు, మా గురు'వటంచు సంభ్రమముతో నాపతిని కనవచ్చు, తనమునః ప్రాణ సర్వస్వమును అతని తనుమనః ప్రాణ సర్వస్వమును కలిపి ఒక్కటై, బ్రదుకులో అర్థముగ నున్న సతి నేనిప్పుడు కనరాదు.

అం : తల్లీ గురువుల మీరు కనవచ్చునని నాదు భావమ్ము.

యశో : గురువులను ! ఏమి ఇది అంబికా ? ప్రాణేశు నీవును గురువులుగ చేసి కొని యుంటివా ?

అం : నాతల్లి, వారి చూచెడి వరకు యువరాజు, సిద్ధార్థుడు, శాక్యరాజ సుతుండు, పతి, కొడుకు, దొర, తండ్రి– అనుచు వారలు వారి వారి సంబంధమును తలచుకొనుటకు సాధ్యమగును. చూచిన పిదప అందరును అతనిని గురువనియె పిలిచెదరు.

యశో : నారాజు నన్ను విడినప్పుడు లోకమునెల్ల విడిరంచు తలచితిని నేను. ఆలోచింప నన్నుమాత్రమె వారు విడిచిరని తోచెడిని. మిగత జనులందరును, జగమ్ము, లోకమ్ము ఇప్పుడును అతనికి ప్రియము; అతడందరికి గురుడునై, పూజ్యుడై యున్నారు. నేనొకతె త్యాజ్య, నాతనికి వర్జ్యను. నేను ఒక్కతెయె వారి నావారంచు పిలువనేరని పాపి.

అం : తల్లీ, ఇట్టుల మాటలాడకుడు, నిక్కముగ గురుదేవులొక్కటియు విడలేదు. జగమునే కట్టుకొన్నారు. జగమంత ప్రియమాతనికి. ఎల్లజగతికి ప్రియుడు తాను, మీ నుండి జగతివారిని పొందె, మీదు పుణ్య ఫలమ్మె లోకమును వారి రూపమున రక్షించెడిది.

యశో : అంబికా, చాలింక. ఊరుకో, మొదలంత నాదు కష్టముకాంచి కనికరించుచుంటి విప్పుడు నాకీతత్వమును బోధించెదవ ?

అం : తల్లీ, నేమీకేమి నేర్పెదను ? ఇందాక నన్ను కాపాడు దేవి వటంచు సేవించి, తింక మీ లోన గురువత్నిని కనుంగొనెద

యశో : నాకీవు గురుపత్ని పట్టమును కట్టితివి. గురువు మాత్రము నన్ను గురుతింప దంబికా, రాహులునివోలె నీవుని నాదు చేయి వీడి గురువులను వెంబడించెద ? కలలో నాదు ఊడిగింపు జనములను జనములను నను వీడి చనెదరని కనలేదు,

అం : తల్లీ, నేమిమ్ములను వీడెదన? ఏ సుఖముకై విడుతు ? ముక్తి సుఖమునకా ? మీరుమనసార చేయెత్తి ఈయని ఒక్క లవలేశ సుఖమునైనను నేను ఒల్లను. బాల్యదశ నుండియును సేవలో జతనుండి మీరు విడిచినదియె ప్రసాదముగ ఎంచుకొని బ్రదుకెల్ల కడపితిని. రెండవదియగు పంక్తి సుఖియింప నాకు అభ్యాసమయినది, తల్లీ, నేడు తొందరపడను.

యశో : అంబికా, అలుగకుము. ప్రాణేశు చూడరాదే అన్న బాధతో ఏమిటో పలికితిని. నిజమంచు తలపకుము.

(దూరమున కోలాహలము, వాద్యగోష్ఠి, వేద ఘోష, జనులకలకలము వినబడును.)

అం : విచ్చేసిరదె ప్రభువు.

యశో : ఎట్టి నిర్ఘోషమిది! శాక్యుల ప్రమోదాబ్ధి మేర మీరెను నేడు. దగ్గరికి వచ్చె శబ్దము. వీధికేతెంచిరే ?

అం : (కిటికీ దగ్గర నిలచి) ఔను తల్లీ.

యశో : ఏల శబ్దమది నిలచినది ?

అం : ఇట నిలచి అంతయును కనవచ్చు. నాతల్లీ.

యశో : నేనచట నిల్చి చూచిన నాదు ఈ దృష్టి ఆ దివ్య దేహమును సోకి ఇంకేమశుభమంటునో, కాన నేనటకేగి కనుగొనను. నీవు నా కనులగుము. చూచినది వర్ణించు కనులతో త్రాగునది చెవులతో త్రాగెదను.

అం : రాజవీధికి నడుమ మెరపడి నిలిపినారు. ఐదువలు వచ్చి హారతు లెత్తుచున్నారు.

యశో : వివరములు చెప్పుమరి. వారెచట నిలబడిరి ? వేషభూషలవేవి ? దగ్గరెవరున్నారు ?

అం : రాజపథమున నిండ వెనుకగా ఊర్రిప్రజ క్రిక్కిరిసి నిలిచినది. ముందటను, ఎడమకుడి ప్రక్కలను వరుసగా బిరుదురక్షకసేన నిలిచినది. ఇచట పట్టపుటేన్గు, అచ్చోట పట్టాశ్వ, మానడుమ వాద్యాలీలి, ప్రక్కనేశ్వజబృంద, మైదువలుమంగళద్రవ్యములు దర్పణము కలశమ్ము హారతుల పళ్ళెములు పట్టినిలబడిదటనె ఇంత రక్షణమధ్య గురువులునిలబడిరి. కుడిప్రక్క రాజులును వారితోపాటుగా మన బాబుగారమ్మ; జాబిల, వాసిష్ఠ గురువు లెడమకు గలరు. అటనే ఆనంద మొగ్గలనసారి పుత్తులిటఊరి ము త్తైదలారతుల నెత్తుటకు ఇంటింటి ముందు తీట్వలు పట్టుకొన్నారు. కొందరు పిల్లలను పైకెత్తి గురువులను కనుడంచు చూపుచుండిరి. బాలకులు కొందరనుగు తల్లులకొంగు చేత పట్టియు, లేక నోటనిడియో, భ్రాంతులైనట్లు కనబడిరి.

యశో : పతి ఎట్లు నిలబడిరి ? ఎట్లుండిరి రవంత వర్ణించి చెప్పు.

అంబిక : పూర్ణిమనాటి గగనాన తారకల మధ్యమున నిండి వెలిగెడు చంద్రుడునట్లు వెలిగెదరు. మన పుష్కరిణిలో శ్రావణోదయము నందుతామరసరాజము మిగత తామరల బలగమున అరవిరిసి వెలుగునటు చిఱునగవు మెరపులను చిమ్ముచున్నారమ్మ. పసి బాలువోలె ముద్దైనట్టిముఖముద్ర,మీ ముఖములో నాకు కనబడెను దయ,మిసిమి వృద్ధరాజుల ముఖగభీరిమము, గొప్పదన, మీ జగతినలముకొని, రక్షింప గలనన్న కారుణ్యరసమొలికి వెలుగు నేత్రద్వయము ధీరమగు విగ్రహము, తామరస వర్ణమున శోభిల్లు వస్త్రమ్ము మకుటమోయన పైకి ఎత్తికట్టిన జటాచ్ఛటలు.

యశో : ఆహా, అంబికా, ఏ పుణ్యమొనరించి నీవు దీనిని కనెదు ? ఏనేల చేయనైతిని దాని పూర్వమున ?? లేకున్న, సతియైన నారి సన్న్యాసి యగు పతిని కనరాదన్న ధర్మమ్మునందె, మతమందె, తప్పున్నదో ? నాకట్లె అనిపించు. ఇది ఏమి మత మేమి ధర్మమ్ము ? ఇది తగున ? బ్రదుకులను చీల్చి, గృహముల కూల్చి, హృదయాల పొడిసేసి, కన్నీటి కాల్వలోనికి త్రోయు ఈ ధర్మమతము లెక్కడి ధర్మమతముః లి లోకముల శుభములను సాధింపగలవన్న మాట అది వట్టి భ్రమ. ఉసురుసురు కలుపు మత మది మతము నిక్కముగ వెచ్చకౌగిలి విచ్చి, ఎదలనుడికింపునది మతమనగ చెల్లదు.

(ఒక్క క్షణము ఊరకుండి)

ముందరికి వచ్చుచున్నారే, అంబిక ?

అంబిక : అవును మేరవడి అంతిపురి ముందరికి సాగినది.

యశో : వారేమి చేయుదురు ?

అంబిక : మొక్కుచున్న జనాల దీవించుచున్నారు

యశో : నా మనోనయనమ్ము దాని భావించి కని సంతసము పడుచుండె సంజ వెలుగును కట్టి మొగిలొకటి తలబెట్టి హిమగిరి శిఖర మొకటి ఆశ్వీజమాసమున సామవనములను దీవించుచట్లున్నారు కాబోలు. కిక్కిరిసి నిల్చిన జనస్తోమమందొ క్క ముఖమురేద వారలదృష్టి మనసునకు తెల్పెనే ? ఏల లేదని, ఎంచి ఎడద ఒక ఇంత కలిగినదె ? హా, హా, విధీ ! నా యెదకు నాదు ఈ ఆశాసమూహముల త్వరితగమానము నడ్డు బలము సీక అదేల చేతకానిదిగ చేసితివి ? నేనేమైతి ?

(చేయి కన్నుల కడ్డముగనుంచి దుఖించును. మరల సహించుకొని)

అంబికా ! ఊరకే కూర్చుండి ఎదిచేతు ? ప్రాణపతి వచ్చు నీ మంగళ ముహూర్తమున భ్రాంతి నా కనులకుభవారి కార్చుచునుండ వద్దంచు చెప్పరాదేమె ? రా, త్వరపడుము. పళ్ళెరము ఒకటి తే. అంబికా ప్రభువులకు, నీదు గురువులకు అర్పించుట కుపాయనము లందులో నిడుము.

అంబిక : చిత్తము

యశోధర : అట్లె నా పతికి మనసైన, సొగసైన, నాదు ఆ నాటిదగు అమృతరుచి చీనాంబరము తెచ్చిపెట్టుము. వారికొప్పగునట్లు, నాదు చేసినయట్లు ధమ్మిల్లము రచించు, తనువు సింగారించు, మంగళ ద్రవ్యముల నెల్ల నాకై నీవు పాదముల నర్పించుచున్నపుడు నేనిచట తలపులో పూజింతు, కనవచ్చునన్న ఆ జడ వస్తు నిచయమును అటనప్పగించుచును వారి మనసున్ నాదు తలపు మెదలు క్షణాన నాదు ప్రాణమ్ములను, భావనా దేహమును ఇటనుండియే నేను పదతలములో నుంతు శృంగారమును సేయరమ్ము, పూజాద్రవ్యములలోన ముఖ్యమైనది తనకు నిర్మలత. అంచే విమల మన మమలాత్మ సిద్ధింపనాదు. కలిగిన నాదు మనసచ్చమగునేమొలా, వేగ శృంగారమును సేవా, పదిఏళ్ళ క్రింద విడి ఎటకోపోయిన యట్టి జీవకళతిరిగి

వచ్చెనని శాక్యులనేల నిట్టూర్చి, పల్లె, పక్కణ, మడవి నగర, మంతఃపురము సంభ్రమసుఖోచ్ఛ్వాసములను నిండినవేళ నేను శోకపు దీర్ఘనిశ్వాస వహ్నిలో ఏల కాలమును వేడెక్కింప ? నాథుపతి దూర మేగినవాడు దగ్గరికి వచ్చుటయె సంతోష మందుసు. రా, లెమ్ము త్వరపడకుము.

(రాహులుడు, అంబాపాలి ప్రవేశింతురు)

రాహు : అమ్మా మిమ్ములను చూచుటకు అంబాపాలి వచ్చిరి.

(అని చెప్పి వెళ్ళిపోవును)

యశో : రండమ్మా, మీర అంబాపాలి ?

అంబా : ఔను. అదాసినిథేవే. చాల నాళ్ళుగా గురుపత్ని చరణసేవా సక్తి బుద్ధినై నేడిటా పుణ్యమ్ము కల్గ నిటవచ్చితిని.

యశో : గురుచరణములను సేవించు మిమ్ము చూచుటయె మాదు పుణ్యము. మీరు వారి పరివారమ్ము వారికి పరులు.

అంబా : మీకు తెలియనిమాటె ? మాకు గురుదేవులకు ముల్లోకముల నెల్ల పరులు లేనేలేరు. జగతి జీవులెల్ల గురువులకు ఒక్కటే కుటుంబము.

యశో : వారి నెఱుంగు. అందరును ఇట్లె చెప్పుదురు, వారల తోడ ఉపదేశము మీరు పొందితిర ?

అంబా : తల్లి, నే నెవనంచు, ఏమంచు, మీ కెఱుగరు. మునుపు నే నొక్క నాగర స్త్రీగనుంటిని. మీవంటి పావనులు ఆ బ్రదుకు కథ వినుటయునుకూడ సరియంచుతోచదు. ఇట్లుండ యొక దినము గురువరుల నాథపిండదకుని వనికేతెంచి ధర్మమును బోధించుచుండిరను మాటవిని నేనటకు పోయితిని. దారి తెలి యని ప్రజకు దారి ఏది అటులను వారుచెప్పినమాట వింటిని. నానాటినుండియు వారి పదసేవనెల్ల ఉపదేశముల సారమును కనుగొంటి, ఉపదేశమును నడయ నాకేమి అర్హత? వేద పార గులైన బ్రాహ్మణులు, శాస్త్రాబ్ధినిధి కనుగొన్న పండితులు, యోగమున కరణముల మర్దించు తాపసులు, వీరెల్ల గురుల ఉపదేశమును పడసెదరు. అల్పజ్ఞ పతిత, పామర-నేను ఉప దేశమందుటకు ఏపాటి దయ్యటను? కాని, యియ్యది నిజము. విప్రులను, శాస్త్రవేత్తలను, యుక్తాత్ములను ముందునడిపించ గల మాగురువు మావంటి సామాన్యులనుకూడ ముందు నడి పించెదరు. ఒక్క మాటనుపల్కి, ఒక్కచూపునుచూచి, సరి యైనదారిలో నడచుటొక్కటితప్ప మిగత బ్రదుకంతయును వ్యర్థమని తెలిపెదరు. ఉద్ధారమగుట ఎట్లనుచు చూపించెదరు, బ్రదుకుకూపమును దుర్వృత్తి బురదను బ్రుంగి వీరి కృపచేత ఉద్ధృతులైన పదియారువేల జీవులలోన నాదియను ఒక్కటి

యశో : ఉపదేశమందిన సతులుకలరె శిష్యులను ?

అంబా : నేనెవ్వరిని ఎఱుగ, మగధరాజకుమారి గృధ్రకూటమున శుక్లాదేవి యనునామె ఏకాకి యొంటను తపస్సులో నున్నదని మాదు గురువులను గురలయంచు చెప్పెదరంచు విన్నాను, ఉపదేశమును పొందిరో లేదో, ఎఱుగను,

యశో : తల్లి, అంబాపాలి, మీరెల్ల మానగరమునకు వచ్చితిరి. కడు సంతసము, కపిలవస్తువును శ్రావస్తియే అనిఎంచి,దిగినవిడిదిని మీదు గేహమంచే ఎంచి, సత్కారమున తోచు కొఱతలను మన్నించి, అతిథ్యమును కొని సుఖాత్ములను మముచేయుడు,

అంబా : చిత్తమ్ము. నాకింక సత్కారములె వలదు. మిమ్ము మీరున్న చోటును చూచుటయెనాకు నయనమునములకొక్క పండుగగ నున్నయది. ప్రేమతో మీరన్న రెండుమాటల కరుణ చిగురిం చులతకు పోసిన తేటనీటివలె ప్రీతిమై వచ్చుతీరువున కిచ్చు పాలవలె ఆశతో అరుదెంచిన నాదు ప్రాణమున కాప్యాయ మాన మైనది, దేవి, గురువులందు ఎట్టికృపకంటినో అట్టి కృపయే నేడు గురుపత్నిలో కాంచి సంతసించుచునుంటి,

యశో : మీయందు గల్గ ప్రేమయే ఇంతచూపెడిది.

అంబా : తిరిగి దర్శించు కొందును మిమ్ము.

యశో : సంతసము. అంబికా, పళ్ళెరము తెచ్చితివ ?

అంబిక : అమ్మా, ఇదె తెచ్చితిని. (తెచ్చును)

యశో : కొంచు చని వారి కర్పించు. నేను ఇటనుండియే నమియింతు నని చెప్పు. (అంబాపాలి పోవును)

అంబిక : చిత్తము. (అని తలుపువద్దకుపోయి, మరలవచ్చి) అమ్మా మిమ్ముల చూడగానేమొ మన బాబు ఆనందులను పిలుచు కేతెంచు?

యశో : రానిమ్ము. నీవుపద. (ఆనందుడు, రాహులుడు వత్తురు) రండు ఆనందగురు.

ఆనం : గురువులానందు దత్తపదాల మ్రొక్కెనిదె.

యశో : ఐదేండ్లక్రితము గురుసన్నిధికి చనునపుడువరికిని చెప్పకనె చనినట్టి అల్లునికి నేడత్త జ్ఞాపకమొచ్చినద? శుభమస్తు ఆనంద కూర్చొనుము. సుఖముగావున్నావ ? పతిదేవులును సుఖమ?

ఆనందుడు: అత్తవారల సుఖము జనులకై శ్రమపడుట, నడచుట నుడువుట ఈ సుఖము వారు పరిమితి మీరి పొందిరి.

యశో : ఎప్పుడయినను మమ్ము తలచెదర ?

ఆనం : ( కొంత తడవూరకుండి ) అపుడపుడు వారి బాల్యపు మాట లొక్కొకటి నుడువుదురు. అట్టివేళల తలంచుట కద్దు.

యశో : తలచెదర ? పితృదేవు ? పుత్రకుని

ఆనం : పితృదేవు పలుమారు తలచుచుండుట కలదు. పుత్రకుని ఒకమారు తలచుకొన్నది నాకు తెలియును బాగుగా.

యశో: నన్ను ?

ఆనం : మిమ్ములను ?

యశో: ఔనౌను. ఈ నన్ను ?

ఆనం : తెలిసినటు మిము గూర్చి పలికినది నేనెఱుగ. అపుడపుడు ధర్మిష్ఠయైన సతి ఎట్లుండె ? ఏమిచేయుననుచు పలికినది నా కెరుక. అపుడు మిమ్ముగుఱించి పలుకుచుండి రటంచు తోచినది.

యశో : ఏమంచు పలికిరి ?

ఆనం : సంసార మేమన్నదే ఎఱుగనట్టి నే నామాట సరిగవిన లేదు. ఏమనిరొజ్ఞప్తికి లేదు.

యశో: నిజము తెలుపు, మదేల సందియము ? వినియున్న నీ వద్ది మరచెదవ ? నను వారు తలపలేరు. మంచిది. ఒక్కతెనె నడిరేయి త్యజియించి తపముకై చన్నవారలదెట్లు నను తలతురు ?

ఆనం : అత్త, వారారాత్రి ఇల్లు వాకిలివీడి చనువేళ నొచ్చిన విధమ్ము విని ఎదకరగు.

యశో : నొచ్చిరే వారు ? మమ్మెల్లరును నొప్పించి ?

ఆనం : లోకహితమును గూర్చు కార్యమున గురువరులు తనదు, తనవారి సౌఖ్యమును ప్రక్కకలకిడిరి.

యశో : ఉన్న ఇంటిని కాల్చి ఊరు వెలిగించినటు.

ఆనం : ఇలుకాల్చిరో,లేక ఇచ్చిరోతమదివ్వె ఊరువెలిగించినది.నిజము.

యశో : ఇట్లుమీమామపరముగా నీవుమాట్లాడునది సహజమ్మే. వారికడ మేమెల్ల చేయక విడిన శుశ్రూషలెల్ల చేయుచునుంటి. సంతసము ఎవరిచేనైన కానీ పతికి సేవ జరిగిన చాలు. పలుమంది. వారి సన్నిధి నాశ్రయించిరే ?

ఆనం : లెక్కలే నంత పెక్కుమంది వారి నామమును విని పిల్లజెల్లను వీడి వచ్చిన వారెందరు ? ఎటకొ వచ్చినవారు ఉపదేశమును విని ఊరికే పోకుండ నిలిచిన వారింకెందరు ? ఇల్లు వాకిలి విడక సంసార కష్టముల వలగళ్ళలోనుండి క్షణమాత్రమైనను శిరస్సు వెలుపలపెట్టి, ముక్తియను ఆకాశమెట్లుండు ననుటను కిన్న ప్రాణులెందరు ? ఎవరు తెల్పుదురద్ది ? ఈ ఏండ్లలో వీరిఉపదేశముల పదివేలమంది సన్యాసమును చేకొ

యశో : పదివేల ఇండ్ల వెలుగులు ఆరిపోయినవి. లేక మనకై అయ్యయ్యో, నా వలెనె ఎన్ని వేలజనమ్ము నొచ్చెనో ? ఒక్క గొప్పయని చెప్పి కొనెదే నీవు! అది సరియె. ( ...లకు కాక ఈ ఉమ్మలిక తెలియునే ? నాకు రక్షకులు జనమ్ములుండిరి. 'నీవు రక్షించవలె' ననెడి జనములు ... కాని, నీమామ, నీవును వెడలిచనినపుడు అంతిపురి, పట్టణ దేశమ్ము, కోశమ్ము, ఎంత వెలవెలపోయె! ఇంతకం... ఎంత దుఃఖమున ఎందరింతులు కంది, కుందిరో మీదు ఉప ముల ? ఇది ఏల తలపరు ? నొప్పి విత్తును విత్తి, గొ పంటను పండి, రోగముల వడ్డించి, కన్నీళ్ళ స్రావించి, గ పడుచున్నారలే తపస్వులు; ఎదల కల్మషములున్నవని, ... విడి పరుగెత్తి పెళ్ళాము బిడ్డలను నొవ్వింప త్యాగమ వనములో పొదరిళ్ళు గెలుచుటకు అగ్గి ఇడి లేడిపిల్లల కా నీతి యిది.

(అంబిక ప్రవేశించును) అంబికా, ఏమయ్యె ఇంతవేగమేవచ్చి

అంబి : అమ్మా. తమరు గురువులను కనవచ్చునట.

యశో : అవునా ?

(అనుచు సంభ్రమముతో లేచి, మరల కూర్చుండి) ఎవ చెప్పిరి ?

అంబి ; గురులె స్వయముగా చెప్పిరి.

యశో : ఏమి జరిగెను చెప్పు.

అంబి , హరివాణమును పట్టి దరికేగితిని సారి పుత్రులకు గురువరు ఏమియో చెప్పుచుండిరి. పళ్ళెరము వారి ముందుంచి మొ రిల్లితినినేను. వారంత మంచిరని దీవించి, ఏమిటిది అంబి అంచుఅడిగిరి. మాదు రాజ్ఞివారలకడకు ఈ ఉపాయనవ లను పంపి నారని అంటి.

యశో : అడుగులకు అర్పించిరని అనకపోతివా ?

అంబి : స్త్రీయైన మాత్రమున అంతగు వేమమ్మ ? అడుగులను గు యించి, అర్పణను గుఱియించి, మీ కిష్టమైనచో భార్యయ మీరలే నుడువవలె. నేనెట్లు నుడువుదును, చెప్పండి ? మీర నారాణి. మిముతగ్గించి నుడువుటయ ? ఈ ఉపాయనముల పంపినారని అంటి. శుభమస్తు, అన్నారు. పంపినది మీరంచ తెలియునో, లేదో నేనెఱుంగ. నియ్యది ఎట్లు తెలియజేయ వలెనో అని తలచుచుండగా దూరముననున్న అంబాపాలి గురి

వులకు- దేవి, గురుపత్ని, ఇచటికి వచ్చి గురువులనుచూచుటది సరియో కాదో యన్న శంకతో తాముతేలేదు, పంపించిరని అన్నారు. గురువందులకు ఎవ్వరైన ఇట రావచ్చు. మేము పొగడుచునున్న ధర్మసమవర్తమున పీరు రాకూడదని, పీరు కనరాదనియు నియమమ్ములు, నిషేధములు లేవు అన్నారు. అప్పుడంబాపాలి నన్ను ప్రక్కకు పిలిచి దేవి గురువుల చూడ వచ్చు పిలుచుకరండి, సారిపుత్రుల నేను ప్రక్కకంపించెదను, అంచుచెప్పిరి దీని విన్నవించుటకునై ఉరికి వచ్చితి తల్లి (యశోధర ఊరకుండును)

ఊరకుంటిరె తల్లి. అలస్యమేల ?

యశో : పతి రమ్మంచు అన్నారె ?

అంబా : తల్లి వచ్చిన తప్పులేదనిరి.

యశో : ఆనంద, పతినచట కలుతునే ?

ఆనందుడు : అందుకే మద్దంకి ?

యశో : రానిమ్ము అనలేదు. రమ్మనుము అనలేదు. లేదు వచ్చిన తప్పుటంచనిరి. ఎటుపోదు ? పోయి నిలబడనెదుట పలికెదరొ, పలుకరో ? ఏ ధైర్యమున పీరి కిడకు చని నిలబడుదు ?

ఆనందుడు : పలుకకుందుర అత్త తమ వారి హృదయముల ముద మందచేయుటకు గానె శతయోజనములరుదెంచినారు కద ?

యశో : శతయోజన విశాలజలనిధికి సేతువును కట్టి, సేనల నడపి, ప్రియురాలి విడియుండలేదని కడు తపించి, సతికినై పగతు రను చంపి సాకేతపతి సీతమ్మవారి రమ్మంచు పిలిపించి ఆ సతివచ్చినపుడు తన ముఖము నింకొకప్రక్క త్రిప్పెనట ! ఆనంద, ఈ కథను నీవు విని ఎరుగవా ? సతికొఱకు ఇంత చేసేనటంచు జనులు నుడువుదురంచు సిగ్గుకలిగినదంట. అతని వర్తనగాంచి వఱియని జగతిమెచ్చె. సతికింక గతిఏమి ? పురు మందు సిగ్గిల్లెఇంతి సిగ్గిల్లదా ? లేకున్న తనవేష మాతడు ధరించెనని మగవేషమాచుమయు వేసికొనసరియగునా ? శత యోజనమ్ముల దేశమును నడచినవారు మనసు మనసుకు మధ్య గల అంతరము నట్టె పెట్టుకొని ఉండనగు.

అంబిక : అమ్మ ఇంతకు మునుపు చూడలేనే అంచు నొచ్చితిరె ? చూచుటది దోషమ్ము కాదంచు చెప్పుచున్నారుకద, ఏతెంచి చూడండి,

యశో : చూచెదను అంబికా, ఎటనైన కూర్చుండి చాటుగా చూచె దను, దరికేల పోవుదును ?

ఆనందుడు : ఇట్లేల తలచెదరు, అత్త రావలెనంచె గురుల అభిమత మంచు తోచును.

యశో : ఆనంద, అభిమతము నూహించుపేల ? నా పతిదేవు చూడ వచ్చును కాదె ? వేనవేల్ గుంపులో ఎప్పుడో, ఎక్కడో, చేరి కనుగొనియెదను అందరటుకాదు, పూర్వాశ్రమపు సతి యంచు కృపచూపునట్లయిన ఇటకె విజయంచేసి నా సేవ కొననిమ్ము

అంబిక : ఇట్లందురే, తల్లి ?

యశో : ఏమంటి నంబికా ? నగరమున కరుదెంచిరి, అంతిపురి కేతెం చిరి, కనుట తప్పును కాదు, ఇటకు వచ్చుట తప్పు ? కష్టమా? రావలెను. నేనొక్క వస్తువని వారలెంచిన ధైదల నేచెప్పనేల ? వారె ఇటకు వచ్చెదరు, కనుచుండు.

ఆనందుడు : అత్త, మీదగు అర్థమును గురువు కెవ్వరైనను చెప్ప వలెను, చెప్పకయున్న వత్తురో, రారో ?

యశో : నీవే చెప్పు మానంద, నీ అత్త యగు నేను, నా అల్లుడగు నీవు బాల్యమ్ము నుండియును తోడుగా పెరిగితిమి. వరుసలో పిన్నమ్మ పెరుగునపుడక్కయ్య, యువరాణి అయినప్పుడత్త, ఇంకిప్పుడో గురుల అలనాటిసతి, ఇన్ని విధముల నేను నీదు సేవకు పాత్రురాలైతి - గురువులకు నా యభిమతము తెలుపు కార్యమున ఒక్కింత ఉపకరింపుము.

ఆనందుడు : కాని, అత్త, చెప్పెదనట్లె.

అంబిక : ఊడిగపుకత్తె చేయునదొక్క ప్రార్థనము.

యశో : చెప్పు.

అంబిక : గురువులకు ఈ మాట చెప్పుటయందు అపచారమేమికారాదు.

యశో : వినుమానంద, స్త్రీయైన మాత్రమున అగ్గువా అని నామె ఇప్పుడపచారమునకు భయము చెందెడిని.

అంబిక : అపుడు పలికిన పలుకు తగ్గి పలికినదమ్మ. ఇపుడు పంపెడు మాట అభిమాన పూరితమొ అన్నట్లు తోచెడిని.

యశో : ఆనంద పతిదేవు సన్నిధిని నా విన్నపము వినిచి, మాటలివి దర్పమున పల్కినవి కావనుము. ఇది నిజము. పైమెత్తలో బిరుసు మెత్తగా తోచెడిని ఎంత మెత్తనయైన పైన బిరుసును కప్ప బిరుసుగా కనబడును. నాకహంకృతిలేదు. పతికి కాబట్ట నైతినె అన్న దుఃఖమున పలికితిని. సరిగా నివేదించు.

ఆనందుడు : చిత్తమ్ము.

స్థానము 6

(యశోధర అంతఃపురము, యశోధర, అంబిక)

అంబిక : మీరు చెప్పినమాట లానందుల ముఖాన గురుడు నిన్ననె విని తెలిసికొని ఉండవలె. కాని వత్తురా రారో ? తెలియదు.

యశో : ఇదివరకు రాలేదటంచు తెలిసినది కద, చాలదా ?

అంబిక : అమ్మరో, మీరు కోపింపకుడు దానికిది అధిక ప్రసంగమని అనవలదు. ఈ మధ్యాహ్నమూరి ప్రజకుపదేశ మిత్తురట గురువరులు. సెజ్జ కూర్చుండి బోధింతురుట. ప్రక్కలో చిత్రములగది తలుపుకిద తెరమరుగులోన మీరు వారిని కనుడు, తల్లి సిగ్గిది వద్దు. పదియేండ్ల కాలమ్ము విడియుండి దరిచేరి ఒక్క ఇంటనె ఉండి, పతిని కనకుండుటది ఏ దేవునికి ప్రీతి? ఉన్నది కనుటకాస, కనవచ్చునన్నారు, ఇంక విడువగ నేల ?

యశో : నా వలెనె ప్రభువులును పదిఏండ్లకాలమ్ము విడియుండి నేనున్న చోటికే వచ్చిరి. కాని కనవలెనన్న ఆశలోపల చిక్కనలగకుండిరి. చూడు. వీరి సతియగు నింతివీరి వలె దృఢ చిత్తయై ఉండవలెకదా ? కేసరికి భార్య కావలెనన్న జీవి ఎద హరిణి వలె పిరికి పందగనుండ తగినదా ? ఆశకలదవకాశ మున్న, దయినను ఆశ చాటుమాటున ఇట్లు తీర్చుకొనసరి యంచు తోచకున్నది. కాన నేనట్లు చేయను.

(వాకిటిలో అంబాపాలి కనిపించును)

రండి, అంబాపాలి.

అంబా : దేవిగారికి నతులు, గురుదేవులిచటికేతెంచెదరు. అది తమకు తెలుపవచ్చితి.

యశో : తల్లి, చెల్లి, అంబాపాలి ఎట్టి చల్లని వార్త తెచ్చి రక్షించిరి. ఈ హారమును కొనుడు. నాదు ఈ సంతసము రెట్టించుడు.

అంబా : గురువుల ప్రసాదమును కొనునట్లు దీని కొనియెద.

యశో : అంబికా, నాదు జడలోన పువులున్నవా ? కనుము. పీఠ మును సర్దుము.

(అంబాపాలిని చూచి)

మీ తోడ చెప్పి పంపిర ?

అంబా : ఆనందులను పిలిచి ఇచటికి పోదమంచు ఆనతి ఈయ విని, నేనె ఇచటికి తెలుపవచ్చితి దేవి.

యశో : సంతసము.

(ఇంతసేపటికి అంబిక జడచూచి, సర్ది, ఉత్తరీయమును తెచ్చికప్పును. బుద్ధుడును, ఆనందుడును ద్వారమున కనిపింతురు.)

అంబికా, మనబాబు పిలిపింపు,

తట్టితే,

(బుద్ధుడు లోనికి రాగా తట్టను అడుగుల కడనుంచి నమస్కరించును)

అడుగులను తాకవచ్చునో, అడుగు?

బుద్ధుడు : లేదు తాకినతప్పు. తాకకుండుట మేలు.

యశో : తప్పు లేదన్న చాలును నాకు. (అని పాదములుముట్టి కన్నుల కద్దుకొనును)

దేవిగారేది చేసిన అదియె మంచిది.

(అందరును ఒక క్షణము మౌనముగా నుందురు. అంబాపాలి, అంబిక ఒకరికొకరు సైగచేసికొని, కొంతదూరము పోదురు)

ఆనంద పీఠమ్ము నిమ్ము. ప్రభులచట దయచేయవలె.

బుద్ధుడు : కూర్చొనుడు. ఆనంద కూర్చొనుము. దేవిగారు చూడ కూడదొ అన్న సందియము నందుడు టానందుడెరిగించె. లేదు మా కానియమము. ఏగుకడకేగునది, నుడువుచో నుడువు నది, ఎల్లతావులయందు సరిగాగ నడచునది ఇది నేర్వవలెను సన్యాసి, బహుదినములుగ కనకున్నవారు కననిమ్మంచు వచ్చితిని.

యశో : దుఃఖసంతప్త జీవికి నేడు చలువయ్యె, మా అల్లుడానందునికి నేను చిరఋణిని.

బుద్ధుడు: పలుతెగల యోచనల చేసి నొచ్చితిరంచు ఆనందు డన్నాడు చింతయే కష్టము. ఇంటిలోనికి వచ్చు పాము నదిలించినటు ఇంటివాకిటి నుండి దాని నదలించవలె. అభ్యాగతుని కాంచి ఇంటికి పిలుచురీతి ఇంటచోటిచ్చి, కూర్చొనబెట్టి, పూజింప దుర్వాసుడగునద్ది.

యశో : ఇది నాకు తెలిసినదే.

బుద్ధుడు: పతి ఇతండని నాదు జీవరవిలో నాడు సతియైన స్త్రీ జీవ పద్మమ్ము మైత్రియై విరిసెనెట్లట్లు ఆ పతిది, ఆత్మారామ మర్థాంగి ప్రేమ జీవన చైత్ర పవమతో నిద్దురనువిడి, విరిసి, తన హృదయవాసనల తన్నుతా తెలిసికొన్నది, దీన సందియమె? ఆ ప్రేమ నాడు నా హృత్పద్మమున నిద్రా సంతోష రూపనందాదీప మిప్పుడును నాదు అంతర్యమును తృప్తిగా వెలిగించు, రాత్రి తమము నెదిర్చి, నింగిసింగారమై వెలుగు చల్లని తార, పగలు రవి కిందయై మరుగునుండి జగత్తు వెలి

గించినట్లు ఆ నా తృప్తి సిద్ధితో కలుగు శాంతిని కూడి దరికి వచ్చిన ఆత్మలకు సుఖము కలిగించు. పతికి వద్దయితినని తలచినది ఇక చాలు; చింతలను సాధించు ఈ తపశ్చర్య ఇక చాలించి సుప్రశాంతిని కనుడు.

యశో : నా మనము ఈ అనుగ్రహ వాక్కుతోడనే చిరశాంతి పొందినది. ఇక నాకు చింత యన్నదేలేదు.

బుద్ధుడు: ఏదో సందేహమున్నది.

యశో : తప్పుకాకున్న అడుగునవి రెండుమాటలు కలవు.

బుద్ధుడు: అడుగవలె. ఇపుడు నను చూడగా వచ్చునన్న ఇలుపీడి అడవి కేగెడి కార్యమేముండె? లేయింతి, పతియె పరదైవమ్ము, ప్రాణపతి సర్వమ్ము, పసివాడె ప్రాణమని ప్రణయవు విలాసాల సుఖముగా ఉన్ననను దుఃఖముల ముంచెత్తి వెడలి పోయినదేల? (బుద్ధుడూరకుండును)
ఆనంద అడిగినది అపరాధమయ్యేనే?

బుద్ధుడు: లేదు; అడుగుడు.

యశో : ఇంత ఏమి అడుగుదు నేను. నావలెనె నూర్గురది నొచ్చుచుంటిరటంచు తలచి నే నొచ్చెదను. చనునపుడు నాకు చెప్పక చన్నదెందులకు? ముక్తిమార్గము వెదుక చనువారు భార్యలకు ఎఱింగించి చనుట కాదే? వద్దు అని అంద్రు, అడ్డగింత్రంచు భయమే? ధర్మమున నడువసతియైన స్త్రీ తాను అడ్డుగా నిలుచునే? (ఒక క్షణమూరకుండును. తిరిగి) పది ఏండ్ల తరువాత తిరిగి వచ్చిన వారి కఠిన వాక్కుల దుష్కరించుచుంటిని, నిజము,

బుద్ధుడు:అది నాకు సత్కారము. అయితి సమచిత్తుండ, మీరు చెప్పునదెల్ల సంతసముతో విందు.

యశో : జగతికే ధర్మమును నేర్పువారలు రాగ తెలియనిది అడిగి తెలియగనెంచి అడిగెదను. పతి పోవరాదటంచవి పత్ని అడ్డుకొనన మీరి నడచుట పతికి తగున? రెండుపిరులు ఒకటిగా కలియగా నొప్పి తోడుగ నుండి రెంటిలో ఒకటి సంబంధమది చాలునన అక్కడికె వారి ఒప్పందమది ముగియునే? రెండవది యగు ప్రాణి ఒప్పుటకు పూర్వమే దాంపత్యమంతమగునే?

ఆనం : (లేచి) నేకొంత దవ్వుందు?

బుద్ధుడు: నీయిష్టము.

యశో : ఆనంద, వద్దు, ఇటనే ఉండు. సన్యాసిపతి, అతని పూర్వాశ్రమంపు సతి ఇరువురే జతగనుండిరటంచు జనులలో లేనిపోనిమాట రావచ్చు. దేవరకు ఇటువంటి దుష్కీర్తివచ్చునటు నడతునే? ఇపుడు వచ్చిన కీర్తి రజతగిరి చదలంటి ధవళగిరి కానిమ్ము. జగతినిండగనిమ్ము, అదికాక, నేను వేసెడి ప్రశ్న పలుకులు వేయుచుండిరి. వారి సంశయము పోగొట్ట ఏమి చెప్పుదురంచు నీవెరిగి ఉండవలె. ఇట్టుటకటంచు నడువగ లేదు నేనిట్టు. ధర్మ సూక్ష్మము నరయుటకుగానె అడిగెదను.

బుద్ధుడు: (ఒక క్షణమూరకుండి) ధర్మసూక్ష్మము నరయు మనసు తన సుఖములో ధర్మమ్ము కొలువకూడదు-మూలసూత్రమిది, నేనన్న భావమును పెంచు జీవితము ధర్మపథమును వీడి తిరిగెడని నిశ్చయము. నా వల్ల అన్యులకు శుభము కానిమ్ము నుచె సద్యఃప్రమాణమ్ము ధర్మ పథగాములకు, (ఒక క్షణమూరకుండి) సంసారమన్న దుష్పారకూపారమున పుట్టు, పెరుగుట,చావు అను సుళ్ళలోచిక్కి, బాధపడు జీవులను రక్షించు పెట్టంచు తెలియుటకు నేనిల్లు విడి, నాడు వెడలితిని సంసారమును రోసి, వనశాంతి నిష్టపడి, తపమునకై చనలేదు. సుఖముతో తనిసితిని, జనుల మంగళముకై సుఖములను వదలితిని ఇడుమల వరించితిని; దుఃఖముల దుమికితిని.

(ఇకొంత క్షణమూరకుండి) నాదు అర్ధాంగి కడు ధర్మిష్ఠ, దృఢచిత్త, అనుట నే తొలినుండి ఎరుగుదును; సౌఖ్యమున ఎట్లు సాయముగ నిల్చెనో అట్లు ధర్మమున సాయమగునామె అంచెఱుగుదును. అయినను వెంటనే ఒప్పునేరదు., ఇంక తలిదండ్రులు, లాప్తులును, పరివార, మెల్లరును నిలుపుదురు. నిలుప నిలువగరాదు; ఇంక చర్చ అదేల? చేయదగినది చేయునది-అన్న భావమున పరితాప తిమిరములు ధైర్యదీపము చుట్టి తర్జించుచుండ ఏగితి లెక్కసేయకయే.

(తిరిగి ఊరకుండి)

జ్ఞానసాధనకు నరుడడవి కేగగనేల? ఇంటనుండిన కాదె? అన్ననుడి అరనిజము. ఇటనుండి ధర్మమున నడచువారలు కలరు. తన్ను మరచుటె ధర్మ - మమ్మయగు ప్రతిప్రాణి ఉన్నచోటనె దీని సాధించు. ఇట్టులే కోటి ప్రాణుల నొక్క ప్రాణి సంతృప్తితో ముక్తి పడయుట కలదు. కోటిలో ఒక ప్రాణి సామాన్యమానవులా? దినదినపు బ్రదుకుదగు చిన పెద్ద నడలలో, గాలితో లేచిపడు జలనిధి తరంగమాలల నడుచు తేలాడు బెండువలె కొందరల జీవనము కడపుదురు నేడు నాకున్న అనుభవము. నాడుండుచో అడవికేగెడు పనియె లేకుండె. అయినను నాడు ఇలువీడి అడవికి పోక నిలిచిన నేటి అనుభవ మద్ది కలుగు తెరువేలేదు. అసవప్రాశ్యముల

త్రావిన సుదృఢ తనువు వ్యాధి నడ్డెడిరీతి, తపముతో దృఢ పడిన ఆత్మ సంస్కృతి నడుమ తిరిగియును శాంతిగను.

(ఇంకొక క్షణముండి)

పతియైనవాడు సతిసమ్మతిని పొందకయె దాంపత్యము ముగించ రాదనుట సత్యమ్ము. కాని మా ధర్మమున వైరాగ్యమే ముఖ్యము అప్రధానమ్ము దాంపత్యంపుటంతమ్ము, సాధన ముగించి, సతికల ఎడకు రావచ్చు, ధర్మమున రెండూపిరులు జతగమనవచ్చు, స్వార్థమును మరచునెడ దీనికది దానికిది సాయమై, ధ్యేయమై, శుభము పెంచగవచ్చు.

(కడపటికి)

నా మడుఅు మతికి సమ్మతమె ?

యశో : పతివిడి చన్నభంగితను నేనన్నభయమొకటి తొలగినది. మిలిగినవి మతి ఒప్పకుండె.

బుద్ధుడు: ఇది సహజమ్మె కాంచి పెంచుట మాతృధర్మమ్ము. విడుచుటను సులభముగ ఒప్పనేరదు ఆమె ప్రాణమ్ము, పురుషుడునుకూడ తన అంతర్యమును మధించి తెలియవలెదీని. అంత ర్వృత్తులన్నియును శృతికలిసి, ఒక్కటై కూడువరకీ ధర్మ మాతనికి సరిపడదు.

రాహు : అమ్మా, పిలిచితివేమి ?

యశో : రా, బాబు, మీదు తండ్రికి మ్రొక్కు,

రాహు : అప్పుడే నేను మ్రొక్కితినమ్మ.

యశో : లోకగురువైనారు వారితో ఉపదేశమును పొందు.

రాహు : నాయనా ఉపదేశ మొసగుడు.

బుద్ధుడు: సుతుని నాకిచ్చుటకు మనసు ఒప్పనె ?

యశో : నన్నుమీరు విడకున్నచో జగమునేమీకు విడువగనేను ఒప్పెదను. నాకు ఉపదేశమ్మ నీవలెను.

బుద్ధుడు: ఇదివరకు ఏమి చెప్పితినో అదె ఉపదేశము.

యశో : దీక్షను వేడెదను.

బుద్ధుడు: ఇంతులకు దీక్షయనునదిలేదు

యశో : జగతిలో సగము విడి మిగిలిన సగమునకె అన్వయించునది ధర్మమె ? ధర్మఖండమది. వ్రక్కలించిన ధర్మము.

బుద్ధుడు: ఇదివరకు ఇంతులకు దీక్షను ఒసగలేదు.

ఆనం : గురువులకు విన్నపము. ఇంతియైనంతనే దీక్ష ఒసగమటన ధర్మమున ఒక కొఱత ఏర్పడును

బుద్ధుడు: ఆనంద, అమాట అటనెవిడు.

ఆనం : వేలాది ప్రజదీని వేడునుండిరి మాదు ధర్మమున మాగురు లాది భిక్షువులైన మాదిరిగ గురుపత్ని అది భిక్షుకి కావలె టంచు మాకోర్కి. తల్లి, అంబాపాలి, (ఆమెయు, అంబికయు వత్తురు)

అంబా : వచ్చితిని.

ఆనం : గురులతో గురుపత్ని దీక్ష వేడుచునుండె సదెకసుడు.

అంబా ; దీని కరుణించవలెనంచు మీపదమంటి వేడికొందును

ఆనం : అందరును ఇట్లె వేడెదరు.

బుద్ధుడు: ఇంతులకు దీక్షనొసగిన నేను ప్రవచించు ధర్మంపుటాయువున సగము నశియించు.

యశో : ఆ! స్త్రీయన్న దింతల్పమయ్యెనే?

బుద్ధుడు: అది కాదు. స్త్రీకి దీన కొఱంతలేదు. భిక్షుక తతికి ప్రవ తపోనుష్ఠానములు కష్టతరములగు, పలుమంది ఓడుదురు చెడను వ్యవహారమ్ము.

యశో : పురుషులను మాత్ర కాపాడగా ఒకయుగము. స్త్రీపురుషలను కావఅరయుగము. ఇద్దరును ముక్తిపొందగ నిండు. అర్థ యుగమె చాలందు.

అంబా : ఇదే మా అభీష్టమ్మ.

బుద్ధుడు: ధర్మమును రక్షింప బహుకఠిన నియమముల నేర్పాటు చేయవలె.

యశో : అన్ని నియమములకు ఒప్పెదము.

బుద్ధుడు: కానిండు

యశో : బ్రతికితిని నేను. (మ్రొక్కును)

అంబా : బ్రతికితి నేను. (మ్రొక్కుచు)

అంబిక : నేనును బ్రతికితిని అమ్మ నేను తోడు వచ్చెదను.

(మ్రొక్కును, రాజు, సారిపుత్రుడు మొదలగువారు వత్తురు)

రాజు : ఏమిద్ది, ఆనంద ? (ఆనందుడు అంతయును చెప్పును). అక్టేమి శుభమయ్యె, తనదు పతి సన్న్యాసము కొనియె నను వార్త విన్నంతనే కావి వస్త్రములు ధరియించె, నాడు తానె

ధరించి నిట్టిదీక్షను నేడు గురువైన పతినుండి మరియొకటి పొందినని. తల్లి నీదగు బాధ చూడనేరకనేను కడు బాధపడితి. అది నేడు ముగిసినదమ్మ. నాకింక ఇంత చింతయులేదు. మిము పంపి ఒక్కడనె ఉండవలె, అదిచాల కష్టమగు. కాని మీ సుఖముకై దాని సహించెదను.

బుద్ధుడు: ప్రస్తుతము దేవి భిక్షుకి ఇచ్చటనే నిల్చి పది వర్షములుగ చేసిన తపమునిచ్చటనె కొనసాగచేయు. రాహులుని నే కొనిపోదు.

యశో : (అంబికకు) ఇదె నియమమంబికా.

అంబిక : (ఎక్కడో చూచుచుండి) అమ్మా, ఏమన్నారు?

రాజు : రాహులుని వానికిని దీక్ష ఒసగగబడెన ?

బుద్ధుడు: రాహులునితల్లి అతనికి దీక్షవేడిరి. ఇచ్చెదను.

రాజు : లేమొలక పీకి ఎండించి ఇటు వంశమును ముగియింత్రత? పెద్దలను అడుగకయె పిల్లలకు దీక్ష నొసగగరాదటందును.

బుద్ధుడు: ఒప్పితిని.

రాజు : సంతసము నాదు జీవితములో ఒకటి రెండేండ్ల కొకసారి ఇటకరుదెంచి, ఎడబాటుబాధ హరియించి, తృప్తినినించి, చను చుండవలె. మానవునికి వృద్ధాప్యమున లేనిసుంగును అందునను కూడ తన్ను విడిచన్నలే నిసుగు-కన దరికి వచ్చెడి మృత్యు భైరవస్వర్గ మొక్క మృదుగీతమట్లగును.

బుద్ధుడు: అట్లె కానీ, వచ్చి సేవించెదము.

యశో : నేను ఇచె ఉందు. సుతునట్లు, సుతుని ఈ సుతునట్లు సేవించుచివటనే సిద్ధిని కనుగొందు.

రాజు : సంతోషమమ్మ.

యశో : నా నేటిఆనందమ్ము అచ్చిన్న మగునట్టు లాశిషములొసగవలె.

రాజు : అట్లెకానీ తల్లి, నీ మనో హర్షమ్ము జగమంత నిండనీ, సృష్టియె సుఖించనీ!

అంబా : జయబుద్ధ, గురుదేవ, జయశుద్ధ చారిత్ర; జయ త్రిలోకాచార్య, జయ జగన్మిత్ర, జయ పతితపావనా, జయదేశికేంద్ర జయ ఉద్ధారక కర్త, జయ త్రైభువనపూజ్య, జయధవళకీర్తి, జయము నాగురునాథ, కారుణ్యమూర్తి.

(అందరును బుద్ధునికి నమింతురు. తెరపడును)

(స మా ప్త ము)

# రామప్పగుడి

## శ్రీ నల్లాన్ చక్రవర్తుల శేషాచార్య

[ ఆంధ్రప్రదేశ్ నందు వరంగల్లుకు సమీపమున నున్న రామప్పగుడి యందలి అద్భుత శిల్పకళా సంపదను చూచి, వాటి శిథిలావస్థకు హృదయము ద్రవించి వ్రాసిన పద్య కుసుమములు ]

సీ॥ చేతులెట్లాడెనో, ఛేదించివైచిరీ
వైభవోపేత శిల్పముల నకట!
అంతరంగాలెట్టు లంగీకరించెనో
నృత్య భామినులను, హత్యజేయ!
బుద్ధెట్లు పుట్టెనో, ముగ్ధమోహన స్తంభ
శిల్పాల శిధిలమ్ము చేసివైవ!
రమణీయ శిల్పకళా ఖండమిద్ది, ఈ
నందీశ్వరుని యెట్లు, నఱికినారో!

తే.గీ. ఇట్టి సుందర శిల్పాల మట్టు బెట్టి
రెవరు? వారలే జాతి వారేని, వారి
కవని తలముననుండ నర్హతయు కలదె?
వారి పాప భాండమెపుడు బ్రద్దలగునో?

సీ॥ రామప్ప దేవళ ప్రాంగణమ్మున నున్న
చెఱువది, మిగుల అచ్చెరువు గొలుపు!
చేరువే 'పాకాల' చెరువదే తిలకింప
పులకింత కలిగించు 'ములుగు' చెఱువు!
భద్రకాళీదేవి భాసిల్లు నిచ్చోటు
అలలతో నలరారు కొలను చెంత!
వివరింప నేరీతి వెలసెనో చెర్వులు
వింతగా నిన్ని ఈ ప్రాంతమందు?

తే.గీ. అమరులీ శిల్పకళకు దిగ్భ్రమను చెంది
కొంచె మమృతమ్మునిటు కురిపించిరేమి?
నష్ట శిల్పాలగాంచి ఆనాటి ప్రజలు
ఎదలు చెరువులైపోవ యేడ్చినారో?!

తే గీ. వేయికనులు చాలవీ రాయి కనగ
కారునో యేమొ పాలు బుగ్గలను గిల్ల
శిల్ప నైపుణ్యత నొకచో చేర్చినావె
అమరశిల్పి జోహారు లందుకొనుము!

ఆ.వె. రాతిబొమ్మ కాదు, రా, లోపల హృదయ
ముండె ఆత్మ, మనసు, మూడు కలవు
భ్రష్టుచేసి నా'రరాతి' జాతులు దీని
క్రూరు లార ఘోర దారుణమ్ము

ఆ.వె. అమరశిల్పి మయుడ - అంతగా పొంగకు!
శిరము వంచి చూడు - శిల్పకళను
శిరము వంచుకొందు - చేతులు పైకెత్తి!
ఉన్నమాట, అతిశయోక్తి కాదు!

తే.గీ. గర్భగుడిలోన గరళకంఠుడుండె
చెల్లె 'రామప్ప' గుడియంచు - చిత్రమిదియు
ఎవ్వడింతటి ఘనకీర్తి నిలను పొందె!
తలప నీప్రతిభ కిద్దె నిదర్శనంబు!

శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి

# తూర్పు చాళుక్యుల వరాహలాంఛనము

అక్టోబరు 1983, భారతిలో శ్రీ జాస్తి దుర్గాప్రసాదుగారు రామచంద్రపురం తాలూకా పెద్దాపురప్పాడు గ్రామంలో తాము సంపాదించిన తామ్రశాసనము నొకదానిని ప్రకటించియున్నారు. దానిని గూర్చి యొక పరిశోధక వ్యాసమును గడచిన మార్చి 1984 రెండవ వారంలో ఔరంగాబాదు మరాట్వాడా విశ్వవిద్యాలయంలో జరిగిన ఎపిగ్రాఫికల్ సమావేశంలో చదివిరి. అప్పట్లో ఆ శాసనాన్ని విశేషముగా యోచించుట జరగలేదు. అందలి విషయమును అనగా జైన ఆలయముల కిచ్చిన భూములను గూర్చి విశేషము లేదు. కాని ఆ శాసనమును గూర్చియే కొంత అనుమానము గలదు. అందు ముఖ్యమైనవి రెండు అంశములు.

1. ఆ శాసనపట్టికలను కూర్చియుంచిన కడియముపై గల రాజముద్రిక నిజమైనది కాదు.

2. శాసనమందలి వ్రాత ఆ రాజుయొక్క కాలపుది కాదు.

ఇందు మొదటి అంశము ఈ వ్యాస శీర్షికకు సంబంధించినది.

ఇటీవల తూర్పుచాళుక్యరాజుల శాసనముద్రికలను గూర్చియొక పరిశోధక వ్యాసము వ్రాయుట కవసరమేర్పడి నేను కొన్ని ముద్రికలను పరిశీలించితిని. ఆ సందర్భమున వేంగీదేశమును పాలించిన తూర్పుచాళుక్యులు చాలకాలము వరాహముద్రనుపయోగించినట్లు కనుపించలేదు. తమ మూలకుటుంబమైన బాదామి చాళుక్యులే సామ్రాజ్య చిహ్నమైన వరాహలాంఛనమును వాడిరి. వారి దాయాదు లెవ్వరు ఆ ముద్రను వాడినట్లు తెలియదు. అట్టి శాఖావంశములవారు వారి పేర్లతో గాని, బిరుదములతోగాని రాజముద్రికల నేర్పాటు చేసుకొనిరి. అందు చంద్రవంక, పద్మము, దీపస్తంభములు అనుబంధ చిహ్నములుగ వాడిరి. ఉదాహరణకు గుజరాతు నేలిన నాగవర్ధనుడను రాజు రెండవ పులకేశి మహారాజునకు తమ్ముని కొడుకు. అతడు 'జయాశ్రయ' అను తన తండ్రి బిరుదుతో ఒక శాసనమిచ్చెను. దాని ముద్రికపైన చంద్రవంక, 'శ్రీ జయాశ్రయ', రేకుల క్రిందికి వికసించిన పద్మము గలవు. అట్లే తూర్పుచాళుక్యులు కూడ మొదట చాలకాలము తమ బిరుదములగు 'విషమసిద్ధి', సర్వసిద్ధి', 'విజయసిద్ధి' ఇత్యాది విశిష్ట నామములను ముద్రికలపై వ్రాయించి, చంద్రరేఖ, వికసించిన పద్మము అనుబంధ చిహ్నములుగ చేర్చి శాసనము లొసగిరి. వీటిలో నేదియు సార్వభౌమాధికారాన్ని తెలుపజాలవు. బాదామి చాళుక్యులు అట్లుగాక తమ ముద్రికలపై వరాహలాంఛనమును మాత్రమే వాడిరి. అదియే వారి సార్వభౌమాధికార సూచకము. దానికి అనుబంధముగా మరియేబిరుదమునుగాని, చిహ్నమునుగాని, వాడలేదు. అంటే వారి వరాహ లాంఛనాన్ని మఱియొక రాజవంశముగాని, తమ దాయాదులుగాని వాడుటకు వీలులేదు. ఒకవేళ ఎవ్వరైన వాడినట్లు తెలిసినచో వారితో యుద్ధము తప్పదు. దాయాదులలో ముఖ్యులైన తూర్పుచాళుక్యులు వారికి అనుబంధ కుటుంబముగనే యుండిరి. వీరినే వేంగీచాళుక్యులని కూడ చెప్పుదురు. వారిలో మొదటి ఎనిమిదిమంది రాజుల ముద్రికలు ఒక తరగతికి చెందినవి.

1. కుబ్జవిష్ణువర్ధనుడు ఈ తూర్పుచాళుక్యులకు వంశస్థాపకుడు. ఇతడు క్రీ. శ. 624 - 641 మధ్య రాజ్యమేలెను. ఇతడు తిమ్మాపురం[1], చీపురుపల్లి[2] శాసనములను ఇచ్చెను. వాటి ముద్రికలపైన అతని బిరుదగు 'శ్రీ విషమసిద్ధి' యను వ్రాతతో చంద్రవంక, పద్మము గల యట్లు తెలియుచున్నది. వరాహలాంఛనము వాడలేదు. స్థల, జల, వన, విషమ దుర్గములను సైతము సాధించగల యోధుడని యా బిరుదునకు అర్థము.

2. అతని కొడుకు మొదటి జయసింహవల్లభుడు క్రీ.శ. (641 - 672) ఏడెనిమిది శాసనము లొసగెను. వాటిలో కొన్నిటిపైనే రాజముద్రికలు లభించుచున్నవి. ఆ ముద్రికపైన ఆ రాజుయొక్క బిరుదయిన 'శ్రీ సర్వసిద్ధి' యను వ్రాతయు, చంద్రుడు, పద్మము అనుబంధచిహ్నములుగను వాడబడెను[2]. వరాహలాంఛనమును ఇతడు కూడ వాడలేదు.

3. జయసింహ వల్లభుని తరువాత అతని తమ్ముడు ఇంద్ర భట్టారకుడు ఏడురోజులు మాత్రమే రాజ్యమేలినట్లు వారి రాజ వంశావళిలో జెప్పబడుచున్నది. ఆ స్వల్పకాలములోనే యతడు కొండనగూరు అను గ్రామాన్ని దాన మొసంగుచు శాసనమిచ్చెను. దాని ముద్రికపై అతని బిరుద నామమైన 'శ్రీ త్యాగధేను' అని వ్రాయబడి, దానిపైన చంద్రవంక, క్రింద వికసించిన పద్మము గలవు.[3]

ఇతడుకూడ వరాహ లాంఛనమును వాడలేదు.

4. జయసింహ వల్లభుని కాలములోనే తనకు పుత్రులు లేని కారణమున తన సోదరుడైన యింద్రభట్టారకుని పుత్రుడైన రెండవ విష్ణువర్ధనుని యువరాజుగ జేసెను. ఇతడు కూడ 'శ్రీ విషమసిద్ధి' యను బిరుదు వహించి తొమ్మిదేండ్లు రాజ్యమొనర్చెను. (క్రీ. శ. 673 - 681). ఇతని మొదటి శాసనము కొణెకి గ్రామ దానమును తెలుపునది.[4] దీని ముద్రికపై జెప్పిన బిరుదమును, పైన చంద్రవంక, క్రింద వికసిత పద్మము గలవు. ఈ రెండవ విష్ణువర్ధనుడివి మఱి నాలుగు శాసనములు తెలియవచ్చినవి. వీటిలో రెండు పమిడిముక్కల గ్రామానికి చెందినవి.[5] మూడవది రేయూరు గ్రామదాన శాసనము. మట్టెవాడ శాసనముకూడ ఇతనిదే.[6] వీటిలో రెండింటిపైన ముద్రలు లభించుచున్నవి. వాటి పైనగూడ కొణెకి శాసనముద్ర మీదవలెనె 'శ్రీ విషమసిద్ధి' పైన చంద్రుడు, క్రింద పద్మము మాత్రమే గలవు. వరాహ లాంఛనము లేదు. శ్రీ శాస్త్రి దుర్గాప్రసాదు గారు ప్రకటించిన పెద్దా పురప్పాడు శాసన పట్టికలు ఈ యిమ్మడి విష్ణువర్ధన మహారాజు ఇచ్చి నట్లే శాసనమందుగలదు. పైనజెప్పిన ఈ రాజుయొక్క అయిదింటిలో ముద్రికలు లభించుచున్నవి. మూడవ వాటిలో వరాహము లేదు. సూర్య బింబము లేదు. చంద్రవంక, పద్మము మాత్రమే గలవు. కాని పెద్దా పురప్పాడు శాసనం ముద్రికపై ఆ రాజలాంఛనము, సూర్యబింబము అధికముగ గనుపించుచున్నవి. కనుక ఈ ముద్రిక నిజమైనదని చెప్పుట కష్టము.

పోనీ, ఈ శాసనంతోటే వరాహముద్రిక ప్రారంభమైనదనుకొన వచ్చునుకదా అనుటకువీలులేదు. ఇతని తరువాత వచ్చిన మఱి యెనిమిదిమంది రాజులుకూడ వరాహ లాంఛనమును వాడలేదు.

మఱియొక విశేషము గలదు. తూర్పు చాళుక్యవంశపు మొదటి రాజువని భావించబడుచున్న కొన్ని నాణెములు 'విషమసిద్ధి' అను బిరుదమును, చూచుచున్నట్లున్న సింహము ఒకవైపున, రెండు దీప స్థంభముల మధ్య పూర్ణ కుంభము వంటిది రెండవ వైపున ముద్రించ బడెను. కాని వరాహము లేదు. రాజరాజ నరేంద్రుడు వరాహ ముద్ర తోనే నాణెములను ముద్రించెను. మొదటి రాజులకు వరాహము లేదు.

5-8. తూర్పు చాళుక్యులలో ఆయువరాజు రెండవ విష్ణు నుని కొడుకు మంగి యువరాజు (క్రీ. శ. 681-705). ఇ పాలించిన 25 ఏండ్లలోను కొన్ని శాసనము లిచ్చెను. ఆవి అన్ని తన బిరుదమగు 'శ్రీ విజయసిద్ధి' అను వ్రాతయు, పైన చంద్రవం దానికిరువైపుల దీప స్తంభములు, క్రింద వికసిత పద్మము మాత్ర గలవు.[7] (దీపస్తంభములను కొందరు ఖడ్గములని చెప్పిరి). ఇ పుత్రులలో మొదట రెండవ జయసింహ వల్లభుడు పదమూడే పాలించి (క్రీ.శ. 705-717) 'శ్రీసర్వసిద్ధి' బిరుదముతో శాసన లిచ్చెను. ఇతని తరువాత కొక్కిలి విక్రమాదిత్యుడు ఆరునె మాత్రము పాలించెను. ఇతడు 'శ్రీవిజయసిద్ధి' బిరుదముతో నొకశా మొసగెను.[8] ఇతనిని తొలగించి తనకంటె పెద్దవాడగు మూడవ వి వర్ధనుడు రాజై ముప్పదారేండ్లు వేంగి రాజ్యమేలెను. (క్రీ.శ.718 7 ఇతని శాసనములన్నీ 'శ్రీవిషమసిద్ధి' యను బిరుదాంకితమ చంద్రుడు, పద్మము చిహ్నములతో గూడిన రాజముద్రికలతో నొ బడెను. ఉదాహరణకు ఇతని ఈపూరు పట్టికల కగియముపై బిగి బడిన ముద్రికలో 'శ్రీవిషమసిద్ధి' పైన చంద్రవంక, అందు సూర్యుడు క్రింద వికసితపద్మము గలవు.[9] ఇతనికి 'శ్రీత్రిభువనాంకు బిరుదుకూడ గలదు. అందుచే ఇతని పసుపుంబట్టు శాసనము 'శ్రీ విషమసిద్ధి'కి బదులు 'శ్రీ త్రిభువనాంకుశ' అను వ్రాతను క యున్నది. తూర్పు చాళుక్యులలో మొదటిసారిగ ఈ బిరుదము ప్రవేశపెట్టినవాడీ మూడవ విష్ణువర్ధనుడే. కాని చాళుక్య సార్వభౌ చిహ్నమైన వరాహలాంఛనము మాత్రము ఇంతవరకు ముద్రికల రాలేదు.

ఈ మూడవ విష్ణువర్ధనుడే తిరిగి వ్రాయించి యిచ్చినద భావింపబడుచున్న ముసినికుణ్ణ గ్రామదాన శాసనమొకటి గలదు. మొదట కుబ్జవిష్ణువర్ధనుడి రాణి అయ్యణ మహాదేవి యొసగిన దా తిరిగి మూడవ విష్ణువర్ధనుడిచ్చెనని ఆశాసనాన్నిబట్టియే తెలి చున్నది. దీని ముద్రికపైన 'శ్రీవిషమసిద్ధి' సూర్య, చంద్రులు, వ హము, అంకుశము, పద్మముగలయట్లు ప్రస్తుతము గనుపించుచున్న ఈసందర్భమున శాసనమందు సూచింపబడిన పునర్దత్తమను విషయ గాక, శాసనలిపిలోను, ముద్రిక చిహ్నములలోను సంశయములు గల ప్రభుత్వవార్షిక శాసన నివేదికలో ఆముద్రికపై 'కుబ్జవిష్ణువర్ధనమహారాజ అని యున్నదని వ్రాసిరి, ఇది యింకను సందేహముగానున్నది. అ శాసనముల ముద్రిక 'శ్రీవిషమసిద్ధి' యను వ్రాతను గలిగియున్న తెలియుచున్నది. పూర్వులు ఆ ముద్రికయున్న యెడల ప్రస్తుత వేఱొండుముద్రిక 'వరాహ లాంఛనముతో' ఆశాసనపు రేకులపైకి ఎ వచ్చెనో తెలియదు. అయినను ఇదియు లిపినిబట్టి ముద్రికచిహ్నముల బట్టి సంశయాస్పదంగా ఉంది. మఱియొక విశేషముకలదు. ఈ ముసి

కుణ్ణి శాసనము, పైన రెండవ విష్ణువర్ధనుడిడిగా చెప్పబడిన పెద్దాపుర ప్పాడు (దుర్గాప్రసాదుగారు ప్రకటించిన) శాసనము రెండు జైన బసదులకిచ్చిన శాసనములు. వ్రాతలోని లిపినిగూర్చి రెంటిలోను అనుమానముకలదు. ఈ యిద్దరు విష్ణువర్ధనులు వరాహలాంఛనముగల ముద్రికలో ఇచ్చిన వేఱొండు శాసనములు లభించలేదు. అంతేగాక వీరిద్దరి తరువాత కూడ మఱికొందరు రాజులుకూడ వరాహలాంఛనాన్ని ముద్రలపై వాడినట్లు తెలియలేదు ఈ మొదటిదశలో వీరు బాదామి చక్రవర్తుల సార్వభౌమాధికారమును మన్నించుచు వారిలో నొకరుగా యుండిరి.

9_12. తూర్పుచాళుక్యులలో తొమ్మిదవరాజు మొదటి విజయాదిత్యుడు. ఇతడు మూడవ విష్ణువర్ధనుని కొడుకు. ఇతని రాజ్యారంభములోనే (క్రీ. శ. 752-772) బాదామి చాళుక్యవంశము రాష్ట్రకూటులచే నోటువడి పతనమొందెను. మొదటి విజయాదిత్యుడు పరమేశ్వర భట్టారక బిరుదములు వహించి బాదామి రాజులు కోల్పోయిన సార్వభౌమాధికారాన్ని వేంగివంశములో పునః ప్రతిష్ఠింపజూచెను. కాని శాసనములను మటుకు 'శ్రీత్రిభువనాంకుశ' బిరుదముతో సూర్య చంద్ర పద్మ చిహ్నములతో మాత్రమే యొసగెను. ఉదాహరణకు ఇతని కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్తు పట్టికలు, తెనాలిపట్టికలు[11] ఇట్టి ముద్రికలు గలిగియున్నవి,

ఇతని కొడుకు నాలుగవ విష్ణువర్ధనుడు వేంగిరాజులలో పదవ వాడు (క్రీ. శ. 772_807), ఇతడుకూడ 'శ్రీ విషమసిద్ధి' బిరుదుగల ముద్రికలోనే తన శాసనములపై వాడెను. కాని ఛత్ర, చామర, ఢక్క, పాలికేతన, గంగా యమునా, మకరతోరణ రాజద్వారములు ఇతడు కలిగియున్నట్లొక శాసనం చెప్పుచున్నది.[12] మొదట యీ చిహ్నము లన్ని బాదామిచాళుక్య రాజగు విజయాదిత్యుడు (క్రీ॥ శ॥ 697-731) తన ఉత్తర దిగ్విజయం సాధించినందుకు సూచకముగా ప్రవేశపెట్టెను. పాలికేతనమనగా కొన్ని ప్రత్యేక చిహ్నములుగల జెండాల వరుసలని చెప్పుదురు. అవి దిగ్విజయ సూచకము. ఆ విజయయాత్రలో అప్పటి తూర్పుచాళుక్యరాజులు కూడ పాల్గొనియుందురు, తత్సూచకముగా వీరు కూడ వాటిని వాడుకొనుటకై అర్హతను, ఆ విజయాదిత్య చక్రవర్తియొక్క అంగీకారముతో బొందియున్నట్లు చెప్పవచ్చును. కాని సార్వభౌమ చిహ్నమైన వరాహలాంఛనాన్ని మటుకు వేంగి రాజులకు ఆ విజయాదిత్యచక్రవర్తి యివ్వలేదు. కనుక బాదామి వంశ పతనమువరకు వేంగిరాజ్య మేలిన రాజులెవ్వరు ఆ రాజలాంఛనాన్ని వాడలేదు. ఆ తరువాతవారు నలుగురు మొదటి విజయాదిత్యుడు, నాలుగవ విష్ణువర్ధనుడు, ఇతని కొడుకు నరేంద్రమృగరాజవిజయాదిత్యుడు నలుబదియేండ్లు. (క్రీ॥ శ॥ 808-847). ఇతనికొడుకు అయిదవ విష్ణువర్ధనుడు ఒకటిన్నర యేండ్లు మాత్రము వరుసగా వేంగి రాజ్యమును పాలించిరి. వీరిలో విజయాదిత్యులిద్దరు 'శ్రీ త్రిభువనాంకుశ' బిరుదముతోటి, విష్ణువర్ధను లిద్దరు 'శ్రీవిషమసిద్ధి' బిరుదము తోటి రాజముద్రికలను చేయించిరి. ఈ నలుగురి కాలంలోను, రాష్ట్రకూటరాజులతో వీరికి యుద్ధములు పెక్కుగా సాగినవి, బాదామి వారి సామ్రాజ్యము తమకుచెందినది కనుక వారికి అనుయాయులుగా నున్న వేంగి చాళుక్యులుకూడ తమ సార్వభౌమాధికారాన్ని అంగీకరించవలెనని రాష్ట్రకూటుల పట్టుదల. ఇందుకు వేంగిరాజులు అంగీకరించకపోవుటయే వారిద్దరిమధ్య యుద్ధములకు ముఖ్యకారణాలు. రాష్ట్రకూట ధ్రువ, నిరుపమచక్రవర్తి (క్రీ॥ శ॥ 780-794) వేంగిరాజగు నాల్గవవిష్ణువర్ధనుని యుద్ధములో ఓడించెను. ఇతను సంధిచేసుకుని సామంతుడుగా నుండుట కంగీకరించెను. తనకుమార్తెయైన శీలమహాదేవిని ధ్రువరాజుకిచ్చి వివాహము జేసెను. నరేంద్రమృగరాజు యిమ్మడి విజయాదిత్యుడు రాష్ట్రకూట మూడవ గోవిందునితో నూటయెనిమిది యుద్ధములుచేసి గెలుపొందెననియు, తత్సూచకముగ 108 నరేంద్రేశ్వరాలయములు ప్రతిష్ఠించెననియు చెప్పుచుందురు. నరేంద్రుడని, రాష్ట్రకూట మూడవ గోవిందునికి బిరుదు. అతనిని యుద్ధమునందోడించి నరేంద్రమృగరాజు (నరేంద్రునికి సింహము వంటివాడు) అని సార్థకమైన బిరుదము వహించిన మేటి రాజు రెండవ విజయాదిత్యుడు. కాని యితని విజయములన్నియు రాష్ట్రకూట దేశములో గాక తన వేంగి రాజ్యములో వారి దాడులను ఎదుర్కొనుటలో జరిగినవి. అందుచేత రాష్ట్రకూట సార్వభౌమాధికారాన్ని పడతోసిన మాట అతనికి దక్కలేదు. అట్టివిజయాన్ని సాధిస్తేనేగాని వారు బాదామి రాజుల నుండి లాక్కొన్న పాలికేతనము, గంగాయమునలు మున్నగువాటితో బాటు తమ వంశలాంఛనమైన వరాహముద్ర వాడుకొనుటకు వీరికి వీలుండదు' ఆకాలములో శత్రువుల సార్వభౌమాధికారాన్ని యుద్ధములో విజయము సాధించి కూలద్రోసినగాని రాజచిహ్నములు వాడుటకు వీలుండేదికాదు దక్షిణాపథములో అప్పుడు రాష్ట్రకూటుల యధికారమునకు తిరుగులేకుండెను. కనుక మరియెవ్వరినివారు సామ్రాజ్యచిహ్నముల నుపయోగించుకొననీయకుండిరి. కనుక అయిదవ విష్ణువర్ధనుడి వరకు (క్రీ॥ శ॥ 848) వేంగి రాజులకు ఇదివరకు బాదామి విజయాదిత్యుడిచ్చిన పాలిధ్వజము, గంగాయమునాదులుశేవు సరికదా చాళుక్య వంశలాంఛనమైన వరాహముకూడ ఉపయోగించుకొనెడి అధికారము లేకుండెను. ఉదాహరణకు నరేంద్ర మృగరాజుయొక్క కొఱ్ఱపఱు, ఈడేరు, తాండివాడ, వొర్పంగు శాసనాల[13] ముద్రలపై దేనిమీద వరాహముద్ర కానరాదు. ఇంతవరకు రెండవదశ.

పై చర్చవలన తేలిన విషయము. తూర్పు చాళుక్యులలో మొదటి యెనమండుగురు బాదామి వారితో కలిసి యొకేకుటుంబముగా

నుండిరి. పల్లవులతో యుద్ధములందుగాని, ఉత్తరదిగ్విజయములందు గాని,యిరువంశములవారు కలిసియే మెలగిరి. అప్పుడు వరాహలాంఛనము ప్రధానకుటుంబమైన బాదామివారే కలిగియుండిరి. వారి యంగీకారముతో పాలకేతనము, గంగాయమునాదులను మాత్రము వేంగీ రాజులు కూడ వాడుకొనుచుండిరి. క్రీ. శ. 752 ప్రాంతమున బాదామి వంశపతనమైన తరువాత రాష్ట్రకూటుల బెడదతో వేంగీ రాజులు వరాహలాంఛనమును పొందలేకపోగా పాలిధ్వజాదులను కూడ కోల్పోయిరి. అంటే వీటిని వాడుచో రాష్ట్రకూటుల సార్వభౌమత్వాన్ని అంగీకరించనట్లు ప్రకటించుటయే. అప్పుడు వారితో పెద్దయెత్తున యుద్ధము తప్పదు. అందులకై వేంగీరాజులు రాష్ట్రకూటులతో సంధిగావించుకొని వివాహబాంధవ్యాలను కుదుర్చుకొని స్వాతంత్ర్యాన్ని మట్టుకు కాపాడుకొనుచువచ్చిరి. ఈ విధంగా వరాహలాంఛనము వేంగీరాజులకు కనీసము క్రీ.శ. 860 వరకు లభించినట్లు చెప్పుటకు ఆధారములు లేవు. పైన చెప్పిన రెండు జైన శాసనముల ముద్రికలే యిందుకు భిన్నముగా నున్నవి. కనుక వాటిలో నొకటియైన పెద్దాపురప్పాడు శాసనము, దానిముద్రిక నిజమైనవని చెప్పవీలుగాదు. దానినిచ్చిన రెండవ విష్ణువర్థనుడి యితరశాసనాల ముద్రికలు వరాహలాంఛనాన్ని కలిగియుండుటలేదు. అంతకు ముందు వెనుకలనున్న రాజుల ముద్రికలు కూడ ఆ లాంఛనమును కలిగియుండలేదు. ఇట్టిదే మూడవవిష్ణువర్థనుడి పునర్దత్త ముసినికుణ్ణ గ్రామశాసనముకూడ.

ఇంక తూర్పుచాళుక్యులకు వరాహలాంఛనమెప్పుడు వచ్చెనో పరిశీలించవలసి యున్నది.

అయిదవ విష్ణువర్ధనుడు వేంగీరాజ్యాన్ని ఒకటిన్నర సంవత్సరం మాత్రమే పరిపాలించెను. తరువాత అతని పుత్రుడు గుణగ విజయాదిత్యుడు (క్రీ. శ. 848 - 892) 44 గేండ్లు రాజ్యమేలెను. ఇతడు ఆ వంశములో విజయాదిత్యుడనే పేరుగలవారిలో మూడవవాడు. తూర్పుచాళుక్యరాజులందరిలోను ఇతడు మిక్కిలి గొప్పవాడు. పరాక్రమశాలి, సాహసోపేతుడు, రాజనీతియందారితేరినవాడు, స్వయముగ యుద్ధ కౌశలమెరిగిన యోధుడు. ఇతనికి ఇద్దరు రాష్ట్రకూట చక్రవర్తులు సమకాలికులై యుండిరి. వారిలో మొదటివాడు నృపతుంగుడని ప్రసిద్ధిగాంచిన మొదటి అమోఘవర్షుడు (క్రీ. శ. 814 - 877). పూర్వము శీలమహాదేవితో ప్రారంభమైన చాళుక్యరాష్ట్రకూట వివాహబాంధవ్యము మఱిరెండు తరములు సాగింది. దానితో గుణగుని తల్లి ఒక రాష్ట్రకూటరాజు కుమార్తె. అట్లే అతని భార్య చెల్లకాంబ కూడ ఒక రాష్ట్రకూట రాజు కూతురు. ఈమె అమోఘవర్షుని కూతురేయై యుండునని డా॥ నేలటూరివారు అభిప్రాయము వెలిబుచ్చిరి.[14] ఆమె గుద్రహారవిషయంలో చిమ్ముచలూరు గ్రామాన్ని దానం చేస్తూ ఇచ్చిన శాసనంలో తను వల్లభేంద్రుని కూతురునని చెప్పుకొనెను. ఈ విధంగా గుణగ విజయాదిత్యునికి రాష్ట్రకూట రాజుతో బాంధవ్యము, తన ధైర్య సాహసములు ప్రదర్శించగల సామర్థ్యము సమకూడినవి. ఈ అనుకూల పరిస్థితిని పూర్తిగా ఉపయోగించుకొని గత ప్రాయమైన చాళుక్య ప్రాభవాన్ని తిరిగి ప్రతిష్ఠింప బూనుకొనెను. అమోఘవర్షునికి ఇతనియెడ అభిమానము మెండు. ఈ విజయాదిత్యుణ్ణి తనకు యుద్ధ ప్రతినిధి (అంకకారుడు) గ చేసికొనెను. గంగవాడిలో పశ్చిమ గాంగరాజు నీతిమార్గుడు తన మిత్రులైన నోళంబులతోను మఱికొందరితోను గలిసి రాష్ట్రకూట సార్వభౌమాధికారాన్ని యెదిర్చి యుద్ధ సన్నద్ధు డయ్యెను. అంత అమోఘవర్షుడు రాష్ట్రకూట మూల బలాన్ని గుణగవిజయాదిత్యుని ఆధిపత్యాన గంగవాడిపై దండుపంపెను. గుణగుడు ముందు నోళంబబలమునకు అధిపతియైనమంగిరాజును యుద్ధ భూమిలో జంపెను. గాంగులను పారదోలి నృపతుంగచక్రవర్తికి ఘనవిజయము చేకూర్చి రాష్ట్రకూటాధిపత్యము నచటతిరిగి స్థాపించెను. సుమారు క్రీ.శ.860 ప్రాంతములో ఈ సంఘటన జరిగియుండును.[15] ఈ విజయానికి సంతుష్టుడైన నృపతుంగ అమోఘవర్షుడి నుండి ప్రతిఫలముగ విజయాదిత్యుడు చాళుక్యాధికార సూచకమైన 'వరాహలాంఛనము' నుపయోగించుకొను అనుమతిని సంపాదించెను. తూర్పుచాళుక్య వంశమునకు వరాహలాంఛనము వచ్చుట ఇదియే మొదలు. ఇంతకు ముందు లేదని వెనుక పరిశీలించితిమి. ఆ లాంఛనమున్న రెండు జైన శాసనాలు నిజమైనవి కావు అని చెప్పుటకు కూడ నిదియొక ముఖ్యకారణము.

దీనిని గూర్చిన శాసనాధారమునుగూడ చూతము.గుణగ విజయాదిత్యుడొసగిన మొదటి శాసనము మచిలీపట్నం గ్రామ పట్టికలని[16] యిప్పటివరకు విశ్వసించబడుచున్నది. ఆ శాసనపు కడియం ముద్రిక పైన 'శ్రీ త్రిభువనాంకుశ' అను వ్రాతతోబాటు మొదటి సారిగ వరాహ ముద్ర అంకుశ చిహ్నములు కానవచ్చుచున్నవి. ఈశాసనములో ప్రసక్తమైయున్న దాని విషయమును గూర్చి కూడ కొంత చెప్పబడెను. గుణగ విజయాదిత్యుడు మంగి రాజును చంపుటకు వినయడిశర్మ యను బ్రాహ్మణుడు అనుకూల పరిస్థితిని తెలియజెప్పి యుద్ధములో విజయము సమకూర్చెను. అందుకు సంతుష్టుడై విజయాదిత్యుడు వినయడిశర్మకు గుద్రవార విషయములో త్రిణ్డపఱ అను గ్రామాన్ని అగ్రహారంగా దానమిచ్చెను. ఇందుజెప్పబడిన మంగిరాజు నోళంబులకు జెందినవాడని చరిత్రకారులు నిర్ణయించిరి. ఆ యుద్ధముకూడ అమోఘవర్షుని పనుపున విజయాదిత్యుడు చేసినదే. ఇది క్రీ. శ. 860 ప్రాంతములో జరిగియుండునని ఆధారాంతరములను సమన్వయపరచి నిర్ణయించిరి. కనుక గుణగ విజయాదిత్యుడు వరాహలాంఛనము పొందుటకు కూడ ఈ యుద్ధ విజయమే కారణమైయుండునని తలంచ వచ్చును. బంధువు అనుకూలుడు, సమర్థుడు గనుక విజయాదిత్యుని సహాయమునకు

సంతుష్టుడైన అమోఘవర్షుడు చాళుక్యరాజ చిహ్నమైన వరాహముద్రను వాడుకొనుటకై అతనికి అనుమతినొసగుట అసంభవము కాదు. మచిలీపట్నం శాసనంలో తేదీ చెప్పబడలేదు. అయినప్పటికి మంగిరాజ వృత్తాంత కథనాన్నిబట్టి అది క్రీ. శ. 860 తరువాతదైనట్లు భావింప వచ్చును. అప్పటి నుండి వరాహము దానితోబాటు అంకుశ చిహ్నము కూడ తూర్పు చాళుక్యుల రాజ ముద్రికలపై గనుపించుచున్నవి.

నృపతుంగ అమోఘవర్షుని తర్వాత అతని కొడుకు రెండవ కృష్ణవల్లభుడు క్రీ. శ. 878లో రాష్ట్రకూట సింహాసనమధిష్ఠించెను. గుణగ విజయాదిత్యుడు పూర్వమువలెగాక కృష్ణవల్లభుని సార్వభౌమాధికారాన్ని నిరసించుచు ప్రవర్తిల్లెను. ఇరువురిమధ్య నెమ్మదిగా మొదలిడిన కీచులాటలు యుద్ధములుగా మారెను. అమోఘవర్షుడు అభిమానముతో ఇచ్చిన వరాహ లాంఛనం ఉపయోగించుకొనే అర్హతను కృష్ణవల్లభుని యొద్ద యుద్ధవిజయముతో సుస్థిరము చేసుకొనవలసిన అవసరము విజయాదిత్యునకేర్పడెను. అందుకొరకై అతడు రాష్ట్రకూటులపై దాడి వెడలెను. కృష్ణుడు తన మరిదియు, చేది దేశాధిపతియునైన సంకిలుని నగరమందుండి యుద్ధమునకు సన్నద్ధుడై లేడు. గుణగ విజయాదిత్యునికి ఈ యాత్రలో సంపూర్ణ విజయము చేకూరెను. ఈ సందర్భమున గుణగుడు రాష్ట్రకూటులకు చెల్లుచు వచ్చిన 'వల్లభ' బిరుదము, పాలిధ్వజమును, గంగాయమునలను స్వీకరించెను. దక్షిణాపథంలో ఏకఛత్రసార్వభౌమత్వానికి రాష్ట్రకూటులతోబాటు చాళుక్యులు గూడ అర్హులు అని విజయాదిత్యుడు నిరూపించెను. ఈ ఘన విజయాన్ని తరువాత తూర్పు చాళుక్యరాజులందరు తమ శాసనాల్లో ప్రశంసించుతూవచ్చిరి. తను సాధించిన సార్వభౌమ చిహ్నములను విజయాదిత్యుడు మొట్టమొదటిసారిగా తన సాతలూరు దాన శాసనంలో[17] చెప్పుకొనెను. దాని ముద్రికలో గూడ వరాహ లాంఛనము గలదు.

"తత్ర తృతీయ విజయాదిత్యః ద్వారి ప్రతిష్ఠాపిత గంగాయమునా చన్ద్రాదిత్య పాలికేతన [ః] సమధి గత పఞ్చ మహాశబ్ద శ్రవణ విత్రాసిత చతురాశ [శృక్రే] వరాహలాఞ్ఛనః ."

ఇంతవరకు శాసనాల్లో వరాహలాఞ్ఛన ప్రసక్తి సామాన్యంగా చాళుక్య వంశాన్ని గూర్చి చెప్పే ఉపోద్ఘాతంలో "వరాహ లాఞ్ఛనేక్షణ క్షణవశీకృతారాతి మండలానాం చాళుక్యానాం కుల మలంకరిష్ణోః"అని ఉండేది. వేంగిరాజులలోఎవ్వరూ వ్యక్తిగతంగా ఈ విశేషాన్ని చెప్పుకొనలేదు. గుణగ విజయాదిత్యుడు ఈ సాతలూరు శాసనంలో ఈ విశేషణము తనకు చెందేటట్లు చెప్పుకొన్నాడు. కనుక గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూట కృష్ణవల్లభు నోడించి పై జెప్పిన సార్వభౌమ చిహ్నములనందిని సంపాదించి చాళుక్యరాజ చిహ్నమైన వరాహ లాంఛనాన్ని తమ వంశంలో సుస్థిరమొనర్చెను. చరిత్ర రచయితల దృష్టిని ఇంతవరకు ఆకర్షించని యీ విశేషాంశము గమనించదగియున్నది. ఇంతకుముందున్న ఆ రాజుల శాసనాల ముద్రికలలో వరాహచిహ్నము లేదు. అది ఉన్న రెండు జైన శాసనాలు కృత్రిమములనక తప్పదు. ఇది వారి రాజముద్రికలను గూర్చిన మూడవదశ.

పెద్దాపురప్పాడు శాసనాన్నిగూర్చిన రెండవ అంశము మిగిలియున్నది. అది ఆ శాసనాక్షరములను గూర్చినది.అది రెండవవిష్ణువర్ధనుడు చేసిన దానమును తెలుపుచున్నది. ఆరాజు వేంగిదేశమును క్రీ॥శ 673 నుండి 681 వరకు పాలించినట్లు చరిత్రకారులు నిర్ణయించిరి. దానిపైనున్న రాజముద్రికను గూర్చి చర్చించి అది కృత్రిమమైనదిగా నిరూపించితిమి. అట్లాగని శాసనమందున్న వ్రాతను త్రోసివేయనవసరము లేదుకదా యనవచ్చు. కాని అదియు పొసగదు. అక్షరములు రెండవ విష్ణువర్ధనుని కాలమునకు చెందినవికావు. తొమ్మిది-పది శతాబ్దములనాటివి. అతని రేయూరు, పమిడిముక్కల శాసనాక్షరములతో బోల్చిచూచిన యీక్రింది వ్యత్యాసములు కనుపించును.

| పమిడిముక్కల శాసనము | | పెద్దాపురప్పాడు శాసనము | |
|---|---|---|---|
| 1. | క,ర లు నిలువుగ నున్నవి. | 1. | గుండ్రముగ మారు చున్నవి. |
| 2. | తలకట్టు సమతల రేఖతో చూపబడెను. | 2. | తలకట్టు కొంత పైకిచూప బడెను. |
| 3. | గ, శ అక్షరములకు తల కట్టు లేవు. | 3. | ఇందు కలవు. |
| 4. | 'బ' నలువైపులమూయబడి యుండును. లేదా యెడమ వైపున కలియకుండగ నుండును. | 4. | ఇది యిప్పటి 'బ' వలెనే యుండును. |
| 5. | 'జ' క్రిందిభాగం బత్వము ' ' దానిపైన దీనినే తల క్రిందుగా ఉంచినట్లుండును. | 5. | ఇప్పటి 'జ' వలె నుండును. |

| ఈనాడు | రేయూరు | పమిడి ముక్కల | పెద్దాపుర ప్పాడు. |
|---|---|---|---|
| క | [illegible] | [illegible] | [illegible] |
| ర | [illegible] | [illegible] | [illegible] |
| గ, శ | [illegible] | [illegible] | [illegible] |
| బ | [illegible] | [illegible] | [illegible] |
| జ | [illegible] | [illegible] | [illegible] |
| అ | [illegible] | [illegible] | [illegible] |
| వ, ణ | [illegible] | [illegible] | [illegible] |

వ్రాతలో అక్షరరూపములందుగల యీ వ్యత్యాసమునుబట్టి కూడ పెద్దాపురప్పాడు శాసనము కృత్రిమ మైనదని తెలియుచున్నది.

మఱియు, ఈ విష్ణువర్ధనుని యొక్క యితరశాసనాల్లో గను పించు రాజప్రశంసా విశేషణము లిందుగానరావు. జయసింహుడు వారి యితర శాసనాల్లోను; అతని శాసనాల్లోను 'జయసింఘ (హ) వల్లభ, అని పేర్కొన బడుచుండును. ఈ శాసనములో మాత్రము "జయ సింహవర్మ' అని పేర్కొనబడెను. ఇట్టివి మరికొన్ని యిందు చూప వచ్చును.

రెండవవిష్ణువర్ధనుడు తనకాలములో మొదట యిచ్చినశాసనాన్ని సుమారు తొమ్మిదో శతాబ్దిలో తిరిగి వ్రాయించుకొన్నారనుటకు కూడ రాజముద్ర అసంబద్ధమైయున్నది. ఇట్టి చిక్కు ముసినికుణ్ణ శాసనం లోనగలదు. దాన్ని మొదట యిచ్చింది కుబ్జవిష్ణు వర్ధనుడు (క్రీ. శ. 624-641). పునర్దత్తము చేసినది మూడవ విష్ణువర్ధనుడు (క్రీ॥ శ॥ 718-752) దానికి గల వరాహలాంఛనమున్న ముద్రిక తొమ్మిది-పది శతాబ్దములనాటిది. దాని లిపిని గూర్చి కూడ సందేహములు లేక పోలేదు.

ప్రాసంగికముగా ఈ రెండు జైనశాశనముల నిజమునుగూర్చి చర్చించవలసి వచ్చెను. మఱల వేంగిచాళుక్యుల రాజముద్రికలను గూర్చి కొలదిగా చెప్పవలసియున్నది. గుణగవిజయాదిత్యుని తరువాత రాజ్యమేలిన వారు మరికొన్ని చిహ్నములను ముద్రికయందు చే వచ్చిరి. రెండవ భీముడు (క్రీ. శ. 934-945) 'శ్రీ త్రిభువనాం వరాహము, అంకుశము, సూర్యచంద్రులు, వింజామరలు ె పద్మము చేర్చిన ముద్రలతో కొన్ని శాసనములొసగెను. అట్లే రె అమ్మరాజ విజయాదిత్యుడు (క్రీ. శ. 945- 970) పై చిహ లకు తోడు ఒక శంఖమును, తామరతీగతో గూడిన పద్మపు మె పూర్వమున్న వికసితపద్మము ప్రక్కన జేర్చి ముద్రించెను. రా నరేంద్రుని నాటికి మరికొన్ని చిహ్నములు చేర్చబడెను. ఉదాహర ఆ రాజొసగిన కలిదిండిశాసన ముద్రికపైన 'శ్రీత్రిభువనాంకుశ', పైన వరాహము, అంకుశము, డమరు, శంఖము, రెండు వింజామ ఛత్రము, సూర్యచంద్రులు, క్రిందిభాగమున సింహాసనము, వికసిం నాలుగు దళముల పద్మము, తామరకాడతోగూడిన పద్మముయొ మొగ్గ ముద్రించబడెను. ఆయన నందంపూడి శాసనంలో కనకదండ వంటిది చేర్చబడెను. ఆ తరువాత వచ్చిన చాళుక్య, చోళ, చ వర్తులు వీటికి తోడు చోళ లాంఛనమగు వ్యాఘ్రము, మరికొ ఇతర చిహ్నములను గూడ తమ ముద్రలపై జేర్చిరి.

మొదటి విజయాదిత్యుడు, రెండవ విజయాదిత్యుడు ముద్రల వాడిన 'శ్రీత్రిభువనాంకుశ' బిరుదమును 4వ, 5వ విష్ణువర్ధనులు వా నట్లు తెలియదు. కాని గుణగవిజయాదిత్యుని కాలమునుండి 'శ్రీత్రి వనాంకుశ' యనునది అధికారముగ రాజముద్రికలకు స్థిరమైన ప్రా యయ్యెను. ఒక్క తాడపరాజు మాత్రము 'శ్రీ త్రిభువనసింహ' అని వాడెను.

తూర్పుచాళుక్య రాజులందరిలోను గుణగ విజయాదిత్యు వరాహలాంఛనము పునరుద్ధరించుటయేగాక సాతలూరి శాసన నుండి వారి రాజవంశావళితో గూడిన ప్రశంసా కథనమును గూర్చ శా నములందు ప్రవేశపెట్టి ఆ వంశము యొక్క కీర్తిని చిరస్థాం రొనర్చెను. ఇదే సాతలూరు శాసనంలో తెలుగు కవచమును బో యుండునట్లొక చంపకమాల ప్రాసయుక్తముగ వ్రాయబడెను ఈ రా నాటి పండరంగుని అద్దంకి శిలాశాసనములో ప్రాచీన తెలుగు పద్యమ లుండుట పలువురకు తెలిసినదే. గుణగవిజయాదిత్యుడు అన్ని వి ముల ఘనత నార్జించిన రాజన్యశిఖామణి. అతి ముఖ్యమైన సాతలూరి తామ్రశాసన పట్టికలు అప్పుడు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వ రావు పంతులుగారి యధీనములో నున్నట్లు చెప్పిరి. వాటి ఆచూ తెలుసుకొని భద్రము చేయుట మంచిది.

ఫో ఙ్గా పి క లు

1. ఎ పి. ఇం. 9, పు 317-18.
2. ,, 18, పు 55.
3 ,, 18, పు 8.
4 ,, 31, పు 74; పు 80 కెదురుగా ప్లేటు.
5. వార్షిక శాసన నివేదిక (ఎ.ఆర్) 1917, పు 115.
6. ఇం. ఏంటి. 7, పు 188-7; 192.
7. ఎపి. ఇం. 8, చెందలూరు శాసనము పు 238.
8. వార్షిక శాసన నివేదిక 1908-9, తామ్రశాసనం 13.
9 ఎపి. ఇం. 18, పు 58.
10. వా. శా. నివేదిక 1917, పు 115, పేరా 21, తామ్ర శాసనము 9.
11. ఆంధ్ర హిస్టారికల్ జర్నలు 5, పు 51; ఎపి. ఇం. 36, పు 207.
12. ఎపి. ఇం. 37, పు 47, మూలం 7-8 పంక్తులు.
13. యస్. యస్. ఐ. 1, పు 31; ఎపి. ఇం. 5, పు 119; వా. శా. నివేదిక 1917, పు 117, ఎపి. ఆంధ్రికా III, పు 5, 6వ పటము.
14. ఎపి. ఆంధ్రికా. పు 10.
15. డా॥ నే॥ వేంకటరమణయ్య, గుణగ విజయాదిత్యుని విజయములను గూర్చి విపులముగ జర్చించిరి. 'ఈస్టరన్ చాళుక్యాస్', పు 108 నుండి మఱియు 'పల్లవులు, చాళుక్యులు' పు 320 నుండి
16. ఎపి. ఇం. 5, పు 123.
17 భారతి I, 1, పు 104 నుండి; ఆం. హి. రి. సో. పత్రిక V, పు 101 నుండి.
18. ఎపి. ఇం. 29, పు 58; పు 70 యెదుటిపటము.
19. వార్షిక శాసన నివేదిక 1909, పేరా 61.

# అంతర్వేది

## శ్రీ ఆర్. యస్. సుదర్శనం

వయసుపైబడి నిస్పృహోవ్యర్థహృదయ
శూన్య మాకాశమై రాత్రి జొచ్చినపుడు
మెరసె నొక మెరుపది మిరుమిట్లు గొలిపె
దివ్యకాంతిగ ప్రేమగా తేజరిల్లె.

వేచివేసారి ఏకాంతవీథి నిలిచి
కడలి యొడ్డున వెర్రిగా నడచిపోవ
గాలితోగలసిన హోరు గానముగుచు
రాత్రి గంధర్వ హృదయాను రాగ మొలికె.

వెదలి వెదకిన అంతరవేదియందు
నది వసిష్ఠ జలనిధి సంగమముజెందు
లవణ విస్ఫూర్తి, రాక్షసరాత్రిఖేల,
మనిషి స్తంభమై జ్యోతిరాత్మ వెలిగించె.

ముదురు నీలిమరంగు మేల్ముసుగుదాల్చి
రేయి జవరాలు తన్నావరించి విలువ
కడలి హృదయాన వలపురేకలుగవిచ్చి
చీకటి వెలుగునందు అస్తిత్వమొందె!

# అమృత సరస్సులో హాలాహలం

## శ్రీ సోమసుందర్

నీటి మీద అడుగుజాడ
నిరాకార నీరవ స్మృతి
కడలివంటి కాలంలో
దాచుకొన్న గురుతుల గతి....
ఎందుకొరకు వెదకులాట ?
ఏమిదొరకు నారినచితి ?
ఇసుకపొరల నెచట చాళ్ళు ?
నేల పీల్చె నెత్రుటేళ్ళు....
కాలచక్రనేమికి తెగె
ఇరులనక్క నల్లకుక్క....
అర్థరాత్రి ఊరిమొగల
కాకి గూట కలవరింత....
నల్లమందు తిన్న నరుల
నకముకాల గుంజాటన
వల్లకాటి నడుమ తిరుగు
గుంటనక్క కీడు ఊళ....
గూట కునుకు దివ్వెలాగు
కడగంటిన మునలిప్రాణి
దాహతప్తభూహృదయము
చీలినెరియలై త్రెళ్ళెను....
ఏ మధురోదక స్రవంతి
నీ దప్పిక వెదుకుతుంది ?
ఏ నిశ్చలకాంతి కొరకు
ఈ కోనల గవేషణము !....
నిద్రావివశ ధ్వాంతము—
చెదరిజారు గుబులు మతము....
నీలరుచిర స్వప్నతలము
అందరాని వర్ణపటము....
ఖండిత గళభీతనాద
మాక్రోశించె దైన్యము !
తుది రోదన మురలించే
ప్రాణోత్క్రమణ విషాదము....
విలయస్వర వికలమహతి
నిహితశూన్య నిశ్వాసము....
నిశాధూమ పటలిభాతి
తిమిర భారతీ స్వనమ్ము....

దళిత మానవానీకము
మది మనలే ఆలోచన –
నిదుర తెరల కదలజార్చు
మతవాదుల వ్యూహరచన....
పూలగుత్తులై మురిసే
ప్రజల యెదల విషమునింపి
భ్రాతృహంతలైవురికే
వృకజాలముగా మార్చెను !
ఎవడాతడు – పరమనీచ
విద్వేషోత్సవ పిశాచి ?
సుహృజ్జనత రుచిరగీత
మాహరించు దశకంఠుడు !
పంచనదుల పరీవాహ
భూతల ప్రాణోత్సాహము
అతకరించు విషకుక్షుడు
ఎవడాతడు మతోన్మాది ?
విషతిక్త కషాయ కంఠ
రాక్షస ఘీంకారావము
కలనాదముగా భ్రమించు
భ్రష్టత ఎట్లావహించె ?
హాలాహల సదృశమైన
ఆయుధయూధాల నింపి
అమృత జల సరోవరము
కలుషిత మొనరించె నెవడు ?
స్వర్ణమంది రాంతరముల
సుందర ప్రశాంతి చెరచి
రోగ క్రిమికీటకాల
కాలవాల మొనరించెను ?
మానవతా పురోగతికి
ఇది విషాగ్ని కీలసుమా !
సౌమనస్య జీవితమున
కిది విఘాత చర్య సుమా !
పావన సింధూ తోయము
కళవళపడి కలతచెందె....
పరిదేవన తరంగాళి
కలవరించె కనుమన్నా !

( గ త సం చి క త రు వా యి )

పతంజలి మమూలు వైద్యుడు కాదని అతను తొందరగానే గ్రహించాడు. యోగికి ఆయుర్వేద వైద్యం గురించీ ఆ వైద్యుల గురించీ ఎక్కువతెలియకపోయినా ఎలుకలనీ, చెవులపిల్లుల్నీ బోనుల్లో ఉంచి- వాటిచేత మందులు తినిపించడమూ, వాటివివరాలూ, వృత్తాంతాలూ జాగ్రత్తగా పుస్తకాలలో వ్రాయడమూ- ఇవి ఆయుర్వేద వైద్యులుచేసే పనికాదని అతనికి తెలుసు. తన గురువుగారలా ఎందుకు చేస్తున్నారో.... ఎలుకలు చెవులపిల్లులూ యీ సంతతంతా ఎందుకో అడగాలనీ అతనికి ఆత్రంగా ఉండేది. కాని అతనికి సాహసం చాలేదికాదు. పతంజలి సుభావంగా వుండేవాడు. ముక్తసరిగా అవసరానికి మించి అక్షరం ముక్కకూడ అదనంగా మాట్లాడడు. ఎప్పుడూ ఏవో ఆలోచనలలో తేలుతున్నట్లు...మరోలోకంలో ఉన్నట్లుంటాడు. ఐతే అతను మందులుతయారుచేస్తున్నప్పుడు సరుకుల విషయంలోకాని తూకాల విషయంలో కాని తయారీలో కాని కక్కుర్తిపడడు. అశ్రద్ధ చూపడు. సువర్ణం కలిసే వసంతకుసుమాకరమూ, సిద్ధమకరధ్వజమూ వంటి మందులకు పతంజలికి అప్పటికే చాలా పేరు వొచ్చింది అతను కోరకపోయినా కుప్పలుగా ధనమూ వొచ్చిపడుతూంది. పతంజలి ధనవంతుడే కాదలచుకుంటే ఔషధాలుచాలు. కాని గురువుగారికాధ్యాస ఉన్నట్లే కనపడదు. ఎంతసేపూ కుక్కలూ, పిల్లులూ.... ఎలుకలూ- వాటికి మందులివ్వడం, కూర్చోబెట్టి మేపడమూ. అదేంవెర్రో? అందుకే కాబోలంటారు, ఎవరివెర్రి వారికానందమని. పిధిగదులు రెండూ దాటి పెరట్లోకివస్తే అదోచిన్న పశువైద్యశాల. పాకలలో బోనులు, వాటిలో రకరకాల జంతువులు. అవో వింతసంత. ఆ జంతువుల గోలేతప్ప- మనుషులూ మందులూ ఎక్కువ పట్టవా మహానుభావుడికి. ఇదే మరొకరయితే చేతిలో అంతవిద్యవున్నందుకు ఎంతబాగు పడేవారో ? పోయే ప్రాణాన్నయినా నిలబెట్టగలడు మందువేసి. ఏంలాభం? మనిషిని చూస్తే గెడ్డాలుపెరిగి, వొంటిమీద శ్రద్ధలేక, చిన్నఅంగవస్త్రంతో బిత్తరిలా ఉంటాడు. అదేం మనిషో మంచి వయసులో ఉన్నాడు. ఐనా-స్త్రీ అక్కరలేదు. ఆ తంపే పట్టనట్లుంటాడు.తీరికదొరికితేచాలు గ్రంధాలు చరకాచార్యుడు వ్రాసిన చరకసంహిత,సుశ్రుతాచార్యునిసుశ్రుతసంహిత, వాగ్భటాచార్యుల అష్టాంగ హృదయసంహిత,మాధవకరుడు విరచించిన మాధవనిదానము, శార్ఙధరుల శార్ఙధర సంహిత, భావమిశ్రుని భావప్రకాశ, తరచుగా అవి తిరగేస్తూంటాడు. మాటలలో నాగార్జుననీ,చక్రపాణిదత్తుడినీ ఉదహరిస్తూంటాడు. వృద్ధత్రయమట, లఘుత్రయమట ఏమిటో చెబుతాడు. కొన్ని కొన్ని విచిత్రాలుకూడా చెబుతాడు ఆరోగ్యానికి సంబంధించినవి. అవి నమ్మశక్యంగా ఉండవు.

ఒకసారి తాము వాహ్యాళికి వెళ్తూండగా తోవలో ఒక గోవు ప్రసవించింది. అప్పుడే పుట్టినలేగదూడను తల్లి ఆత్రంగా నాకుతూంటే- నోరూరుకోక అన్నాడు యోగి. "చూడండి గురూజీ! మాతృప్రేమ ఎంత ఘనమైనవో! మనుషులకే కాదు., పశుపక్ష్యాదులకున్నూ మమతా బంధాలు బలమైనవే. ఏమంటారు ?"—

పతంజలి నవ్వారు. "మాతృప్రేమ సృష్టియావత్తూ నిండిఉన్న మాట నిజమేకాని- ఆ గోవు వత్సను నాకడం తల్లిప్రేమకు సూచనగా మాత్రమే కాదు."

"మరి ? బిడ్డ శరీరాన్ని పరిశుభ్రం చేయడానికా?" కొంచెం కంగుతిని అడిగాడు.

"ఊహుఁ."అన్నాడు పతంజలి అడ్డంగా తలఊపుతూ.

"ఐతే ఎందుకు?" సూటిగా అడిగాడు.

"ఆ గోమాత అప్పడే ప్రసవించిన వత్సాన్ని అలా నాకకపోతే అది సరిగాలేచి నిలబడడమూ, నడవడమూ చెయ్యలేదు. అలా నాకడం వలన ఆ దూడ తాలూకు విసర్జకావయవాలూ, జననేంద్రియాలూ సక్రమంగా పని చేస్తాయి."

యోగికి సందేహం కలిగింది. గురువుగారు చెబుతున్నది నిజమేనాఅని. కాని...చెప్పింది ఆయన కనుక నమ్మకతప్పలేదు. పతంజలి వైద్యంకూడా ఒక్కొక్కప్పుడు చాలా తమాషాగా ఉంటుంది.

"విపరీతంగా భేదులు (విరేచనాలు) ఔతున్నాయి." అంటూ వొచ్చాడొక రోగి తాలూకు బంధువు. పతంజలి ఒకసారతని ముఖంలోకి చూసి- "మీ యింట్లో యినుప గరిటె ఉందా ?" అని అడిగాడు పరిహాసాని కన్నట్లు.

"ఊఁ" అన్నాడు తను సిగ్గు పడుతూ.

"ఇనుప గరిటెను ఎర్రగా కాల్చు..." అని ఆగాడు.

వాతలవైద్యం కాదుకద అనుకున్నాడు- జాగ్రత్తగా వింటున్న యోగి.

"తియ్యగా తోడు పెట్టిన ఆవు పెరుగుని చిలికిన మజ్జిగలో- కాలిన యినుపగరిటెను ముంచు. మజ్జిగ పోపు పెడతారే అలాగ., తరువాత ఆ మజ్జిగను తాగించు. భేదులు కట్టేస్తాయి."

అతను వెళ్లిపోయాడు పతంజలికి నమస్కరించి. మళ్లీమర్నాడు వొచ్చి పండూ ఫలమూ సమర్పించుకున్నాడు కృతజ్ఞతా సూచకంగా. ఇలాంటి చిట్కావైద్యాలు చెబుతారు. తరువాత- జీవితాంతమూ ఉపకరించే కొన్ని సంగతులు విశదం చేస్తారు. అవి-పైకి ఎంత తేలికగా

కనిపిస్తాయో, క్రమంతప్పకుండా ఆచరించడం అంత కష్టం. "ఎవర యితే సూర్యోదయకాలమునం దెనిమిది దోసెలులు పరిశుభ్రమయిన జలం త్రాగుతారో వారు రోగములు, ముసలితనము లేకుండ నూరు సంవత్సరములు సంపూర్ణముగ బ్రతుకగలరనిభావప్రకాశలో చెప్పారు" అంటూ తాను చదివినవి చెబుతారు.

మొత్తానికి పతంజలి సమక్షంలో యోగికి కాలం సుఖంగానే వెళ్లిపోతూంది. ఐతే గురువుగారి పద్ధతులేమిటో మాత్రం అతనికెంత ఆలోచించినా అంతుపట్టడంలేదు.మనుషులకి వైద్యం చేస్తూ జంతువులని పెంచడమూ వాటి మీద ప్రయోగాలు చేయడమూ ఏమిటో? అద్భుత మయిన రోగ నిదానంతోపాటు స్వయంగా మందులు తయారు చేసి యిస్తూండడంతో ఆయనకి మంచి పేరుండి.నోరు విడచి అడగకపోయినా డబ్బుతెగవొస్తూండ.పతంజలి దేన్నీ పట్టించు కోనట్లుంటాడు కానీ డబ్బుని మాత్రం బాగానే జాగ్రత్తచేస్తాడు. పైసాపైసా కూడా కూడబెడతాడు. ఈ డబ్బంతా ఏం చేస్తాడో మరిగె ఎవరూలేని ఒంటరివాడు.

"గురూజీ! ఆయువుండేతప్ప చికిత్సవలన ప్రయోజనం శూన్య మని మీరే అంటూంటారు కదా, మరి ఆయుష్మంతుడికి చికిత్సతో నిమిత్తమేముంది?" అడిగాడు యోగి.

"ఆయువున్నప్పుడు చికిత్సవలన బాధ తొలగును. ఆయుష్మం తుడికి ఔషధసేవలేనిచో ఆరోగ్యముగా లేచి తిరుగలేడు.." అంటూ చరకుణ్ని ఉదహరించేవాడు సంస్కృత శ్లోకాలు చదువుతూ.

"ఆయుర్వేదం యింత ప్రతిభ కలదైనప్పుడు దీనికెందుకు తగిన ప్రాశస్త్యమూ,ప్రాచుర్యమూ లభించడంలేదు? ఎక్కడ చూసినా ఇంగ్లీషు డాక్టర్లూ,ఇంగ్లీషు మందులే కనబడతాయే.మనదేశంలోకూడా?"

పతంజలి ఓ నిట్టూర్పువిడిచి చెప్పసాగాడు.

"ఆయుర్వేద విధానం కొన్ని నియమనిష్ఠలకు లోనై వుంటుంది. చికిత్సకుడు (వైద్యుడు) రోగి-భైషజ్యము (ఔషధము) కూడా కొన్ని నియమాలకులోబడి ఉండాలి. దీనికి మంత్రశాస్త్రమూ,తంత్ర శాస్త్రమూ సహాయకారులుగా ఉంటాయి. వైద్యుడికివి కొంచెం తెలియాలి. ఓషధి మంచిప్రదేశములోపుట్టినది, శుభఘడియలలో పెల్లగించబడినది, గంధము, వర్ణము, రసము మొదలగు స్వలక్షణములతో కూడినదీ అయివుండాలి. ఔషధం వినియోగించడానికి కూడా కాలనియమములు పాటించాలి వ్యాధిని నివారించు వైద్యుడు సచ్ఛీలుడూ, సుగుణములు కలవాడూ, అయిఉండాలి. ఓషధులను, నుంచిమనస్సుతో శుచియై శుభదినమున ప్రాతఃకాలమున సూర్యునకభిముఖుడై హృదయమున ఈశ్వరుని ధ్యానించి గ్రహించవలెను. చూర్ణములు,లేహములు,ఆసవ.... ములు,తైలములు, ఘృతములు వీటిని శ్రద్ధతో తయారుచేయవలెను.వీని వినియోగమునకు కూడా కాలపరిమితిని గమనించవలెను. తరువాత ఆయుర్వేదవైద్యుడు ధనాపేక్షకు లోనుగాక మానవ సేవయే మాధవ సేవ యనురీతిలో చికిత్సను గావించవలెను".

"మరి - వైద్యుడు బ్రతికేదెలా? చేతిచమురు భాగోతం ఎన్నాళ్ళని?"

"రోగి సంతోషంగా యిచ్చేది స్వీకరించవచ్చును. ధనవంతుల యిన రోగులనుంచి అధికముగా పొందవచ్చును. ఐతే-రోగిని చూడ గానే వైద్యునికి చికిత్సావిధానమూ, రోగనిదానములేతప్ప ధనము గురించి ఆలోచనలు కలుగ కూడదు".

వసంత కుసుమాకరమూ, స్వర్ణసూర్యావర్తివంటి ఔషధము లలో బంగారం ఉపయోగిస్తారు. అవి చాలా ఖరీదయిన మందులు. అటువంటివి ఉచితంగా ఇవ్వడమంటే కొరివితో తలగోక్కోడమే. రోగి మందువాడేసి వొట్టిచేతులు చూపెడితే?

అతని అనుమానాన్ని తెలుసుకున్నట్లే అన్నాడు పతంజలి. అటువంటివాని పుణ్యమంతా వైద్యుణ్ని చేరుకుంటుంది. వైద్యంవల్ల చేకూరేది ధనమొక్కటే అని భావించకూడదు. పుణ్యం, అనుభవం, జ్ఞానం వంటివికూడా లభిస్తూంటాయి".

ఆ సమాధానం యోగికేమీ రుచించలేదు. చేదుమింగిన వాడిలా ముఖం పెట్టాడు. అతని దృష్టిలో విశేషంగాధనాన్ని సంపాదించలేని

విద్యకాని,కళకానీ మరేదికానీ శుష్కదండుగ. ధనమూల మిదం జగత్ అని కూడా ఏవేదంలోనో చెప్పబడే ఉంటుంది.

యోగికి ఒకవిధంగా కాలం సుఖంగానే గడుస్తూంది. గురువుగారు చెప్పేపనులు చేయడం,ఉదయం మడిగా,శుచిగా యింతవండి పడెయ్యడం,బజారుపనులు చేయడం,మందుల తయారీ, చీకూచింతాలేకుండా వెళ్ళిపోతూంద కాలం. మనసుకి శాంతిగా ఉంటూంది. మెదడు మాత్రం పనేమీ ఉండడంలేదు.

ఆ వేళ బజారునుంచి వొస్తూంటే తోవలో స్వస్థత చెందిన రోగి కనిపించి- ఈ రెండు వందలూ ఆ మహానుభావులకి నా ప్రాణదాత కందచేయండి'' అంటూ రెండు వందల రూపాయలిచ్చాడు ఎక్కడా కుదరని రోగమతనిది. నిరాశతో చావుకి రోజులు లెక్క పెడుతూ పతంజలి వద్దకు వచ్చాడతను. పథ్యాలూ అవీ సరిగాచేశాడు కాబోలు గురువుగారి మందు వెంటనే పట్టిచ్చి గుణం కనిపించింది. ఏమయినా అతనికి వాడిన మందుల కతనిచ్చినది చాలా ఎక్కువే.

ఉత్సాహంగా యింటిమెట్లెక్కాడుయోగి. చీకటిపడి చాలా సేపూ ఆవేళ పౌర్ణమికావడంతో వెన్నెల పుచ్చపువ్వులా కాస్తూంది పతంజలి ముందు గదులలోలేడు. యోగి పెరట్లోకివెళ్ళాడు. పెరడంటే విశాలమయిన జాగా. దానిలో పాకలు.ఆ పాకలలో బోనులలో వివిధ రకాల జంతువులు. అక్కడున్నాడు పతంజలి. అతనిముఖంనిండా ఆనందం. యోగిని చూస్తూనే పిలిచాడు రమ్మని.

''యోగీ! ఇవాళ శుభదినం. ఈబోనులతో, జంతువులతో యిక మనకి పనిలేదు. వీటిని మనం ఊరవతలికి తీసుకెళ్ళి వదిలి వెయ్యాలి. చిన్నతోవుకు బండిని పిలుచుకొస్తావా?''

అలాగే అంటూ వెళ్ళి తీసుకువచ్చాడు. ఇద్దరూ ఊరవతలికి బయలు దేరారు బోనులని బండివాడిచేత బండికెక్కించి. అక్కడ వెన్నెల. చిన్న అడవిలాంటి ప్రదేశంఅది. పతంజలి ఒక్కొక్క బోనునే ఎలుకలనీ, చెవులపిల్లుల్నీ బయటకు వొదిలేశాడు ఆనందంగా.

''కాళీ బోనులేంచేద్దాం?''అడిగాడుయోగి. ''బండివాడి కిచ్చెయ్. ఇకమనకి వీటితో పనిలేదు జంతువులని బంధించి ఉంచనక్కరలేదు. ''ఒక్కసారి అతని ముఖంలోకి ఎంతో సంతోషం వచ్చింది.'' మనకి తొలివిజయం లభించింది.

''ఏమిటి గురూజీ? నాకర్థం కావడంలేదు''.

''మనం మృత్యువుని గెలుస్తాం ''

''మృత్యువుని గెలవడమా!'' నమ్మలేనట్లు చూశాడు.

''ఈ చిన్న జంతువులు తమజీవిత కాలానికిరెట్టింపు బ్రతికాయి. ప్రయోగం సఫలమైంది. మందులు పనిచేశాయి. తప్పకుండా మనిషి ఆయువునికూడా కనీసం రెట్టింపుచేసే ఔషధాన్ని- మృత్యుం జయన కనిపెట్టి తీరగలను. సందేహంలేదు. మృత్యువుని జయించి తీరుతాను మనిషిని చిరంజీవిని చేస్తాను.'' ఉత్సాహంగా, ఉద్రేకంగా అన్నాడు పతంజలి.

యోగికి విషయం అర్థమైంది. ఒక్కసారతను ఆశ్చర్య పట్టలేకపోయాడు. మృత్యువుని జయించడం, మనిషిని చిరంజీవి చేయడం.... నిజంగా సాధ్యమేనా ? ఈ పిచ్చి బ్రాహ్మడు వెర్రి పడుతున్నాడా? ఏమో చెప్పలేం. అతను వైద్యంలోదిట్ట. ఏ మందేనా కనిపెట్టినా కనిపెట్టవచ్చు.

యోగిని వెనుక రమ్మని పతంజలి వెళ్ళిపోయాడు. యోగి ఊరిలోకి నడిచాడు. ఊరు కలకలలాడుతోంది. అతని మనసులో కోరికలు రాసాగాయి జేబులో డబ్బుఉండడంతో. అతని దేహం చాల కాలం అనంతరం స్త్రీ స్పర్శకోసం కాగిపోతూంది. వేగిపోసాగింది స్త్రీపరిష్వంగనం కోసం తహ తహ మొదలయిందతనిలో, చిన్నవిందు అనంతరం స్త్రీసుఖం అనుభవించాలన్న ఆత్రతతో అతనుమరేమీ ఆలోచించకుండా హోటలు మెట్లెక్కాడు. స్వీటు, కారపుబూంది తినేసరికి జిహ్వ లేచొచ్చినట్లనిపించింది. కాఫీ మీదకు మనసు పోయింది. కాఫీ తాగుతూంటే-భుజం మీదచెయ్యిపడిందెవరిదో. యోగి అటు చూశాడు.

''మీరా!'' ఆశ్చర్యపోయాడు.

''మీరిక్కడ తేలారేం?''

''అదో పెద్ద విషాద గాధ''

''నాకు పనికొచ్చేదేమయినా ఉందా?'' నవ్వుతూనే అడిగాడు అతను యోగి పక్కనకూర్చుని కాఫీఆర్డరుచేసి. ఒకక్షణం మౌనంగా ఉండి-అంతలోనే తన మెదడులో ఏదో మెరుపు మెరిసినట్లయి ''ఉంది!'' అన్నాడు యోగి.

''నిజం?''

''ఆఁ ''

''ఐతే-పదండి. ఎక్కడికేనా వెళ్ళి మాట్లాడుకుందాం''.యోగి చెయ్యందుకున్నాడతను.

''ముందు నేను స్త్రీ దగ్గరకు వెళ్ళిరావాలి. లేకపోతే శరీరం స్వాధీనంలోకి వొచ్చేటట్లు లేదు. వొంట్లో వేడి,తపన...కోరిక దహించుకు తినేస్తూంది. సిగ్గువిడచి చెప్పాడు యోగి.

''నేను హోటల్లో ఉంటున్నాను. నా గదిలో మంచి అమ్మాయి ఉంది'', నవ్వాడతను.

"ఐతే త్వరగావద. నేనింకా సానివాడకి పోవాలనుకుంటున్నాను" ఉరికాడు యోగి.

రాబర్ట్ దారితీశాడు.

యోగి ఆ క్షణాలలో సర్వమూ మరచిపోయాడు. అతని ఆలో ఆలోచనలూ, కోరికలూ కొత్తపుంతలు తొక్కుతున్నాయి. అది-అసహజ మేమీకాదు. ముప్ఫయ్యేళ్ళయినా నిండని అతను మగువకు దూరంగా ఉండడమే అసహజం నిజానికి. అతనికిమళ్ళీ స్త్రీమీదా, సంసారంమీదా విపరీతమయిన వాంఛ కలుగుతోంది. కోరిక- హద్దుమీరిన కోరిక మనిషిని వివేకరహితుణ్ని చేసి వొదులుతుంది- న్యాయంగానే.

కోరిక తీరిన అనంతరం తేలికపడిన శరీరం, తేలిపోతున్న మనసు. యోగి రాబర్ట్‌తో అన్నాడు-

"మా గురువుగారు మృత్యువుని జయించే మందు కనిపెట్టడానికి పట్టుదలగా ప్రయత్నిస్తున్నారు. కొంతవరకూసఫలం అయ్యారుకూడా."

వివరాలన్నీ యోగి నోటివెంట వినేవరకూ వదల్లేదు రాబర్ట్. యోగి కూడా అతనిచ్చిన మందరూపాయలు తీసుకుని తెలిసినవీ తెలి యనివీ చాలా చెప్పాడు. రాబర్ట్ సి. ఐ. ఏ. ఏజెంట్. యోగికి పూర్వాశ్రమంలో మిత్రుడు.

## 9

నాగరికతా విజ్ఞానమూ వివిధముఖాలుగా వృద్ధిచెందిన యీ రోజులలో ఏదేశానికయినా దాదాపు అసాధ్యమయిన విషయం. తన దేశ రహస్యాలను కాపాడుకోడం. ప్రతిదేశంలోనూ ప్రతి యితర దేశపు గూఢచారులూ ఉన్నారన్నా, ఏదేశంలో అయినా ఆ దేశస్థులు కొందరు యితర దేశాలకు గూఢచారులుగా పనిచేస్తూ దేశద్రోహు లౌతుంటా రనీ అంటే అదిఎంతమాత్రమూ అబద్ధమూకాదు. అందుకే ప్రతిపౌరుడూ దృఢంగా ఉంటేతప్ప దేశంయొక్క రహస్యాలు కాపాడ బడడం అసాధ్యం ఇంటిదొంగను ఈశ్వరుడేనా పట్టలేడుకదా?

ఆర్థిక సమస్యలు, మరొకవిధమయిన బాధ పీడనుంచి తప్పించు కుందుకు తారకమంత్రంలా కనిపిస్తుంది. రహస్యసమాచారం చేర వేయడం. విదేశ గూఢచారులిటువంటి బలహీనులను అతిసులభంగా గుర్తించి వలవిసురుతారు. చిన్నచిన్న కానుకలిస్తూ, పెద్దిపెద్ద ఆశలు, చూపుతూ, తియ్యనిమాటలు చెబుతూ వారిని వలలోకి లాగుతారు వారు పనిచేసే చోటునుంచి తమకు మంచి సమాచారం లభిస్తుందంటే. విదేశీ వస్తువులు, డబ్బు వీటిప్రలోభంలోపడిన ఆ చేపలు తమ దేశపుగుట్టును రట్టు చేయడానికి కొంచెమయినా సందేహించవు. పెద్ద ఆఫీసర్లు చిన్న వాటిని నియమించినట్లు విదేశీ గూఢచారులు. ఆ దేశం వారినే ఒకరి మీద ఒకరిని నియమిస్తూ ముఖ్యసమాచారాన్ని సేకరిస్తారు తాము ఎక్కువ శ్రమపడకుండా. రహస్యాలను ముందుగా తెలుసుకోవడం వల్ల ఆ యాదేశాలకనేక ఉపయోగాలుంటాయి. రహస్యాలను వెల్లడి చేసే దేశద్రోహులు సాధారణంగా ఒంటరితనంతో బాధించబడు తూంటారు. ఏవో సమస్యలతో సతమతమౌతూ సమాజంనుంచి దూరంగా ఉంటారు. అటువంటివారిని గుర్తించడం విదేశీ గూఢచారులకి వెన్నతో పెట్టిన విద్య.

దేశద్రోహులను గుర్తించడం చాలా కష్టమయిన పనేమీకాదు. వాళ్ళజీవితాలు కొంత భిన్నంగా ఉంటూంటాయి. జీవితానికి మించిన స్థాయిలో బ్రతుకుతూంటారు వాళ్లు. అవసరం మేరకు తప్ప యితరు లతో కలవరు.

యోగి-ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్యతో నరకం అనుభ విస్తున్నాడు. ఆమె కోరరాని కోర్కెలు కోరుతూంది. ఆ కోర్కెలు తీర్చకపోతే అతన్ని దగ్గరకు రానివ్వటంలేదు. యువకుడయిన మగ వాడికంతకంటె దుర్భరనరకం ఏంకావాలి? అతనను భవిస్తున్న హింస అంతా అతని ముఖంలో కనపడుతూంటే రాబర్ట్ అతన్ని తనకి పనికి వచ్చేవాడిగా సులభంగానే గుర్తించిపట్టాడు. రాబర్టేమీ అమెరికన్ కాడు. అమాటకొస్తే అతనాదేశంలో ఒక్కసారయినా అడుగు పెట్టలేదు. క్రిష్టియానిటీ వ్యాప్తికోసం భారతదేశంవచ్చి యిక్కడ వున్న స్వల్ప కాలంలో ఓ హరిజన స్త్రీతో తమ కామవాంఛ తీర్చుకున్నందుకు ఫలితంగా జన్మించినవాడు రాబర్ట్. ఆంగ్లోఇండియన్. అతను సి.ఐ.ఏకి పనిచేస్తూంటాడు. యోగిలాంటివారిని ముఖ్యమయిన ప్రభుత్వశాఖల నుంచి పట్టడమూ, రహస్యాలను సేకరించి తనపైవాడికి అందించి డబ్బు చేసుకోవడమూ. యోగి పనిచేసేది గుమాస్తాయే అయినా ఆ శాఖకి ప్రాముఖ్యత ఉంది. గుమాస్తాగాకూడా అతనికి కొన్ని ప్రధానమయిన ఫైళ్ళు అందుబాటులో ఉంటాయి. అతనూ ఆఫీసువాడే కనుక. వాటిని వినియోగించుకునే యోగి కొంచెంకాలం పబ్బం గడుపుకున్నాడు. అతనూ ఏజంట్ అనిపించుకున్నాడు.

భారత దేశంలో సి. ఐ. ఏ. ఏజంట్లూ, కె. జి. బి. ఏజంట్లూ అధికం. ఇతరదేశాల గూఢచారుల శాఖఁకిక్కడ పెద్దగా పేరులేదు. యోగి మీద రాబర్ట్ లాటి వాళ్లు... ఆపైన స్వామిలో మూర్తులో... వారిపైన జాన్ లేదా ఫ్రెడరిక్ యిలా అంచెలంచెలుగా ఉంటాయి. వారి అంతస్తులు.

విదేశీ మద్యం సేవించి అందమయిన అమ్మాయితోగడిపి. అర్ధ రాత్రి దాటిన చాలా సేపటికిల్లు చేరాడు యోగి. దొంగలాగ తనవరండా లోకి వెళ్ళిపడుతున్నాడు. మర్నాటినుంచీ పతంజలి అక్కడి నుంచి మకాం ఎత్తేసే ప్రయత్నాలు ప్రారంభించాడు.

"ఎక్కడికి పోదాం గురూజీ?" అడిగాడు యోగి.

"పాడేరు, చింతపల్లి" ఇంకా నిర్ణయించుకోలేదు."

"ఇక్కడ మనకి సుఖంగానే ఉందిగా?"

నవ్వి ఊరకున్నాడు పతంజలి. యోగికి విజయ నగరంలాటి బస్తీవొదిలి అడవుల్లోకి వెళ్లడం ఎంతమాత్రమూ యిష్టంలేదు. వారానికి పదిరోజులకి బాధించే యౌవనాన్ని తృప్తిపరిచేందుకు విజయనగరం లాటి చోట్ల అయితే వెలకు అందాలని అద్దెకిచ్చే అమ్మాయిలు దొరుకుతారు. అడవులలో ఎలా ? భార్య లేకపోయినా తనకి మనసు చెడిపోవడం లేదంటే కారణం - వెలయాలులే.

"ఏమిటో గురూజీ !...మీ హృదయం మరీలోతు-" నిష్ఠూరంగా అన్నాడు యోగి పతంజలి తననింకా పూర్తిగా విశ్వసించడం లేదన్నట్లు. విజయనగరం నుంచి ఎక్కడికి వెళ్ళేదీ సాధ్యమయినంత ముందుగా తెలుసుకుని రాబర్ట్‌కి తెలియజేయాలని అతని ఆశ. రా పతంజలి విషయం శ్రద్ధగా పరిశీలిస్తూండమని యోగికి గట్టిగా చెప్పా మనిషి మృత్యువుని జయించడ మనేది అసంభవమని ఒక పక్క అనిపిస్తున్నా- మళ్ళీ మరోపక్క ఒకవేళ సాధిస్తాడేమో అనీ, అ అయితే ఆ వార్త తనకే ముందుగా తెలియాలనీ పట్టుదలా... ఆధారంగా ప్రణాళికలు.

పతంజలి ఏమీ అనలేదు. మౌనంగా ఉండిపోయాడు. సామానంతా అమ్మేసి డబ్బుగామార్చుకొని కొంచెం సామానుతో మాత్ర బస్సెక్కి చింతపల్లి వద్ద దిగేవరకూగూడా ఏమీ ముందుగా తెలియ యోగికి. చింతపల్లిలో ఆ రాత్రి విశ్రాంతి తీసుకని మర్నాడు ఉదయ అడవి అంచున ప్రయాణం చేశారు.

(ఇంకా ఉంది

# కవి

## శ్రీ ఏల్చూరి విజయరాఘవరావు

కాలమానం
లోకగతుల
మార్పించునటు !...
కాలమానమె
మార్చ
కదలివస్తున్నాను.

సృష్టిలో
అణువునై
సృజియింప బడితినటు !....
సృష్టికె
పునఃసృష్టి
సూత్రాలు వ్రాస్తాను.

ప్రభువులంటక
తుప్పు పట్టి
తంత్రులు తెగిన
ప్రజల హృదయ విపంచి
పలికించి వేస్తాను.

రథగజపదాతులే
రచ్చ గెలువని పోరు
కలము పోటుల
పరిష్కార మొనరిస్తాను.

అజ్ఞాన జీమూత
లలముకొన్న జగాన
విజ్ఞానచంద్రికలు
వెదజల్లిపోతాను.

కాలమానం
లోకగతుల
మార్పించునటు !....
కాలమానమె
మార్చ
కదలివస్తున్నాను.

శ్రీ ఏటుకూరి బలరామమూర్తి

# స్థానిక చరిత్రల ప్రాధాన్యత

శాస్త్రీయ చారిత్రక పరిశోధన రెండువిధాల సాగుతుంది. విహంగ న్యాయంగా జరిగే స్థూల పరిశీలన ఒకటి. ప్రత్యేక పరిస్థితులు, ప్రాంతాలు, సమస్యలపై లోతుగా జరిపే సూక్ష్మ పరిశీలన మరొకటి.

ప్రపంచ చరిత్ర గమనంలో దేశ చరిత్రల పరిణామం అంతర్భాగం. దేశచరిత్ర పరిణామంపై ఆధారపడి ప్రాంతీయ, రాష్ట్రీయ చరిత్రలు అందుకు లోబడే స్థానిక చరిత్ర వుంటుంది. ఈ చారిత్రకదృష్టి లేనట్లయితే ఏదేశచరిత్ర ఆ దేశస్థులకు, ఏ ప్రాంతీయ చరిత్ర ఆ ప్రాంతీయులకు విలక్షణమైనట్లు, విశిష్టమైనట్లు తోచి ఆత్మోత్కర్షకు కారణమవుతుంది శాస్త్రీయ అవగాహనకు తోడ్పడదు.

సాధారణ చారిత్రక గమన సూత్రాలకు లోబడినప్పటికీ, ప్రతి దేశానికి, ప్రతి ప్రాంతానికీ అనేక ప్రత్యేకతలు, విశిష్టతలు వున్నమాట నిజం. వీటిని విస్మరిస్తే చరిత్ర అంతా నిర్జీవమైన పునశ్చరణ పర్వం ఔతుంది. వాస్తవంలో అలాలేదు. సాధారణ సూత్రాలకు లోబడిన ప్రత్యేకతలు, ప్రత్యేక విశిష్టలక్షణాలనుండి ఆవిర్భవించే సాధారణ సూత్రాలు - ఈ రెండింటి పరస్పర సంబంధం దృష్ట్యా చరిత్ర పరిశోధన సాగవలసి వుంటుంది.

ప్రాంతీయ చరిత్రల విషయంలోనే ఈ సూత్రం ఇంతగా వర్తించినప్పుడు స్థానిక చరిత్రల విషయంలో ఇది ఎంతగా వర్తిస్తుందో ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

ఆంధ్రదేశానికి సంబంధించి స్థానిక చరిత్రల పరిశోధనకు, మెకంజీ మూలపురుషుడని చెప్పవచ్చు. 1788 - 94 సంవత్సరాల మధ్య మద్రాసు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో సర్వే ఉద్యోగం నిర్వహించిన మెకంజీ స్థానిక పండితుల సహకారంతో వేలాది స్థానిక చరిత్రలను నమోదు చేయించారు. ఒక్క తెలుగులోనే సుమారు 1355 గ్రామ కైఫీయతులను రాయించి భద్రపరచారు. ఈ మహాకృషిలో మెకంజీకి తోడ్పడిన తెలుగు పండితులు, కావలి వెంకట బొర్రయ్య, లక్ష్మయ్య, రామస్వామి సోదరులు పరిశోధకులందరికీ, చిరస్మరణీయులు. 1809 లో మద్రాసు రాష్ట్ర సర్వేయర్ జనరల్‌గా పనిచేసిన మెకంజీ 1821 లో మరణించారు. మూలపురుషునిగా మెకంజీకివ్వవలసిన గౌరవ విషయంలో భిన్నాభిప్రాయం లేకపోయినా శాస్త్రీయ చరిత్ర పరిశోధనకు ఈ కైఫీయతులు ఎంతవరకు తోడ్పడుతాయి అనే విషయాన్ని నిరావేశంగా చర్చించవలసి వుంటుంది.

1820 నాటికి భారతదేశ చరిత్ర రచనలో యింకా ఓనమాలు మొదలు కాలేదు. భారతీయులకు క్రమబద్ధమైన చరిత్ర లేనేలేదు. ఎంతకూ విదేశీయులకు బానిసలుగా పడివుండటమే భారతీయులకు అలవాటైన చరిత్ర అని సామ్రాజ్యవాద చరిత్రవాదులొకవంకరాస్తుండేవారు.

తద్విరుద్ధంగా, అష్టాదశపురాణాలు, సాక్షాత్తు ప్రాచీన చరిత్ర పత్రాలే ఐనట్లు సాంప్రదాయ పండితులు ఘోషిస్తుండేవారు. ఆవేశ పూరితమూ, ఆత్మాశ్రయ ప్రధానము ఐన ఆ కోలాహలంలో, శాస్త్రీయ చారిత్రక పరిశోధనా శిశువు ఎలా ఆవిర్భవించగలదు, దేశ చరిత్ర విషయమే అలా వుంటే స్థానిక చరిత్ర విషయం చెప్పనక్కర లేదు. ప్రతి స్థల పురాణము స్థానిక చరిత్రగానే ఎంచబడుతూండేది.

స్థానిక చరిత్రలుగా చెప్పబడే స్థలపురాణాలను పరిశీలిస్తే దాదాపు ప్రతిగ్రామము. మహాభారతకాలం నుండి కొన సాగుతూనే వుంటుంది. ప్రతి గ్రామంలోనూ పాతబడినగుడి స్వయం భూలింగమే. పాండవులు దాదాపు ప్రతిగ్రామంలోనూ ఎప్పుడో అడుగుపెట్టేవుంటారు. శ్రీరాముడు గోదావరిని భద్రాచలం వద్ద దాటాడని ఆంధ్రులంటే, నాసికవద్ద అని మహారాష్ట్రులంటారు. లంక, కిష్కింధలు ఎన్నయినా లభిస్తాయి

మెకంజీ కైఫీయతుల రచన యిలాగే సాగినది. ప్రతి కైఫీయతులోను ఈ క్రింది విభజన వుంది. గ్రామ విశిష్టత, కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలో గ్రామప్రశస్తి క్షేత్ర మహాత్మ్యం, పరీక్షిత్తు, జనమేజయ పాలన, దేవాలయాలు, జనమేజయుని తరువాత రాజ్య పరంపర, గ్రామ వర్ణన, ఆయకట్టు విస్తీర్ణం, అయ్యగార్ల వివరాలు. భట వృత్తిమాన్యం, జాతికూటమాన్యం, రెడ్డి, కరణం, మిరాసి. గిరి, కులకర్ణి—

ఈ విభజనలో సగభాగం స్థల పురాణం, స్థానిక చరిత్రకు తోడ్పడకపోగా, ప్రాచీన చరిత్రకు వక్రీకరణను కల్గిస్తుంది.

ఆంధ్రదేశంలో గ్రామ జీవితం శాతవాహనులతో, క్రీస్తు పూర్వం 200 - క్రీస్తు శకము 200ల కాలంలో మొదలైంది; మహా

భారత యుద్ధకాలము నాటికి భారతదేశంలో హెచ్చు ప్రాంతం అరణ్య ప్రాంతం. ఆంధ్రులు ఆనాడు యమునా తీరంలో వుండేవారు. కొత్త రాతియుగం. పాతరాతియుగం నాగరికతలు ఆంధ్రదేశంలో వికసించిన మాట నిజమే. హరప్పా, మొహంజుదారో నాగరికతా చిహ్నాలు కూడా వున్నవని చెప్పవచ్చు.

కాగా ఆనాటి తెగల ఆవాసాలకు, నేటి గ్రామాలకు మధ్య ఎన్నో సామాజిక భూకంపాలు జరిగాయి. శాతవాహనుల కాలంనుండి క్రమబద్ధమైన వ్యవసాయ విస్తరణ, సుస్థిరమైన గ్రామ జీవితం ప్రారంభమైంది. ఆ తరువాత కూడా చాళుక్య, చోళ, పల్లవ ఘర్షణల లోనూ, వీరశైవ, జైన మారణ హోమంలోనూ గ్రామజీవితం పదేపదే విధ్వంసం అవుతూ వచ్చింది. ఆంధ్రదేశంలోని ఎంతటి ప్రాచీన గ్రామమైనా కాకతీయులకు పూర్వపుది మిగిలివున్నదని చెప్పలేము. బౌద్ధ, జైన, దేవాలయాలు మిగిలి వుండవచ్చు. దీనిలోనూ మిగిలిన వానికంటే నశించినవే హెచ్చు. పాత పునాదిపైనే కొత్త గ్రామాలేర్పడ్డాయి. ఇలా ఏర్పడ్డ సందర్భాలలో కొత్త కులాలు, మతాలు, వ్యవసాయ సంబంధాలు ఏర్పడుతూ వచ్చాయి.

కాకతీయ యుగానికి పూర్వం కమ్మ, వెలమ, రెడ్డి - విభజన లేదు. బ్రాహ్మణులలో వైదికి, నియోగి, తదితరమైన శాఖావిభజన లేదు. ఎంతసేపటికీ చాళుక్య, చోళ, హైహయలాంటి రాజ వంశాల పేర్లే కనిపిస్తాయి. రాజవంశాలన్నీ అంతరించాయి. కమ్మ, వెలమ, రెడ్డి, కాపు అని వ్యవసాయదారులలో కొత్తవిభజన ఏర్పడ్డది. బ్రాహ్మణులతోపాటు అన్ని కులాలలో ఈ శాఖాబేధాలు ఏర్పడడం ఆంధ్ర దేశానికి సంబంధించినంతవరకు నేటి గ్రామ జీవితానికి పునాది అని తోస్తోంది. ఈ మహాపరిణామం, ఈ సామాజిక పరివర్తన, ఏ రాజకీయ, ఆర్థిక, మత, సాంఘిక శక్తుల ప్రోద్బలంతో జరిగిందో పరిశోధకులు లోతుగా అధ్యయనం చేయవలసి వుంటుంది. మన స్థానిక చరిత్రల పునాది అక్కడ లభిస్తుంది.

మెకంజీ కైఫీయతులలోని ఆరు అంశాలు గ్రామవర్ణన,అయకట్టు అయ్యాగార్ల వివరణ, భటవృత్తి మాన్యం, రెడ్డి, కరణం యితా దుల ప్రస్తావన నిజమైన స్థానిక చరిత్రకు ప్రాతిపదిక. కైఫీయతుల రచన సాగిన పద్ధతిని పరిశీలించడం అవసరం. కావలి బొర్రయ్య - సోదరులు మెకంజీ పనుపున గ్రామాలకు వెళ్లి కరణం, పురోహితుడు, పూజారి మొదలగు గ్రామముఖ్యులను కలుసుకొని ప్రాచీన గాధలను జ్ఞాపకాలను, ప్రాచీన పత్రాలు లభిస్తే వాటినీ, దేవాలయాల్లో శాసనాలుంటే వాటినీ ఆధారంగా చేసుకొని కైఫీయతులు తయారు చేశారు. ఆ పరిస్థితులలో అంతకంటే మరోమార్గం లేదు. ఈ సమాచార సేకరణకు వారు ఎన్ని కష్టాలకు, యిబ్బందులకు గురైనారో మనం ఊహించుకోవచ్చు.

వీరికి సమాచారం అందించిన గ్రామ ముఖ్యులు- కరణం, పురోహితుడు యిత్యాదులు. సహజంగానే గ్రామప్రశస్తిని వీలైనంత హెచ్చుగా పెంచే పద్ధతిలోనే సమాచారం చెప్పిఉంటారు. ప్రశస్తి అనే మాటలో ఆ అర్థం వుంది. ఇందుకు వారిని నిందించనక్కరలేదు. వారి పరిమితి అది. మనం ఆ సమాచారాన్ని నూటికి నూరు పాళ్ళు విశ్వసించరాదనీ, అతిశయోక్తులు తొలగించవలెనని, ఆ బాధ్యత ఆధునిక పరిశోధకునిది అని చెప్పడం మాత్రమే ప్రస్తుతాంశం.

స్థానిక చరిత్ర పరిశోధకులు కేంద్రీకరించవలసిన అంశాలు రెండున్నాయని నేనుభావిస్తున్నాను. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ స్వరూపం వివిధ ప్రాంతాలలో ఎలా ఉండేది, అనేది ఒక అంశం. గ్రామీణ సామాజిక జీవితం, పైకి స్థబ్దుగా ఉన్నట్లు కనిపించినా, లోలోపలనే ఎలా మారుతూ వచ్చిందనేది రెండో అంశం.

అశోకుని కాలంలో, స్వయం సంపూర్ణ గ్రామ వ్యవస్థ భారత దేశంలో మొదలైంది. గుప్తరాజుల కాలంలో మండలాధిపతులు స్థానిక పరిపాలకులు కేంద్ర ప్రభుత్వాన్ని కాదని స్వతంత్రులు కాసాగారు. భూమిపై హక్కు రైతుది అని కొన్ని ధర్మశాస్త్రాలు, కాదు రాజు భూమిపై సర్వహక్కులు కలిగి ఉన్నాడని మరికొన్ని పేర్కొంటూ వచ్చాయి. ధర్మశాస్త్రాలు, సిద్ధాంత ప్రతిపాదనలు మాత్రమే చేశాయి. ఆచరణలో ఆయా రాజుల చిత్తవృత్తి, ప్రజల కట్టుబాట్లు, మంత్రుల సలహాలు, ఇంకా అనేక రాజకీయ సైనిక, ఆర్థిక మత పరమైన కారణాల వలన, భూమిపై రైతుకు ఎంతహక్కున్నది, గ్రామ పంచాయితి అజమాయిషీ అధికారం ఎంత రాజు అధికారం ఎంత అనే అంశం నిర్ణయింపబడుతూ వచ్చింది. రైతు, పంచాయితీ, రాజు, ఈ ముగ్గురి మధ్య ఈ సమస్యపై నిరంతర ఘర్షణ జరుగుతూ వచ్చింది.

రైతుకు తన భూమి అమ్ముకునే హక్కు ఉన్నట్లు, అనగా భూమి రైతు స్వంత ఆస్తి అని నిరూపించే ఆధారాలు కాకతీయుల కాలంనుండి కనిపిస్తున్నాయి. రెడ్డిరాజుల కాలంలో మరీ విస్తారంగా ఉన్నాయి. పన్ను చెల్లించలేక శ్రీనాథుని వంటి పండితకవి భూమి కోల్పోయినాడు. కీ.శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్‌లో" ఈ అంశాన్ని వివరంగా చర్చించారు.

ఆ పిమ్మట వచ్చిన ముస్లిముల పరిపాలనలో అనేక మార్పులు జరిగాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన నాటికి దేశంలో విస్తారమైన రాజకీయ కల్లోలాలు, నిరంతర యుద్ధాలు జరుగుతూ ఉండేవి. స్థానిక పరిపాలకుల నిరంకుశత్వం కరువుకాటకాల మూలంగా

ప్రజలు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి ఒక్కొక్కప్పుడు యితర భాషారాష్ట్రాలకు వలస వెళ్లుతుండేవారు. రైతుల హక్కులు క్షీణించాయి.

కృష్ణదేవరాయల కాలంలో విశ్వనాథనాయకుని నాయకత్వాన వేలు, బహుశా లక్షలసంఖ్యలో తెలుగు సైనికులు తంజావూరు,మధుర ప్రాంతాలకు వెళ్ళి అక్కడ కర్షక కుటుంబాలుగా మారిపోయారు. అంతకుపూర్వం ఆ ప్రాంతాలలో రైతులు కలిగిఉన్న హక్కుల కంటె వీరు నిస్సందేహంగా గ్రామ ఆర్థికజీవితంలో హెచ్చు హక్కులు పొందిఉంటారు. ఏమంటే వీరు విజేతలు కనుక ఈ వివరాలు తెలుసుకోవాలంటే స్థానిక చరిత్రల అధ్యయనం ఏకైకమార్గం.

తంజావూరు రాజ్యం మహారాష్ట్రవశమైన తరువాత ఈ తెలుగు వ్యవసాయదారులలో చాలామంది తిరిగి ఆంధ్రదేశం వచ్చారు. కృష్ణా గుంటూరు, నెల్లూరు, విశాఖ, కర్నూలు, కడప దాదాపు ఆంధ్రప్రదేశ మంతటా ఈ కుటుంబాలు ఉన్నాయి. ఈ రెండవ వలసవారు విజేతలుగా గాక దాదాపు నిరాధారులుగా వచ్చారు. సహజంగానే గ్రామ ఆర్థిక జీవితాలలో తగుస్థానం పుంజుకోవటానికి వారికి చాలాకాలం పట్టింది.

గుప్తరాజుల కాలంనుండి బ్రాహ్మణులకు సర్వంకర అగ్రహారాలిచ్చే పద్ధతి ప్రారంభమైంది. ప్రభుత్వ అధికారులు సైతం అగ్రహార గ్రామాలలోకి అధికార దర్పంతోగాక,అణుకువతో అడుగు పెట్టేవారు. కాని చాళుక్య, చోళ ఘర్షణలు, తెలుగు చోడుల పరిపాలనా కాలంలో ఈ పద్ధతులు మారాయి. బ్రాహ్మణాగ్రహారికుల అధికారాలు తగ్గాయి.

కన్నడ దేశంలో వీరశైవ ఉద్యమం అంత తీవ్రంగా వ్యాపించ డానికి ఒక ఆర్థిక కారణం ఉన్నట్లు పరిశోధకులు చెపుతున్నారు. అక్కడ బ్రాహ్మణాగ్రహారికులు చాలామంది మతరీత్యా జైనులు. అగ్రహారికుల దోపిడీకి తట్టుకోలేని క్రిందికులాలవారంతా వీరశైవులైనారు.



జైన, శైవమత ఘర్షణలు, హత్యాకాండ వెనుక అగ్రహారందార్లకు రైతులకూ గల ఆర్థిక ఘర్షణ ఒక ప్రాతిపదిక.

ఆంధ్రదేశంలో కూడ ఈ పరిణామం కొంతవరకైనా జరిగిందా? తెలంగాణాప్రాంతంలో జైన, వీరశైవ ఘర్షణలు తీవ్రంగా సాగాయి. తెలుగు చోడుల పరిపాలనలో మల్లికార్జున పండితారాధ్యునికి బౌద్ధులకు జరిగిన వివాదాలు, బౌద్ధులపై హత్యాకాండ, పల్నాటి యుద్ధంలో శైవ వైష్ణవ ఘర్షణ ఇత్యాదులన్నీ ఇందుకు ఉదాహరణలు. కాకతీయుల పాలన ఆంధ్రదేశంలో విస్తరించే సమయానికి గ్రామీణఆర్థిక వ్యవస్థలో గుణాత్మక మార్పు వచ్చినట్లు తోస్తుంది. రాజుల, అగ్రహారికుల అధికారాలు తగ్గి కమ్మ, వెలమ, రెడ్డి వంటి వ్యవసాయదారుల కులాలు ఆవిర్భవించి సామాజికంగానే కాక ఆర్థికంగా కూడ నిలదొక్కుకొని, గ్రామ జీవితాలలో ప్రధాన స్థానం వహించసాగాయి.

ఈ వ్యవస్థ ముస్లిముల కాలానికి బలహీనపడి కంపెనీకాలానికి ఛిన్నాభిన్నమైనది. రాయలసీమ జిల్లాలో పూర్తిగాను, కోస్తాజిల్లాలో పాక్షికంగానూ, రైత్వారీ సెటిల్‌మెంట్ ప్రవేశపెట్టేనాటికి గ్రామాలలో రైతుల ఆర్థిక పరిస్థితి అత్యంత దీనావస్థలో ఉండేది. ఈ పరిణామం తెలుసుకోవటం స్థానిక చరిత్రకారులది.

ఈ కాలంలోనే సామాజిక మార్పులు వచ్చాయి. కాకతీయ, చోళ, చాళుక్య నామధేయాలు అంతరించి కమ్మ, వెలమ, రెడ్డి, కాపు కులాలు ఏర్పడటం చిన్నవిషయమేమీకాదు. ఏ కులానికి ఆ కులం తమ గొప్పలు చెప్పుకొన్నా, ఈ వ్యవసాయదారుల కులాలన్నీ ఒకే కుదురు నుండి ఏర్పడినట్లు పేర్లనుబట్టి స్పష్టంగా తెలుస్తుంది. కొన్ని జిల్లాలలో నాయుడంటే కమ్మవారు, కొన్ని జిల్లాలలో కాపులు. గృహ నామధేయాలలోనే రెడ్డిపేరుగల - వాసిరెడ్డి, కొమ్మారెడ్డి, తమ్మారెడ్డి లాంటి కుటుంబాలు కమ్మవారు. తెలంగాణాలో కొండారంగారెడ్డి గారుంటే, గుంటూరులో కొండా వెంకటప్పయ్యగారున్నారు. రావివారు అన్నికులాలలోనున్నారు. తెలంగాణాలో రావి నారాయణరెడ్డిగారుంటే కృష్ణాజిల్లాలో రావివారు కమ్మవారు, బ్రాహ్మణులు మొదలుకొని హరిజనులు వరకు ఒకే గృహనామధేయం వుండటం, ఇలాంటి కుటుంబాలు ఆంధ్రాలో అన్ని ప్రాంతాల్లోనూ వ్యాపించి ఉండటం ఏమి తెలియ చేస్తుంది ? వీరందరు ఒకే ప్రాంతంనుండి వివిధ ప్రాంతాలకు విస్తరించి వుండవచ్చు. లేక వేరు వేరు ప్రాంతాలలో ఒకే పేర్లువుండి వుండవచ్చు. ఒకప్పుడు అందరూ ఒకే కులము వారయివుండవచ్చు. పై కులాలవారు క్రిందికి, క్రింది కులాలవారు పైకి మారివుండవచ్చు. ఈ అంశాలను ఏ కులమువారు తమకు తామై అంగీకరించరు. తాము ఒకప్పుడు పేదవారిగా వుండి క్రమేణా ధనికులమైనామని అంగీకరించ డానికి వెనుకాడనివారు కూడా తమ పూర్వీకులు ఒక కులంనుండి

మరొక కులానికి క్రిందకో, పైకో జరిగారని అంగీకరించడం కష్టం. కులాభిమానం, కుటుంబాభిమానం, అందుకు అడ్డు వస్తుంది. కానీ చరిత్రకారులు ఈ దురభిప్రాయాలకు అతీతంగా పరిశీలించగలిగి వుండాలి.

చాళుక్యుల కాలంలో బోయ బ్రాహ్మణులుండేవారని చిలుకూరు వీరభద్రరావుగారు వ్రాశారు. వారిపుడేమయినారు ? వైదీకి, నియోగి లాంటి అగ్రవర్ణాలుగా పైకి ఎగబ్రాకి వుండవచ్చు. విశ్వబ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణ కులాలుగా మారివుండవచ్చు. ఒకప్పుడు, వైదీకి నియోగి కుటుంబాలుగా వున్నవారు నిరాధారులై కొత్తప్రాంతాలకు వెళ్లి కొత్తవృత్తులు నేర్చుకుని విశ్వబ్రాహ్మణులుగా మారివుండకూడదా ? కందుకూరి రుద్రకవి నెల్లూరుకు చెందిన విశ్వబ్రాహ్మణుడు. అక్కడి నుండి గోదావరి జిల్లాకు వలసవచ్చిన కందుకూరివారు నియోగి బ్రాహ్మణులైనారు. ఒకే గృహనామధేయులు ఉభయులూ వుండవచ్చు. విశ్వబ్రాహ్మణ కుటుంబాలు దూరప్రాంతాలకు వెళ్లి వృత్తిమాని చదువులు చదువుకొని బ్రాహ్మణులుగా, నియోగులుగా మారివుండకూడదా? ఉభయులూ శైవులే. శైవంలో, కనీసం ప్రారంభంలో కులభేదాలు తక్కువ. కుల మార్పిడి హెచ్చు. వీరశైవం కలిగించిన పరోక్ష ప్రయోజనాలలో ఇది ఒకటి. విశ్వబ్రాహ్మణులకు, బ్రాహ్మణులతో పాటు రాజులు అగ్రహారాలిచ్చిన ఉదంతాలు అనేకం ఉన్నాయి

జానపద గాథలు, గేయాలు, స్థానిక చరిత్రకు ముఖ్యసాధనాలలో ఒకటి. మనది నేటికి భూస్వామ్య సమాజం. కుల, వర్ణ ప్రాతిపదికపై ఆధిక్యత, న్యూనతాభావాలు ఈ నాటికీ వున్నాయి. మధ్య యుగాలలో మరింతగా వున్నాయని చెప్పనక్కరలేదు. మాల, మాదిక, కమ్మరి, కుమ్మరి, చాకలి లాంటి చేతివృత్తులవారు, ఎరుకల, యానాది లాంటి అర్ధ సంచారకులు అసలు చరిత్రలోకే ఎక్కరు. స్త్రీల పరిస్థితి సరేసరి. అగ్రకులాలనుండి నిమ్న వర్గాలవరకు స్త్రీల పరాధీనత తమ తమ స్థాయిలలో వుంటూనే వుంటుంది.

ఈ బాధలు ఏ శాసనాలలోనూ, ప్రశస్థులలోనూ వ్యక్తంకావు. కొంతవరకు జానపద గేయాలలోనూ, సామెతలలోనూ వ్యక్తం అవుతుంటాయి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా వుంటాయి.

బహుముఖాలయిన ఈ పరిశోధనా పద్ధతిద్వారా ముందుకు సాగితే స్థానిక చరిత్ర కేవలం అగ్రవర్ణాల వర్గాల చరిత్రకాక సానిక ప్రజా చరిత్రగా రూపొందగలదు.

# వర్షాకాలం గడిచింది

హిందీ మూలం:

## శ్రీ కీర్తి నారాయణ మిశ్రా

తెలుగు సేత:

## శ్రీ చేబోలు శేషగిరిరావు

తూర్పునుంచి పైరుగాలి
కదలాడింది గదిలో
తుంపరలు
సొలసిన కనురెప్పలను ముద్దాడాయి
ఎన్నెన్నో గతస్మృతి పుటలు తిరగబడ్డాయి
చీకటిలో
తెరిచిన కిటికీలోంచి
కనబడుతున్న
ఆ మబ్బుల రసమయ జగతి
నాకెంత గానో నచ్చింది.
జ్ఞాపకాల దొంతరలపై
సాగరం విరుచుకు బడ్డా
మనస్సు మాత్రం మూతపడే వుంది
సౌందర్య తటాకం గట్లు తెగుతున్నా
కోరికల సమాధినుండి
జ్వాల ప్రజ్వలిస్తూనే వుంది.
వర్షాకాలం మాత్రం గడచిపోయింది....!
వెలుగు రేఖలను వెదజల్లలేని
ఎముకల విహీనంగా
మాంసపు ముద్దగా తయారైంది.
అంధకార బంధురమైన ఈ ప్రయాణంలో
పూర్తిగా
అశక్తులమై పోయాం!

# ముసలాడు

## వి.వి.బి. రామారావు




"అబ్బాయ్!... ఒరేయ్ అబ్బాయ్! .... సుందూ...
[ఒరే]య్ సుందూ ...."

ముసలాయన పిలిచి పిలిచి అలిసిపోయాడు. గొంతు ఎండి[పో]యింది.... నాలుక పిడచకట్టుకుపోయింది... దాహం ... పిలవడానికి [కూ]డా ఇక శక్తి లేదు.... నీరసం ముంచుకొచ్చింది.

గోడ వైపునుంచి ఇటువైపుకు ఒత్తిగిల్లడానికే ఒంట్లో [ఉన్న] గోరు బలం ఖర్చయిపోయింది.

నుదుటన చిరుచెమట.

మళ్ళీ కాసేపు కళ్ళు మూసుకుని ఒంట్లో శక్తినంతటినీ [కూ]డగట్టుకొని మరొక్కసారి పిలిచాడు ముసలాయన.

"... ఒరేయ్... సుందూ!"

మేడమీదకి పిలుపు అందలేదు. క్రిందపిలుపు అందుకోబడలేదు.

ముసలాయన కళ్ళు మూతబడ్డాయి.

పక్క తడిసిపోయింది. కింద ఒట్టి... ఈగలు... వాసన... [ఏ]వేవీ ఆయనకు తెలియడంలేదు. మగత... నీరసం... చెరుపు-[మ]రుపు.

"శేఖరం! శేఖరం!"

వీధి తలుపుదగ్గర ఎవరో పిలుస్తున్నారు.

జేరగిలా పెట్టిన తలుపులు తోసుకుని ఆయన లోపలికొచ్చాడు.

"శేఖరం!"

ముక్కుపుటాలకు సోకిన వాసనవల్లనేమో గోడవార నున్న నులకమంచం మీదకు ఆయన దృష్టి మళ్ళింది.

"ఒరేయ్! శేఖీ.... శేఖిగా..."

ఆయన ముసలాయనను తట్టి లేపాడు.

"ఆఁ!..."

ముసలాయనకు కొద్దిగా తెలివి వచ్చింది.

ఇది ఉదయమా, మధ్యాహ్నమా? సంధ్యవేళా? అసురసంధ్య వేళా? మీదకు చూశాడాయన. లైటు వెలగడంలేదు.

"ఒరేయ్! శేఖిగా... నేన్రా రామాన్ని... నన్ను గుర్తు పట్టావా?"

"రామంవా?... ఓ! రామంగాడివా! రా, రా!" ముసలాయన లేచే ప్రయత్నం చేశాడు.

కాని ఆయన శరీరం - ఎప్పుడో ఆయన మాట వినడం మానేసింది. కాళ్ళూ, చేతులూ చచ్చుపడిపోయాయి....

"ఏం మిత్రా ఇలా అయిపోయావ్! ఇంట్లో ఎవరూ లేరా? పిల్లలు...?" రామం గారడిగారు.

"పిల్లలు! పిల్లలు! ఓ.... పిల్లలా— సరే— ఎవరున్నారు... చిన్నాడు మేడమీదున్నాడు— నువ్వే చూడు—"

రామంగారికి మరి అక్కడ ఉండబుద్ధికాలేదు తెలియని ఇల్లు కాదు. కాని ఇంత బోసిగా— ఈ కంపు బాధ పడలేక అద్దెలవాళ్ళూ ఖాళీ చేసేశారా?

మేడమీద మధ్యగది తలుపులు జేరవేసి ఉన్నాయి.

"అబ్బాయ్!" తలుపు తోశాడాయన.

పేకాట మంచి జోరులో ఉంది.

"ఎవరు వచ్చార్రా!" ఒకతనికి కొంచెం తెలివి వచ్చింది. రామంగారు ముందుకు సాగారు.

"అబ్బాయ్! ఎలాగయితేనేం వెదుక్కొని వచ్చానోయ్! నాకూ ఓ చెయ్యి పంచండి. రౌండు ఎక్కడవుతుంది. స్టేక్ ఎంత?" - ఒక దగ్గర కూలబడ్డాడు గదిలో జొరబడ్డ మనిషి.

"కాదుసార్! ఆట అయిపోవచ్చింది, మేం లేచిపోదామనుకుంటున్నాం."

ఆరుగురిలో ఒకతను అన్నాడు.

"మా మంచిమాట చెప్పావ్! ఇదెక్కడి ఘోరమయ్యా!

ఇల్లు వెదుక్కుంటూ ఇంత దూరం వచ్చాను. ఆడదామని సరదాపడుతుంటే మానేస్తా రంటారేమిటి? వెధవతిండి రోజూ తినేదే కాస్త టిఫిన్ తెప్పించుకుందాం, మరొక్క రెండు రౌండ్లు ఆడి లేచిపోదాం."

"క్షమించాలి మీరు" ఒకతను అడిగాడు.

"నేనెవరినైతేనేం— పేకాట దగ్గరా, బుద్ధి దగ్గరా అంతా సమానమే. ముక్క తియ్యవోయ్ బాబూ!"

పేకాడుతున్న సుందరానికి కడుపులో ఏదో వికారం మొదలైంది. ఎవరీయన ?

"క్షమించండి. పెద్దివాళ్ళు"

"నాబొంద పెద్దరికమేమిటి, ఆమధ్య పక్షవాతం వచ్చింది... కాలు ఈడుస్తూ నడుస్తాను— కానయితేనేం మనసు మాత్రం పండి పోయిందబ్బాయ్!"

"మీరు— మీరు— నాన్నగారి—"

"ఆc! గుర్తొచ్చిందే! నేనూ మీనాన్న, ఇలాగే, ఈఇంట్లో ఈ గదిలోనే ఆడుకునేవాళ్ళం. నేనూ వాడూ, చిన్నప్పటి స్నేహితులం, చదువుకున్న కొద్దిపాటీ కలిసే చదువుకున్నాం. ఇలా మేం పేకాడుకుంటూ ఉండగానే మానాన్న చచ్చిపోయాడు. చచ్చిపోతాడని నాకూ తెలుసు, నేను ఏంచెయ్యలేననీ తెలుసు. చచ్చేమనిషి ప్రాణం ఎగిరిపోకుండా పట్టుకుని వేలాడగలమా పోయేవాళ్ళ కోసం బ్రతికున్న వాళ్ళం - బ్రతకాల్సినవాళ్ళం, మా సరదాలు మానుకుంటామా! పంచుబాబూ! ఇంతకీ స్టేక్ ఎంత చెప్పారేకాదు. నిన్ననే పెన్షన్ వచ్చింది. జేబులో రెండొందలున్నాయ్. అసలు మీ బ్యాంకు ఎంత? ఎనభై అయితే ఫర్వాలేదు తలకిమించి ఆడను. పాతకాలం మనిషిని కదా!"

"షో! బతకడమేమిటి, ఆట అయిపోయింది, పదరవే టచ్ డిక్! వెధవ టచ్చి రెండు రౌండ్లయినా వచ్చిందికాదు! బ్యాడ్‌లక్!" ఒకాయన షో చూపించాడు.

"ఇది పేకాటబాబూ! అవంతే! మా నాన్న పోయాడని కబురొచ్చింది. చేతిలో పేక టచ్ డిక్‌లో ఉంది, ఎలా వదిలెయ్యగలను చెప్పు! పిల్లవాళ్ళు వాళ్ళని కన్నవాళ్ళ ఎడల కృతజ్ఞులై ఉండాలా అని వాదించుకునేవాళ్ళం, మా రోజుల్లో! ఉండనక్కరలేదని నా ఉద్దేశ్యం. అంతే ఆనాడు నేను లేచి నాన్నని చూడడానికి వెళ్ళలే, చచ్చిన మనిషిని చూడడమెందుకు. చూసి చెయ్యగలిగిందేముంది కనక! వేదాంత ధోరణి నాకు ఆ రోజుల్లోనే అలవడిపోయింది. అంతే! అమ్మ మళ్ళీ నా ముఖం చూడలేదు. అయినా అమ్మ అమ్మేలే... చూద్దామనుకున్నా నే కనపడనిస్తేకదా(?) చిన్నవాళ్ళం, ఆ మాత్రం పట్టుదల సహజమేకదా!" ఆయన చెప్పుకుపోతున్నారు.

"ఒరేయ్! సుందరం! మా ఆవిడికి ఇంజక్షన్ కొనితెస్తానని చెప్పా! మరి నే లేస్తున్నా!" డబ్బులు సర్దుకుంటూ లేచిపోయాడో యువకుడు.

"అతను శేఖరం కొడుకు కదూ? ఏనాడో చూశా!" రామంగారు అడిగారు.

"శేఖరంగారి అబ్బాయి అతను కాదండీ!... సుందరం అంటే ఇతను!" మరొకతను సుందరాన్ని చూపించి లేచి నుంచున్నాడు. "ఒరేయ్ సుందరం! ఆఫీసు కెళ్లాలిరా! బాగుండదు!"

వెంటనే వెళ్ళిపోయాడు.

"పోతే పోయారులేవోయ్ సుందరం... ఐదుగురం ఉన్నాం కదా... రెండు పేకలతో ఆడుకోవచ్చు... ఓ పేక ఏరేద్దామా?... ఎక్కువసేపు వద్దులే... ఒక్క రెండు రౌండ్లు..."

రామంగారు ముందుకు వచ్చి చక్రంలో ఇమిడి కూర్చున్నారు.

"సుందరం! నాకు ఒంట్లో నలతగా వుంది... నేపోతున్నా!" మరొకాయన జారుకున్నాడు.

"నలుగురితో ఏం ఆట... నేనూ పోతున్నా... ఇప్పటికే వందిచ్చా!" మరొకతను లేచిపోయాడు.

"అదేమిటబ్బాయిలూ! ముచ్చటపడి నేను ఆటల్లో కూర్చుంటే ఒకరూ ఒకరూ ఏదో వంకపెట్టి వెళ్ళిపోతున్నారేమిటి? పేకాట మేనర్స్ ఇది కాదే. కొత్తచెయ్యి వస్తే ఇలాగేనా?... సుందరం... నువ్ చెప్పవోయ్! చూడండి పిల్లలూ! నేనూ వీళ్ళ నాన్నా ప్రాణస్నేహితులం. కొన్ని వేల రూపాయలూ, కొన్ని సంవత్సరాలూ కలిసి తగలేశాం. ఇద్దరు దంపతుల మనసులు విరిచేశాం... ఇంత వాళ్ళమయ్యాం. పాపం, శేఖిగాడు, వీళ్ళ నాన్న ఇవాళ లేచి ఆడలేడుగాని, వాడితో ఆడకపోతేనే, వాడి కొడుకుతో ఎంచక్కా హాయిగా ఆడుకుందామన్న ఆశతో వచ్చాను. వాడితో చెప్పాగా మరేం వరవాలేదు పంచుబాబూ!"

"మీరెవరు సార్!"

లేచిపోతూ అడిగాడు మరొకాయన.

"ఏం నాయనా నువ్వూ వెళ్ళిపోతున్నావా? పేకాటలో ఎవరూ, ఏమిటి అన్నవి వృధా ప్రశ్నలు. పెళ్లి సంబంధం కోసమైతే కులం, గోత్రం, సాంప్రదాయం ఇవన్నీ తెలుసుకోవాలి. కాని పేకాట కెందుకూ? అడగకూడని ప్రశ్నలు కావనుకో. కాని అనవసరమైన ప్రశ్నలు."

పేకదస్తా చేతిలోకి తీసుకున్నారు రామంగారు.

మారుమాటాడకుండా వెళ్ళిపోయాడు మరో యువకుడు.

"రెండయిపోతోంది! నే పోతున్నా!" మరొకతను లేచాడు.

"ఉండు బాబూ! ముచ్చటగా ముగ్గురం మిగిలాం - ఒక్క ర్యాంకు ఎవరిదిపోతే వాళ్ళు లేచిపోదాం. ఆ తరువాత చెయ్యీ చెయ్యీ ఆడుకోవచ్చు!"

వీడండి శేఖరం గారబ్బాయ్! సుందరంగాడు! మీరు ఎంతో దూరంనుంచి వచ్చినట్టున్నారు. ఎంచక్కా హేండ్ టు హేండ్ ఆడుకోండి! శెలవ్!"

అంతా వెళ్ళిపోయారు. రామంగారూ, సుందరం మిగిలారు గదిలో.

"హేండ్ టు హేండ్ బాగుంటుందబ్బాయ్! సిగరెట్లయిపోయాయి! ఓ పెట్టె తెప్పించుకుంటా..." రామంగారు ముక్కలు పంచుతూ అడిగారు.

"క్షమించండి సార్! మీరు..."

"పోస్లేవోయ్, చెప్పేస్తా! అంతా చెప్పేస్తా... నాపేరు రామం. ప్రజలకయితే రామారావ్ని కాని మీ నాన్నకయితే రామంగాడినే! మా కోడలు పిల్లకి ముసలాడిని. నా భార్యకి పాపం దాని మాటెందుకులే ఈమధ్యనే చచ్చిపోయింది. వెర్రి నాగమ్మ, నేనెంత వెధవనయినా దాని భర్తను కదా - కొట్టినా తిట్టినా నా పంచనే వేలాడి నా పిల్లలందరినీ కని - కర్పూరం కణికెలా హరించిపోయింది. నా పిల్లలంటావా! నా పిల్లలు వాళ్ళు. చిన్నతనంలో నేనూ మీ నాన్నాకూడా ఒకే సిద్ధాంతాన్నీ, నమ్మకాన్నీ నమ్ముకున్న మనుషులం. మనం మన తల్లిదండ్రులకి ఏవిధంగానూ కృతజ్ఞులమై ఉండక్కరలేదని మా విశ్వాసం. వాళ్ళు మనల్ని అడిగి మనని కనలేదు. అలాగే అమ్మా నాన్నా నా కళ్లకి దూరంగానే చచ్చిపోయారు. వాళ్ళకి నేను ఏమీ చెయ్యలేదు. వాళ్ళకి నేను ఏమీ చెయ్యకపోయినతరువాత నాపిల్లలు మాత్రం నాకు ఋణపడి ఉండాలని నేనెలా అనుకోగలను! అనుకుంటే మాత్రం ఇప్పుడది చెల్లుతుందా? నా తండ్రి తలకి కొరివి పెట్టడానికి వెళ్ళని నా తలకి నా కొడుకు మాత్రం ఎందుకు కొరివి పెట్టాలి? పెట్టక్కర్లేదు. పెట్టే ప్రస్తావన రానేరాదని కోడలుపిల్ల తెగేసి చెప్పేసిందికూడా!... ఆ అమ్మాయి చిన్నదయితేనేం, వాదన అద్భుతమనుకో! మంచి సంప్రదాయమైన కుటుంబమని ఏరి కోరి తెచ్చి చేసుకున్నాం. అప్పుడు మా ఇంటిది బతికుంది. కానయితేనేం ఆ పిల్లని అనే హక్కు నాకు లేనేలేదోయ్! అందుకే అనలేదుకూడా! జరిగిన సంగతి ఉన్నది ఉన్నట్టూ చెబుతున్నానులే! ధర్మాన్ని నేను రక్షిస్తేగా అది నన్ను రక్షించడానికి? దాన్ని నేను రక్షించకుండా, పట్టించుకోకుండా, నిర్లక్ష్యం చేసి, ఇప్పుడు అది నన్ను రక్షించలేదనడం సబబుకాదే! పాపం మా అమ్మ శాపం పెట్టాలనికాదు కాని శాపం పెట్టినట్టే అనేది. నేను ఇంటికి వెళ్లినప్పుడు 'ఒరే నాయనా

ఒట్టువేసి తిరగేసినట్టేరా!' అని. అట్టి సంగతి ఆరోజుల్లో నాకు తెలియదనుకో. అట్టి అసలు తిరగబడదని అనుకున్నానేమో! నా తల్లికికాని తండ్రికికాని నేను కొరగాలేదు. నాతండ్రి చచ్చిపోతే లేచి చూడడానికి వెళ్ళలేదు నేను, పేకాటనుంచి. మరి నా కొడుకు కాని నా ముక్కూ మొహమూ ఎరగని నాకోడలుపిల్ల కాని నాకెందుకు చెయ్యాలి? అదేం బాబూ! ఆట మధ్యలో నీ పేకలో పధ్నాలుగో ముక్క కనపడ్డట్టు అలా అయిపోతున్నావేం? చచ్చేవాడు ఎలానూ ఛస్తాడు. ఆట సంగతి ఏదో తేల్చుకునే లేద్దాం..."

రామంగారు ముక్కలు పంచేశారు....కాని సుందరం మాత్రం లేచినుంచున్నాడు.

"చూడబ్బాయ్! నాకూ రెండేళ్ళ క్రిందట పక్షవాతం వచ్చింది. పేకాట ఆడేవాళ్లందరికీ సాధారణంగా వచ్చే జబ్బేనట అది. నేను చచ్చిపోతాననుకున్నారు నా కొడుకులు. అయితేనేం మా స్నేహితుడు సుధాకర్‌గాడు నన్ను చావనిస్తేనా?... ఎక్కడనుంచి ఊడిపడ్డాడో ఎలా ఊడిపడ్డాడో వైర్ వర్కులా దిగివచ్చాడు. "ఒరేయ్ రామంగా! నీ మొహం ఈడచ! కాలూ, చెయ్యి పడిపోయి, నీ కొడుకూ కోడలూ నిన్ను అసహ్యించుకుంటూ ఉంటే ఇలా ఈ మంచం మీద ఈ కొంపలో చచ్చే బదులు, ఇంతకంటె హాయిగా ఉండే నరకంలో పడేస్తా రారా! అంటూ నన్ను ఆస్పత్రిలో పడేశాడు వెధవన్నర వెధవ. వెళ్లిపోతూచూశాను. నా కొడుకు ముఖం, కోడలు ముఖం వెయ్యి క్యాండిల్ బల్బుల్లా మెరిసిపోయాయి. ఆస్పత్రినుంచి అటునుంచి అలాగే స్మశానానికి తీసుకుపోవచ్చనీ! నక్షత్రాలూ అవీ బాగులేక పోయినా కొంప ఖాళీ చెయ్యడం లాంటి ముజ్జిద్దులుండవనీ, ప్రాణం సుఖాన్న పడ్డదనీ మహదానందభరితులైపోయారు."

రామంగారు కొద్దిగా వంకపోయిన చెయ్యివంక చూసుకున్నారు.

"సార్!" సుందరం కళ్ళు మసకమసకలాడుతున్నట్లనిపించింది.

"అదేమిటోయ్ అలా అయిపోతున్నావ్! నిజం చెబుతున్నా, మా పెద్దాడు మాత్రం మహాసంతోషించేడనుకో? ఆస్పత్రి ధనరుకి ఈ ముసలిప్రాణం రెండు మూడు రోజుల కంటె తట్టుకోలేదను కున్నాడు. మహా దర్జాగా దశాహం చేసేద్దామనుకున్నాడు. కాని వెధవ గోల మనవాళ్ళు చెప్పనే చెప్పేశారు "పాపీ చిరాయుః" అని. అసలు నాకు చావాలని లేదుకాని నిజంగా చావాలని ఉన్నా అ సుధాకర్‌గాడు నన్ను చావనిస్తాడా? నర్సులందరికీ వాడి పెత్తల్లి కొడుకుననీ, దిక్కులేని వెధవననీ చెప్పి కంటికి రెప్పలా కాపాడుకోమని రిచ్చాడు. దొంగరాస్కేల్! ఎంతయినా పెద్ద డాక్టరకదా! వ చెబితే వాళ్లు నన్ను చంపలేకపోయారు. పైగా బ్రతికించి బయ గెంటేశారు .."

"ఒరేయ్ సుందూ ... సుందుగా .."

క్రిందనుంచి పిలుపు. కోలాహలం తగ్గిందేమో మేడమీదవర వినపడింది.

క్షమించండి రామంబాబాయ్!" సుందరం గొంతు వణికిం

"అదెందుకబ్బాయ్! అలా డీలా పడిపోయావ్! మా పెద్ద వెధ ఇలాగే 'నాన్నా!' అంటూ నన్ను వాటేసుకున్నాడు. నేను ఆస్పత్రి చచ్చిపోలేదని వాడికితెలీదు. ఎప్పుడు తెలుసుకున్నాడో నాకూ తెలీద ఆస్పత్రినుంచి విడుదలై ట్రాన్స్‌ఫర్ మీద మరో ఊరు వెళ్ళిపోయాన నా కొడుక్కి ఈ మాటచెప్పొద్దని ఆ వెధవ సుధాకరంగాడు నా చెప్పి, నాచేత ఒట్టు వేయించుకున్నాడు. చిన్నతనంలోవేసిన ఒ యాత గట్టుమీద పెట్టేస్తామనుకో... ఒట్టంటే జ్ఞాపకం వచ్చింది. నేన నీవయసులో ఎదురింటి మీనాక్షికి ఓరోజు ఒట్టువేశా! కాని పాపం అ గట్టుమీద పెట్టేసేఒట్టని దానికి తెలియదు. పిల్లకాకికేంతెలుసు ఉండే దెబ్బ! సరేలే ఆకాకి గోలెందుకిప్పుడు. దేనిగురించి చెబుతున్నాను ఒట్టుసంగతి. నేను మావాడికి ఉత్తరం రాయకూడదనిచెప్పి ఉత్తర రాయనని మూడుసార్లు ఒట్టు వేయించుకున్నాడు. అసాధ్యుడు సుధాకరుగాడు. ఇంతవయ సొచ్చినా ఒట్టు తీసి గట్టుమీద పెడితే లోక ఏమంటుంది? లోకంగోల మనకెప్పుడూ పట్టలేదనుకో సుధాకరంగా మంటాడు. నే ఉత్తరం రాయలే. కానీ ఓరోజు మా రెండోవాడూ పెద్దాడూ ఇద్దరూ కట్టకట్టుకుని ఊడిపడ్డారు. "క్షమించునాన్నా"! అం "క్షమించునాన్నా!" అంటూ ఇద్దరూ కళ్ళలో నీళ్ళు తిప్పుకున్నారు పెద్దాడైతే మరీని.... అప్పుడు వాళ్ళతో ఏమనాలో, ఏం మాట్లాడాల ఎలామెలగాలో చెప్పలేదు ఆ సుధాకరుగాడు. అందుకే వెధవలిద్దరి అక్కున చేర్చుకున్నాను. నాకంట్లోనూ నీళ్ళొచ్చాయిలే. "వెధవల్లారా బ్రతికి పోయానని ఏడవకండ్రా మరిఖర్చులేం లేవుగా... మిగిలి పిప్పిపిసరూ మీకే ఇచ్చేస్తాలెండి!"అని ఊరడించాను.ఇద్దరూ భోరుమ ఏడ్చారులే. కోడలు పిల్లలూ రంగప్రవేశం చేశారు. అందంగా ఏడ్చార సినిమాలో కథ చూస్తారుగా.... ఇప్పుడు వాళ్ళదగ్గరే ఉంటున్నా చెరో ఆరునెల్లూ. ఇంతకీ సుందరం మా శేఖిగాడిని ఇక్కడ, ఉ

నిండు ఇంట్లో ఇలాచంపడం కంటె ఆస్పత్రిలో పడేస్తే వాళ్లు పీడు లేవ లేక పక్క ఖరాబు చేస్తుంటే ఓ గంటకి కాకపోతే మరోనాలుగు గంటల కయినా చూస్తారుకదా! వాడ్ని గవర్నమెంటు ఆస్పత్రిలో పడెయ్యకూడదూ! ఆ సుధాకర్‌గాడికి పీడి లాంటివాళ్ళంటే బహు ప్రేమ.... మహా మర్యాద... నీకూ, నీభార్యకీ, నీపిల్లలకీ బాబూ అడగడం మరిచేపోయాను. నీకు పిల్లలా?"

"ఇద్దరు !"

"మరేం, ఫరవాలేదయితే! మరో ముప్పై ఏళ్ళవరకూ బాధలేదు. ఆ తరువాత వాళ్లనిన్ను ఆస్పత్రిలోనే పడేస్తారో, వాళ్ళే ఇల్లుఖాళీచేసి నీ కర్మాన నిన్ను వదిలేస్తారో ఎవరుచెప్పగలరు? ఆ తరంవాళ్ళెలా ఉంటారో, మాతరం వాళ్ళమెలా చెప్పగలం బాబూ రెండు దాటిపోయి నట్టుంది. ఆ సుధాకరంగాడు నాకోసం ఎదురు చూస్తూ ఉంటాడు. ఫరవాలేదులే నాన్న ఆస్పత్రినుంచి తిరిగి రాలేడు. వచ్చినా! ఆ సుధాకర్‌గాడు రానియ్యడుగా. గట్టిగా ఒట్టేయించుకుని మరీ ఆస్పత్రిలో చేర్పుకుంటాడు!"

సుందరానికి అయోమయంగా ఉంది. ఇది నిజమా, కలా? హాస్యమా, తద్విరుద్ధమా?

అంత ముసలాయన కాలు లాగుకుంటూ చకచక మెట్లుదిగి ఈలలాంటి శబ్దంచేస్తూ వెళ్ళిపోయాడు.

సుందరం మేడ దిగి వచ్చేసరికి టాక్సీ తెచ్చేసి ముసలాయన్ని డ్రైవర్ సాయంతో అందులో ఎక్కించేస్తున్నాడు.

"బాబూ! బాబూ! మీరెవరో నాకు తెలియదు. ఆడదాన్ని... నా చేతిలో ఏముంది బాబూ! ... ఆయన తరపున మిమ్మల్ని నేను క్షమాపణ అడుగుతున్నా!"

బయలుదేరుతున్న కారు దగ్గరకొచ్చింది ఇంటికోడలు. ఇంటికి దీపం. ఇల్లాలు.

"చూడుతల్లీ ! ఈ శేఖిగాడు ఇంకా బ్రతికేఉన్నాడు. బ్రతికే ఉంటాడు కొన్నాళ్ళపాటు... కంట తడిపెట్టకు... వాడిని చంపడానికి ఇంకా వ్యవధి కావాలి. మంచి నిద్రవేళ, ఎండవేళ, బయటకు ఎందుకొచ్చావమ్మా ! మరేం అనుకోను అట్టు తిరగబడకుండా చూసుకో!"

కారు ముందుకు కదలబోయింది.

"క్షమించండి రామం బాబాయ్ !" సుందరం ఏదో చెప్పబోయాడు.

"ఏమిట్రా ఇది?" శేఖరం గారికి తెలివి వచ్చింది.

"ఏంలేదు నాన్నా!... నిన్ను బాబాయి ఆస్పత్రికి తీసుకెళుతున్నారు. నాకు కనువిప్పు కలిగించారు. స్నేహితుడు ఆయన్ను రక్షించారు. మిమ్మల్ని ఆయన రక్షించాలనుకుని వచ్చారు. ధర్మం ఆయన్ను కాపాడింది కనుక ఆయన ధర్మాన్ని కాపాడాలనుకుంటున్నారు. బాబూ ! మీరు రామం బాబాయే కాదు, దేవుడు బాబాయ్! నన్ను క్షమించండి! నన్నూ ఆస్పత్రికి రానివ్వండి!" సుందరం కళ్ళనిండా నీళ్ళతో గొంతు బొంగురు పోతుండగా అడిగాడు.

"ధర్మం ఏమిట్రా అబ్బీ ! వీడెవడో తెలుసా ? డాక్టర్ రామనాథమని నా చిన్ననాటి స్నేహితుడు. తల్లిదండ్రులు అంటే విపరీతమైన భక్తి వీడికి."

పోనియ్‌వోయ్!"అంటూ రామంగారు చెప్పారు స్నేహితుడితో "దొంగరాస్కెల్! మనం పేకాట ఫ్రెండ్సమని నేనింతసేపూ వాడ్ని నమ్మించా. నువ్ నోరుమూసుకో ! అబ్బాయ్ ! నాకూ పేకాటంటే ఇష్టమే... ఇప్పటికి ఆడుతా... మీనాన్న మాటలకేం గాని... మనం ఓరోజు కూర్చుని చెయ్యి చెయ్యి ఆడుకుందాం... సరేనా!"

ఆ ముసలాడి ముఖంలోకి చూడ్డానికి సుందరానికి ధైర్యం చాలలేదు... అతని ముఖంలో నెత్తురుచుక్క లేదు.



# పడిగాపులు

డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

రాజకీయ మహామంత్రాలతో
ఆదిశక్తిని అహోరాత్రాలు పూజించి,
మూలవిరాట్ ముఖ్యమంత్రికి మూడు లక్షలు ధూపం వేసి,
(ఆఫ్‌కోర్స్, ఆరులక్షలు సంపాదించాలనే అత్యాశతోనే)
అమ్మవారి పూజారి గవర్నర్‌కు అర్ధశేరు బంగారు పళ్ళెరం బహూకరించి,
జాతి కుల మత ప్రసక్తులతో ఇంద్రజాల మహేంద్రజాలాలు చేసి,
అపూర్వంగా సృష్టించుకున్న విక్రమార్కుడి మార్కు సింహాసనం
ఈ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి !
పాతికవేల లంచం పచ్చగడ్డితో ఎక్స్‌పార్టీ ఎనుముల్ని మేపి
పెద్ద పెద్ద రికమెండేషన్స్ బందాలు వేసి, ఇంటర్వ్యూ తన్నులు తినకుండా
గుట్టుగా పిండుకున్న నిండుగుమ్మపాల తప్పాలా ఇక్కడి ప్రొఫెసర్ పోస్టు
గొంతులో తులసితీర్థం పోయించుకునే వయసు వచ్చినా
మంచి మంచి రాచ సుకన్యల కోసం వేటాడే
అభినవ చ్యవన మహర్షులు మా ఆ (అనా)చార్యులు ప్రాచార్యులు !
జానెడు పొట్టకోసం, ఈ విషవలయంలో
వెధవల దగ్గర వెట్టిచాకిరి చేస్తూ
వాళ్ళ అనుగ్రహం కోసం పడిగాపులు కాస్తూ
అభిమానాన్ని చంపుకొని, ఆత్మబలాన్ని నమ్ముకొని
వెర్రివెంగళప్పలా నేను !
'ముందు దగా, వనుక దగా
కుడియెడమల దగా దగా'
మహాకవీ ! నీ మాట నిజం.
అయినా (దీనిదుంపతెగ !) ఆశ చావడం లేదు.
ఏనాడో ఇక్ష్వాకుల బారసాలనాడు
చక్రవర్తి అశోకుడు చెక్కించిన
'సత్యమేవ జయతే' శిలాక్షరాల్లోకి చూస్తూన్న
నా కళ్ళు కాయలు కాసున్నాయి....
'శనిదేవత రథచక్రపుటిరుసులలో పడి నలిగిన దీనుల' కోసం,
'దగాపడిన తమ్ముల కోసం' ఈ బ్రతుకు పోరులో అణగారిన అభాగ్యుల కోసం
ప్రాణాలు పణంగా పెట్టి
అరణ్యవాసాన్ని వరించిన ఓ అన్నా !
మరి నీ తుపాకి గొట్టంలోంచి భూతలస్వర్గం
నేను బ్రతికుండగా అవతరిస్తుందా ?
ఈ అన్యాయం అంతరిస్తుందా ?




( గ త సం చి క త రు వా యి )

సరస్వతి ఒక్కక్షణం ఆలోచించింది.

"అంటే సత్యమూర్తి పిల్లనుచూచి ఇవాళకు ఒకరోజే అయింది. కాబట్టి ఏ నిర్ణయానికి ఇంకా వచ్చి ఉండడు. నాన్నా ! సత్యమూర్తిని ఒకసారి నన్ను కలియమని చెప్పండి !"

"నీ అభిప్రాయమేమిటి ?'

"నన్ను పెళ్లిచేసుకుంటాడేమోనని అడుగుతాను"

"నిన్నా ? నీకేమైనా పిచ్చి పట్టిందా ? తగు మనిషి నాగ భూషణంగారికి వాళ్లు మాట కూడా ఇచ్చివేశారు. ఈ సంగతి తెలిసి మనం అడ్డుపడడం ఏమీ బాగుండదు."

"బాగో, ఓగో, ! ఒక్కసారి సత్యమూర్తిని రమ్మని కబురు చెప్పండి."

"సరస్వతీ ! ఇది పెద్దమనిషి తరహాగాలేదు. నాగభూషణం క్రింద పనిచేస్తూ, నేను అతనికి ఎదురుగా నిలబడడం చేయరానిపని."

"మీరు ఎందుకు భయపడుతున్నారో నా కర్థం కాలేదు, ఆయన ఇంతకు ముందు నాలుగైదు సంబంధాలు చూచినట్లు విన్నాను. ఆయన దృష్టిలో మరో పదిమంది కూడా ఉండివుంటారు. పాతికవేల రూపాయలంటే కాదనేవాడెవడు ? అందుచేత సత్యమూర్తి సంబంధం తప్పినంత మాత్రాన వారికి కలిగే లోటు ఏమీ ఉండదు. ఈ ముహూర్తానికే డిప్యూటీ కలెక్టరుగారి అల్లుడవడానికి పెళ్లికొడుకులు క్యూలో నిలబడి ఉంటారు"

"ఇది మర్యాదస్తుల లక్షణం కాదు."

"ఈ మర్యాదలన్నీ తరువాత ఆలోచించవచ్చు ఈ కుంటికాలి సత్యనారాయణ కన్న సత్యమూర్తి మేలని మీరు ఒప్పుకుంటారా ?"

"ఒప్పుకుంటే ప్రయోజన మేముంది ? డిప్యూటీ కలెక్టరు గారిస్తానన్నంత కట్నం నేనెక్కడ ఇవ్వగలను. మీ పిన్ని అన్నివిషయాలు నిక్కచ్చిగా చెప్పింది."

"ఏ మంది పిన్ని ?"

"సత్యనారాయణకు తప్ప మరొకడికి నిన్నిచ్చి పెళ్లిచేస్తే ఒక్క పైస కూడా ఇవ్వనంది. కట్నం క్రిందేకాదు, కనీసం పెళ్లిఖర్చులకైనా చేయి దులపనన్నది."

"మంచిదే ! ఆ విషయం కూడా సత్యమూర్తికి చెప్తాను. వాళ్ల పక్కింటి వాళ్లకు టెలిఫోను ఉంది. కాత్యాయని నాకా నెంబరు ఇచ్చింది. ఆదివారం సాయంకాలం సత్యమూర్తి ఎక్కడికి వెళ్లడు. డాబామీద కుర్చీలో కూర్చొని చదువుకుంటూ ఉంటాడు. ఇప్పుడింకా అయిదే అయింది.

ఆనందరావుకు చాలా కోపం వచ్చింది. సరస్వతి తెలివిగా మాట్లాడుతున్నదో, లేక ఆమెకు మతి భ్రమించిందో అతనికి అర్థం కాలేదు.

సరస్వతీ ! నువ్వు చాల వివేకమున్నదానివనుకున్నాను. కాని, ఇదేమిటి తప్పపని ?"

"ఒకజీవి బ్రతకడం కోసం మరొక జీవిని మింగుతుంది. పైకి వెళ్ళేవాడు. పదిమంది భుజాలను తొక్కి వెళ్తాడు. ఇది లోకంలో అమలులోనున్న సర్వసాధారణమైన సాంప్రదాయం కుంటి సత్యనారా

యణ నుండి. పెళ్లికి పైసాకూడా ఇవ్వని పిన్నినుండి ముక్తి పొందా లంటే రెండే మార్గాలు ఉన్నాయి. ఒకటి, సత్యమూర్తిని పెళ్లి చేసు కోవడం, రెండవది ఉరిపోసుకొని చావడం. ఈ రెండింటిలో మీరు ఏది ఒప్పుకుంటే దానినే ఆచరిస్తాను."

ఆనందరావు మరి మాట్లాడలేదు. తొందరగా చొక్కా వేసు కొని, దగ్గరలో నున్న హోటలు నుంచి టెలిఫోనులో మాట్లాడడానికి వెళ్లిపోయాడు.

## 8

"ఇంతవరకు ఇది ఇంట్రడక్షన్ ! అసలు సమస్య గురించి ఇక మాట్లాడుకుందాం !" అంది సరస్వతి.

డాబామీద, చాపమీద సత్యమూర్తి, సరస్వతి దగ్గరగా కూర్చు న్నారు. సరస్వతి చెప్పినట్లే సత్యమూర్తి ఇంట్లో ఉన్నాడు. డాబా మీద కూర్చొని చదువుకుంటున్నాడు. ఆనందరావు టెలిఫోనులో మాట్లాడిన వెంటనే బట్టలు వేసుకొని స్కూటరుమీద వచ్చాడు. అప్పటికి సాయంకాలం ఆరుగంటలయ్యింది. చీకట్లు పడుతున్నవి. డాబా మీద ఆనందరావు, సత్యమూర్తి ఏవో కబుర్లు చెప్పుకుంటుంటే సరస్వతి కాఫీ కలిపి తెచ్చింది. ముగ్గురూ కాఫీ తాగిన తరువాత బజారులో పని ఉందని ఆనందరావు వెళ్ళిపోయాడు. ముందుగనే సరస్వతి తండ్రితో చెప్పింది ఆ విధంగా చేయమని.

అప్పుడు సరస్వతి చెప్పవలసింది చెప్పింది. సవతి తల్లి ఇంట్లో కాలుపెట్టిన దగ్గరనుండి కలిగిన మార్పులు చాలవరకు సత్యమూర్తికి తెలుసు. అతనికి తెలియనిది సత్యనారాయణోపాఖ్యానం. అది పూర్తిగా విన్న తరువాత సత్యమూర్తి నవ్వు పట్టలేకపోయాడు. సత్య మూర్తికి రెండు విషయాలు మాత్రం తెలియవు. ఒకటి రామాచారితో ఎలోక్‌మెంటు ఉదంతం. రెండవది మనోహర్ ప్రణయగాథ. వాటిని చెప్పడానికి కూడా సరస్వతి వెనుదీయలేదు. కాని, ఇది సమయం కాదు. చెప్పవలసివచ్చినప్పుడు తప్పదు.

సరస్వతి అప్పుడు తాను చెప్పవలసిన విషయాల గురించి, తెలుసుకోవలసిన వాటి గురించి, సంభాషణకు ఉపక్రమించింది.

"మూర్తీ ! నిన్నను పెళ్లికూతుర్ని మీరందరూ చూచివచ్చా రని తెలిసింది"

"అవును"

"ఆ అమ్మాయి చదువుకున్నది, సంగీతం తెలిసినది, చక్క నిది అని విన్నాను. ఆ అమ్మాయి మాకు చాల సీనియరు. వుమెన్సు కాలేజిలో చదువుకుంది. మంచి అమ్మాయి"

"నేనూ అలానే విన్నాను"

"అత్తా, మామ, కాత్యాయని, శేఖర్ అందరూ నచ్చారని విన్నాను."

"వాళ్లందరూ నచ్చుకున్నారు"

"త్వరలోనే ముహూర్తం పెట్టించమని కూడా చెప్పారట."

"అవును. అమ్మ ఆ విషయమే చెప్పింది"

"నీ అభిప్రాయమేమిటి ?"

"ఇన్ని తెలుసుకున్న దానిని, ఆ విషయం నీకు తెలియకుండ ఉందా ?"

"ఆ సంగతి నాకు తెలుసు. కాని, నువ్వు చెప్తే వినాలని."

"ఆలోచించి చెప్తానన్నాను."

"నీ ఆలోచన కొనసాగుతున్నదా లేక ముగిసిందా?"

"మునుపే ఒక నిశ్చయానికొచ్చాను. జీవితంలో ఒక నిర్ణ యానికి వచ్చిన తరువాత, దానిని విడిచిపెట్టడం సులువుకాదు. బహుశా మనసు మార్చుకోవడం జరగదు, నా విషయంలో మాత్రం."

"అయితే నేను చెప్పదలచుకునేది ఇక అభ్యంతరం లేకుండా చెప్పవచ్చునా ?"

"వింటున్నాను."

"నాకు ఈ యింటినుండి బయటికి పోవడానికి వివాహ మొక్కటే గౌరవప్రదమైన మార్గంగా కనిపిస్తున్నది. మిగిలినవి చాల దారులున్నాయి. కాని అవి తప్పుదారులు"

"బహుశా ప్రస్తుతమున్న పరిస్థితులలో వివాహమే ఉత్తమమైన మార్గము. నేనూ నీతో అంగీకరిస్తున్నాను."

"నేను వివాహం చేసుకోవాలన్నది నిర్ధారణ అయిన తరువాత ఎవరిని వివాహమాడాలి అన్నది ఇప్పుడు సమస్యగా నిలిచింది. మా నాన్న దృష్టిలో సత్యనారాయణ ఒక్కడే ఉన్నాడు. కాని ఆ సంబంధం నచ్చలేదు. అతని రూప రేఖావిలాసాల గురించి నేను మాట్లా డడం లేదు. నా వంటి నిప్పును అతడు భరించలేడు"

"ఇంకే వరుడైనా నీ దృష్టిలో ఉన్నాడా ?"

"ఇవాళ మధ్యాహ్నం మూడు గంటల వేళవరకు సత్యనారా యణను పెళ్లి చేసుకోపోతే మరి నాకు దారిలేదని మా నాన్న చెప్పే వరకు, నా దృష్టిలో మరే వరుడు లేడు. ఆ సంభాషణలో నీ పెళ్ళి మాటలు దొర్లిన తరువాత నేనొక నిశ్చయానికి వచ్చాను.

"ఏమిటది ?'

"నిన్ను నేను పెళ్లాడడానికి నిశ్చయించుకున్నాను."

సత్యమూర్తి ఆమె ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. ఆమె కన్నుల నుండి జారిన ఒకటి రెండు కన్నీటిబొట్లు, వీధిలైటు వెలుతురులో అతని కళ్ళబడ్డవి. అప్రయత్నంగా తన కుడిచేతితో వాటిని బుగ్గల నుండి తొలగించాడు. సరస్వతి ఏమీ అభ్యంతరం తెలుపలేదు.

"బహుశా ఆ మరో అమ్మాయిని చూచుకునే ముందు, నీ అభిప్రాయం తెలుసుకొని ఉంటే బాగుండేదేమో!"

"నువ్వు నన్ను కోరి అడిగితే, నేను నిరాకరించి ఉందును. ఇది నా స్వభావంలో నున్న ప్రత్యేకత."

"నీ అభిమానం దెబ్బతినడం సహజమే."

"ఇక నీ అభిప్రాయం నాకు తెలుసు. కాని..."

"చెప్పు"

"అన్నివిధాల నిశ్చయమయిన సంబంధం తప్పించడమేకాదు, ముద్దుముచ్చట్లు పిలుపులు ఏమీ ఉండని సంబంధానికి నిన్ను బలవంతం చేయవలసి వస్తున్నది."

సత్యమూర్తి నవ్వాడు.

"ఆ సంగతి నాకు తెలుసు."

"మా పిన్ని, ఆ కుంటి సత్యనారాయణను తప్పించి ఎవరిని నేను వివాహమాడినా ఒక పైస కూడ ఇవ్వనంది. కట్నం మాట దేవుడెరుగు, కనీసం పెళ్ళి ఖర్చులకు కూడా ఏమీ దులపదు."

"దానిగురించి విచారించకు."

"అన్నిటికీ నువ్వే బాధ్యత వహించాలి. ఇది నీకూ నాకూ పెళ్ళి. బహుశా నన్ను పరువుగల దానిని చేయడానికి, ఈ బరువంతా నెత్తికెత్తుకోవలసి వస్తున్నది."

"అవును. ఇది చాల అవసరం కూడా!"

"ఇవి పెళ్ళిముందు షరతులు. పెండ్లి అయిన తరువాత మరికొన్ని పాటించవలసి ఉంది."

"చెప్పు."

"నిజంగా చెప్పాలంటే నువ్వు నాకు సుతరాం ఇష్టం లేదు. కాని, ఈ నరకం నుండి బయటపడడానికి నువ్వే శరణ్యం."

"మంచిది."

"నన్ను వివాహమయిన క్షణం నుండి నీకు నామీద సర్వాధికారాలు సంక్రమిస్తాయి. నా అంగీకారమున్నా లేకపోయినా, నువ్వు నీకు నచ్చిన విధంగా వర్తించవచ్చు. దానికి నేను ఏవిధమైన ఆటంకం, న్యాయశాస్త్ర దృష్ట్యా, చెప్పలేను."

"మరోసారి విశదంగా చెప్పు"

"నా శరీరం మీద నీకు సంపూర్ణమైన అధికారం ఉంటుంది. కాని నా మనస్సు మీద అది పనిచేయదు"

"నాకు సరిగా అర్థం కాలేదు."

"నేను నీకు భార్యనయిన తరువాత నీతో సంసారం చేసి, పిల్లలను పాపలను కనడం ధర్మం— ఇది వివాహం యొక్క ముఖ్యమైన ఉద్దేశం. కాని నా మనసు నీ సంస్కారానికి అంగీకరించడం లేదు. లోకానికి మనం దంపతులమే నిజ జీవితాలలో ఒకే ఇంట్లో, ఒకే గదిలో నివసిస్తున్నా మనసులు కలియని మనుష్యులం."

సత్యమూర్తి ఏమీ ప్రశ్నలు వేయలేదు. ఆలోచిస్తున్నాడు.

సరస్వతికి చాల కష్టమనిపించింది. ఆపదలో తనను ఉద్ధరించ బోయేవాడిని తికమకలు పెట్టి, కష్టసాధ్యమయిన పనులను చేయమనడం ధర్మం కాదనిపించింది. కాని, అతనిని మభ్యపెట్టి, పెండ్లి అయిన తరువాత అతనికి నిరాశ కలిగించడానికి ఆమెకు ఇష్టం లేదు."

"మూర్తీ! ఇవీ నేను చెప్పదలచిన విషయాలు."

సత్యమూర్తి ఏమీ జవాబు చెప్పలేదు.

"ఆలోచించడానికి వ్యవధి కావాలా?"

"ఏమీ అక్కరలేదు."

"షరతులేమేనా నీకూ ఉన్నాయా?"

"ఉన్నాయి."

"చెప్పు."

"పెండ్లి తరువాత మనం లోకానికి దంపతులుగా కనిపించాలి. అంటే, ఇటువంటి పరిస్థితులలో దంపతులుగా నటించాలి. ఒకప్పుడు, నలుగురిలో, అందరు భర్తలకుమల్లే నీతో నేను చనువుగా వ్యవహరించవచ్చు. కోపగించుకోవచ్చు. ఇటువంటివాటిని నువ్వు అంతగా పట్టించుకోకూడదు"

"ప్రయత్నిస్తాను."

"సరస్వతీ! నిన్ను నేను అర్థం చేసుకున్నాను. ఈ చిక్కుల నుండి తప్పించే మేరకే ఇది వివాహం. నేను చాల సంతోషిస్తున్నాను. ఈవిధంగానైనా నీకు ఉపయోగపడితే అదృష్టవంతుడిని."

"ఇందులో అదృష్టానికేముంది. నన్ను కట్టుకున్న మరుక్షణం నుండి కొత్తసమస్యలు మొలకెత్తుతవి."

"సరస్వతీ! మనం భార్యాభర్తలంగా మనలేక పోవచ్చు. కాని ఒకరినొకరిని అర్థంచేసుకొని, మన వ్యక్తిత్వాలను కాపాడుకుంటూ మంచి స్నేహితులుగా జీవించటానికి అభ్యంతరం లేదనుకుంటాను".

"అభ్యంతరంలేదు. ఇంకేమయినా నువ్వు చెప్పవలసినవి ఉన్నాయా?"

"మరేమీ లేవు".

"కాని, నేనొకటి చెప్పాలని అనుకుంటున్నాను. నామనసులోని చీకటి తొలగిపోయే మంచిరోజు వచ్చిననాడు"

"సరస్వతీ! ఆ విషయం ఇప్పుడు అప్రస్తుతమైనది. బహుశా అటువంటి మంచిరోజు రాకపోవచ్చు. అట్టి పరిస్థితిలోకూడా నిన్ను విసర్జించను".

సరస్వతి అతని ముఖంలోకి క్షణం చూచింది.

"మూర్తి! మనం మరేమీ చర్చించవద్దు. మిగిలిన పనులకు నువ్వు తొందర పడవచ్చు".

సత్యమూర్తిలేచి నిలబడ్డాడు. సరస్వతికూడా లేచి నిలబడింది.

సరస్వతి చేతులను, తనచేతిలోకి తీసుకున్నాడు సత్యమూర్తి. ఆమె ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు.

"సరస్వతీ! నీమీద నాకు పరిపూర్ణమైన విశ్వాసం ఉంది. నీ గురించి నేనెప్పుడూ రెండు విధాలుగా ఆలోచించలేదు. నీ జీవితంలో ఏపాటి వెలుగుతోచినా సంతోషమే."

సత్యమూర్తి బయలుదేరాడు ఇంటికిపోవడానికి. సరస్వతి అతని వెనుకనే మెట్లన్నీ దిగివచ్చి, స్కూటరువరకు అతనిని అనుసరించింది. అతను వెళ్ళిపోయిన తరువాత కొండంత ధైర్యం గుండెలలో నింపుకొని తేలిక పడిన అడుగులతో ఇంట్లోకి ప్రవేశించింది.

## 9

సరస్వతి వివాహం ఫాల్గుణ మాసంలో అయింది.

ఆమె పెండ్లికి ముందు చాలా మార్పులు వచ్చాయి.

శకుంతలకు బోయపాలెం స్కూలుకు బదిలీ అయింది. బోయపాలెం భీమునిపట్నం వెళ్ళేదారిలో ఉంది. రమారమి ఒకగంట బస్సు ప్రయాణం. ఆమె అక్కడ చేరిపోయింది.

ఒక్క వారంరోజుల వ్యవధిలోనే రామచంద్రయ్య జానకమ్మ వచ్చి సరస్వతిని అడిగారు. కట్నం ఒక్కపైసాకూడా కోరలేదు. పెండ్లికయే ఖర్చుఅంతా భరిస్తామన్నారు. సింహాచలం దేవస్థానంలో సత్రవులో పెళ్ళికి అన్ని యేర్పాటులు చేశామన్నారు. కన్యధార వాళ్ళు పోస్తేమంచిదే. లేనిపక్షంలో మరెవరైనా బంధువులు వచ్చిపోస్తారు కార్యంకూడా అత్తవారింట్లోనే చేసుకుంటారు. శకుంతలకు ఏమాత్రం జవాబు చెప్పే అవకాశంకాని, కాదని చెప్పేధైర్యం కాని కలగలేదు

సీతమ్మధారలో ఒకయిల్లు అమ్మకానికి వచ్చింది. ఆ యింటిని శకుంతలపేరుమీద ఆనందరావు కొన్నాడు. హౌసింగుబోర్డు ఇల్లది. వెంటనే యిరవై వేలు చెల్లించడానికి, మిగిలిన పదహారువేలు వాయిదాలలో తీర్చడానికి అవకాశం లభించింది. ఇల్లు కొంతపూర్తి కావలసి ఉన్నది. సరస్వతి పెళ్ళితరువాత ఆయింటికి వెళ్ళాలని అనుకున్నారు వాళ్ళు.

ఏనాడయితే సరస్వతి వివాహం నిశ్చయమయిందో ఆనాటి నుండి సరస్వతి అన్న అమ్మాయి తెలియనట్లే శకుంతల మెసిలింది.

సరస్వతి పెండ్లి ఫాల్గుణ పూర్ణిమకు ముందు జరిగింది. పుట్టింటి నుండి తనతో సరస్వతి తీసుకొని వెళ్ళినది కొన్ని పుస్తకాలు, ఒక పాతట్రంకు. అంతకు మించి మరేమీలేవు. శాంతిమ్మకు నాలుగయిదు పట్టుచీరలున్నాయి. ఒక్కటికూడా శకుంతల ఇవ్వలేదు. వెళ్ళినప్పుడు తండ్రికి, సవతితల్లికి సరస్వతి వంగిదండం పెట్టింది. శకుంతల కనీసం సుఖంగా ఉండమనేనా దీవించలేదు. ఆమె పళ్ళుకొరుకుతుంటే సరస్వతి విని నవ్వుకుంది. వేటకాడి వలలోంచి తప్పించుకొని, వాడేమీ చెయ్యలేడని ధైర్యంగా అడుగులువేసినట్లు, పుట్టిల్లు విడిచి నడిచింది సరస్వతి.

సరస్వతి కార్యం మేడగదిలోనే జరిగింది. ఆనాడు ఆమె ఏమీ వింతగా ప్రవర్తించలేదు. పెద్దమంచం క్రిందను మరొక చిన్న మంచముంది. దానిని ముందు లాక్కుంది. సముద్రంవేపు నున్న కిటికీ తలుపులు తీసింది, తెరతొలగించి. పున్నమివెళ్ళిన మరునాటి చంద్రబింబం కొంచెం ఆలస్యంగా వచ్చినా, వెన్నెల స్వచ్ఛంగా సముద్రాన్నంతటినీ కప్పింది. అలలు మీదకు లేచి విరుగుతున్నవి. కాగిన పాలమీది మీగడలా కనిపించింది నురుగు. మంచంమీద ఒక బొంతు బొనా వేసుకుంది. పైన ఒక దుప్పటి పరచింది. పెద్ద మంచంమీద పెట్టిన తలగడాలలో ఒకదానిని తీసుకొంది.

తలుపులు వేసి, అందరూ వెళ్ళిపోయిన తరువాత, కొత్త పంచ వదలి షరాయి వేసుకున్నాడు. టేబిలు దగ్గిర కూర్చొని, పుస్తకాలు ముందు పడవేసుకున్నాడు. సరస్వతి అతని పక్కనే ఉన్న రెండవకుర్చీ కొంచెం ముందుకు లాక్కొని కూర్చుంది. పుస్తకం చదువుతున్న సత్యమూర్తి, దగ్గిరగా సరస్వతి కూచోడం చూచి ముఖం ఎత్తాడు.

"బావా !"

మూర్తి ఆమె ముఖంలోకి చూశాడు. ఇంతవరకు అతనిని మూర్తి అని పిలిచేది. మొదటిసారిగా ఆమె బావా అని పిలిస్తే మూర్తి ఆశ్చర్యపోయాడు.

"బావా ! నేనెందుకిలా పిలిచానని ఆలోచిస్తున్నావా ? నీ మీద నున్న గౌరవంతో పిలుస్తున్నాను. ఈ ఇంట్లో నాకు స్థాన మిచ్చి, నన్ను విపత్తునుండి రక్షించావు. నా కృతజ్ఞతలు మరొకసారి తెలుపుకుంటున్నాను. ఇంతవరకే మన బాంధవ్యం. మిగిలినదంతా స్నేహమే.

"సరస్వతీ ! నువ్వు నాకు కృతజ్ఞతలు చెప్పుకోనక్కరలేదు. నిన్ను పెండ్లి చేసుకోవడమే అదృష్టం. ఇక స్నేహం విషయంలో ఈ కోర్సు పూర్తి అవడానికి మరో రెండు సంవత్సరాలు పడుతుంది. వివాహంతో విద్యానాశనం కాకుండా పరిసమాప్తి చెందుతుంది. అంత వరకు మనం బ్రహ్మచారులమే."

సరస్వతి లేచి నిలబడింది. క్షణం అతని ముఖంలోకి చూచింది,

"బావా ! నువ్వు చాలా బుద్ధిమంతుడివి. దురదృష్టాన్ని దారి మరలించి లాభాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్నావు. నేనేమీ అడ్డురాను."

సరస్వతికి ఓడిపోయినట్లనిపించింది. తనతో శారీరకమైన సంపర్కం లేనందున అతను బాధపడతాడని అనుకుంది. కాని అతడేమీ చెక్కుచెదరకుండా కార్యక్రమాన్ని మామూలుగా సాగించడం చూచి విస్తుపోయింది.

కార్యమయిన మూడు రోజులనుండి ఆ యింట్లోని పాతమనిషి అయిపోయింది సరస్వతి. ప్రొద్దున్నే నిద్రలేచి, కాల్యాలు తీర్చుకుని, నీళ్లుపోసుకొని, సత్యమూర్తికి టిఫిన్, కాఫీ తయారు చేసి యిస్తుంది. అతను వెళ్లిపోయిన తరువాత, పిల్లలకు ముస్తాబు చేసి. భోజనాలు పెట్టి, బడికి పంపించడానికి జానకమ్మకు సహాయపడుతుంది. రామచంద్రయ్య భోజనంచేసి వెళ్ళిపోయిన తరువాత సత్యమూర్తికి కారియరు సిద్ధంచేసి, కుర్రవాడు వస్తే అప్పగిస్తుంది. తరువాత అత్త కోడలు భోజనాలు చేస్తారు. వంటింటి పనులు సరస్వతి చూసుకుంటుంది. జానకమ్మ పడకగదిలో పత్రికో, పుస్తకమో చదువుకుంటూ నిద్రపోతుంది. మధ్యాహ్నం కాఫీలవరకు సరస్వతి క్రిందిభాగంలోనే కాలం గడుపుతుంది. ఆ రోజు పేపరు చూడడమో, ఇల్లు చక్కబెట్టడమో, మరేదైనా పుస్తకం చదవడమో చేస్తుంది. మధ్యాహ్నం నిద్రపోయే అలవాటు మాత్రం ఆమె అలవరచుకోలేదు. ఇంటో అందరూ నిద్రపోతే ఇంటికి భద్రత తక్కువ. ఇంతవరకు జానకమ్మ మధ్యాహ్నం నిద్రమానుకొని కూర్చుండేది. కోడలు వచ్చిన తరువాత కొంచెం విశ్రాంతిగా కాలం గడుపుతున్నది. ఆమెకిప్పుడే నలభై అయిదు ఏళ్ళు సత్యమూర్తి తరువాత కాన్పులు ఎడమయాయి. పదేళ్ల శేఖర్, ఎనిమిదేళ్ల కాత్యాయని ఇప్పుడు మరి కాన్పులు ఎడబెట్టిందామె.

ఆదివారాలలోనే మూర్తి ఇంట్లోఉండేవాడు. రామచంద్రయ్య మూడో శనివారాలలో కూడా ఉండేవాడు. ప్రొద్దుటిపూట రామచంద్రయ్య మొక్కలలో కూర్చునేవాడు. అతను కష్టపడి త్రవ్వడం మొదలయిన పనులు చేయలేకపోయినా, పూవుల సొగసు, కాయల చక్కదనం, తీవల అందం చూచి ఆనందించేవాడు. ఆకుకూరలు, పాదులనుండి కాయగూరలు, పిల్లలు కోస్తుంటే సలహాలు యిచ్చేవాడు. సాయకాలంవేళ సత్యమూర్తి శ్రమపడేవాడు. గెత్తం తెప్పించేవాడు. పండిన ఆకులు తీసి పారవేసి, గొప్పులు తవ్వి, బాగా ఎదిగిపోయిన గులాబీ, క్రోటన్సు మొక్కలను కత్తిరించి, ఇంటికి మొక్కలకు గల సామరస్యాన్ని అభివృద్ధి చేసేవాడు.

సరస్వతికి ఈ పనులన్నిటిలోనూ భాగమైంది. ప్రొద్దున మామగారితో, పిల్లలతో, సాయంవేళ భర్తతో ఆమె విధిగా తోట పనిలో పాల్గొనేది. తను వచ్చిన తరువాత రెండు సంపెంగ మొక్కలను సింహాచలం నుండి తెప్పించి, ముందునున్న ఖాళీస్థలంలో రెండు చివరలను వాటిని నాటింది. సన్నజాజి మొక్కలకు పందిరి వేసింది. ఎవరో హైదరాబాదు నుండి ద్రాక్ష అంటు నొకదానిని తెస్తే, ఒక పక్కనివేసి, పందిరి కెక్కించింది. ఆమె వెంట కాత్యాయని అంటి పెట్టుకుని ఉండేది. మట్టి పారబోసినట్లు, నీళ్ళు పోసినట్లు, ఏదో ఒకపని సాయం చేసేది. శేఖర్ ఎక్కడిదో కాకర విత్తనమొకటి తెచ్చి, దానినొక మూల పాతి, నీళ్ళు పోసి, ఆకులు వచ్చిన దగ్గిర నుండీ దాని సంరక్షణకే ప్రాకులాడేవాడు. పని చేస్తున్నంతసేపు కాత్యాయని ఏవో ప్రశ్నలు వేస్తూనే ఉండేది. విసుగు చెందకుండా సరస్వతి అన్నిటికి జవాబులు చెప్పుతునే ఉండేది. శేఖర్ ప్రశ్నలు వేయకపోయినా, తను వేసిన మొక్కను వదినకు చూపించి, ఆమె మెచ్చుకుంటే ఉబ్బిపోయేవాడు.

ఎండాకాలం సెలవులు. సరస్వతి ఆ యింట్లో చేరి అప్పుడే మూడునెలలు దాటిపోయాయి. ఒకనాటి మధ్యాహ్నం జానకమ్మ ఫలహారం తయారుచేస్తున్నది. సరస్వతి కాత్యాయనికి జడ వేస్తున్నది. శేఖర్ పడక గది లోంచి వచ్చి వాళ్ళ దగ్గిర నిలబడ్డాడు.

"వదినా! నీ పెళ్లి ఎన్నో తారీకున అయిందో జ్ఞాపకముందా?" శేఖర్ ప్రశ్నించాడు.

"నేను మరచిపోయాను, నువ్వు చెప్పు!" అంది సరస్వతి.

"వదినా! నువ్వెందుకు మరచిపోతావు ! అయినా నేను చెప్తున్నానులే ! మార్చి తొమ్మిదో తారీకున సింహాచలంలో అయింది" అంది కాత్యాయని.

( ఇంకా ఉంది )

## ఉదంకుడు మునియా? ఋషియా?

## - నన్నయ్యగారి ఋష్యాత్మ

"భారతి" (జనవరి 1984, పు 68) లో రెండు అతిస్వారస్య కరమైన సమస్యలను ప్రస్తావిస్తూ శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు ఉదంకుని విషయమును... అతను మునియా? ఋషియా? అనేది సంగతిని... అమూలాగ్రముగ శోధించేందుకు ప్రయత్నించి నన్నయ్య గారి ఋష్యాత్మను అలా ముట్టి... విరామము లేకుండ కావచ్చు... వదలేశారు. సామాన్యంగ మన సాహిత్య రంగములో ఒక పద్యాన్ని గాని, అందులో ఒక పాదాన్నిగాని తీసికొని సాహిత్య మాస పత్రికలో చర్చించడము తెలుగు సారస్వతానికి నూతనమేకాక అపురూపమని చెప్పితే అతిశయోక్తి కాదు. ఈ విమర్శా పద్ధతి ఆంగ్ల భాషా పత్రిక లలో మనం చూడవచ్చు. సుదర్శనంగారు ద్విభాషా పండితులు గాబట్టి ఈ రీతిని "భారతి"తో పరిచయం చేసి యశస్సు గాంచినారు. ఆయన స్వతః కవి, విమర్శకుడు కాబట్టి ఆయన వ్యాఖ్యను పాఠకులు సహృద యతతో స్వీకరించవలసి ఉన్నది. ఇంగ్లీషులో ఇటువంటి వ్యాఖ్యలతో చాల పత్రికలు వెలువడటం సాహిత్యాభిమానులందరికీ తెలిసినదే.

ఈ విమర్శలో ఉపయోగించే పదములను స్పష్టీకరించడము విమర్శకుని ప్రధాన కర్తవ్యము. కొన్ని పదములను వ్యాసకర్త మరీ మరీ వాడినారు కాబట్టి వాటి వివరణార్థం నేనెరగినట్లు... వారు వేరె దృష్టిలో వాడి వుండవచ్చు గనుక... చర్చకు మొదట నివేదించడము సందర్భోచితముగ కనబడుతుంది. "దర్శనం" అనేది ఒక కీలక పదము. "దర్శనం" అనగానే మనకందరికీ షడ్దర్శనాలు మనః పటలము మీద పొరుతాయి. ఈ సన్నివేశములో మన విమర్శా చర్చకు అవసరమైనది "వేదాంత దర్శన"మేగాని మిగతా దర్శనాలు కావు. "ఆత్మ దర్శనం" అని వ్యాస మహాఋషిని గురించి వ్రాస్తూ "దర్శనా" నికి "ఆత్మ" అనే పదాన్ని అతికించి ఉత్కృష్టమైన పద విన్యాసాన్ని సుదర్శనంగారు ప్రదర్శించారు దాంతుడు "దర్శన" మనినా వేదాంతుడు "ఆత్మ దర్శనం" అనేది "ఆత్మ జ్ఞానాన్ని" మాత్రమే. అన్ని విద్యల్లోనూ వేదాంత "దర్శనము" ముఖ్యమైనది కాబట్టి ఈ దర్శనాన్ని అతిశయించినది లేదని దీన్ని "సుదర్శనం" అంటారు.

నన్నయ్యగారు రచించిన ఆదిపర్వమునను్న ముఖ్య సీస పద్యాన్ని (119 పద్యం) విశ్లేషణ చేస్తూ భాష్యకారుడు ఇట్లన్నాడు.

"ఇది కుండలినీ విద్య చెప్పిన వేద విద్యకు మకుటాయమానమైన ఆత్మానుభవ సారము". ఈ పద్యములో పాఠకులకు కనబడేది "కుండలినీ" విద్యనా లేక మరొక విద్యనా అనే విషయాన్ని నేను ఇచ్చట చర్చించడం లేదని మనవి చేయుచున్నాను. కుండలినీ విద్యకూ, మరియు ఆత్మ జ్ఞానానికీ ఉన్న పరస్పర సంబంధాలను మాత్రం గురించి ఇచ్చట వివరిస్తున్నాను.

పైన చెప్పిన సందర్భములో రెండు సమస్యలు విమర్శకుని "పీడి"స్తాయి. కుండలినీ విద్య పైలుని ఆత్మానుభవసారమా? ఈ విద్య వేద విద్యకు... పైలుడు ఉదంకునికి ధారపోసినది... మకుటాయ మానమా?

విద్య ఏదైనను జీర్ణించుకొనే శక్తి పొందిన ప్రతి విద్యార్థికీ ఆత్మానుభవ మౌతుంది. కుండలినీ విద్య వ్యాస మహర్షి కంటె... సుదర్శనంగారు వ్యాసుడు ఆత్మ దర్శనం పొందిన వాడని అంగీ కరించారు. ముందునించీ (బహుశః అనాదిగా) వున్న విద్యగాబట్టి అది పైలుని ఆత్మానుభవముగాని, ఆత్మానుభవ సారమనిగాని ఖచ్చిత ముగ, నిర్వివాదముగ నిరూపించలేము. బాగా నేర్చిన... శ్రద్ధాభక్తు లతో... ప్రతి విద్య కూడ ఆత్మానుభవమని అంగీకరిస్తే మాత్రం కుండలినీ విద్య పైలుని ఆత్మానుభవ మౌతుంది.

కుండలినీ విద్య, వేద విద్యకు... ఉదంకుడు పైలుని దగ్గిర నేర్చుకొన్నది వేద విద్య అని సమ్మతిస్తే... మకుటాయమాన మనడం రెండవ సమస్య కాదని నా అభిమతము, శోధన చేసి చూస్తే కుండలినీ విద్య వేద విద్యలో ఒక భాగమని చెప్పవచ్చు. కాని వేద విద్య కది కిరీట ప్రాయమని చెప్పలేము. మిగిలిన వేద విద్య సంపాదనకు ఒక సాధనమని చెప్పవచ్చు, అంతేకాని కుండలినీ విద్య వేదాంత దర్శనానికి "మకుటాయమానముగ" నాకు కనబడదు.

పై సమస్యను ఈ క్రింద విధముగ ప్రతిపాదించవచ్చు ఉదంకుడు తన విద్య పూర్తికాగానే గురు దక్షిణ ఇవ్వడాని కోసం తహ తహ పడుతాడు. ఆ సందర్భమున గురువు పైలుడు శిష్యుడైన ఉదంకుని తన భార్య దగ్గిరికి పంపడం మూలా కుండలినీ ప్రస్తావన వస్తుంది. వేద విద్య తరువాత కుండలినీ విద్య బోధన చేసినట్లు కన బడుతుంది. తత్వ బోధన తరువాత శిష్యుడు ప్రాక్టికల్ పరీక్షకు దిగు తాడు. విద్య హస్తగతమైన వాడికి తాను నేర్చిన విద్యను ప్రాక్టికల్ పరీక్షలో... ఎందుకంటే ఉదంకుడు పయనించడం ఒక విధమైన ప్రాక్టికల్స్ కదా?... ప్రయోగించడం సులభము. తన పయనం

ముగించి వచ్చిన తరువాత ఉదంకుడు వాని అనుభవాలను చెప్పి వాటికి సంకేతార్థమును తెలుసుకోడానికి ప్రయత్నిస్తాడు గనుక విద్యలో వాడింకా వెనకబడి ఉన్నాడనేది భావన మన కొస్తుంది.

విద్యార్జనలో రెండు అవస్థలు : విద్యను కంఠస్థము చేయవలసినది మొదటి దశ; ఇది అతి చిన్న వయస్సులోనే జరుగుతుంది. కాని అలా కంఠస్థం చేసిన తరువాత ఎన్నో రోజులు నెమరు వేయుట జరుగుతుంది. రెండు దశలకి మధ్య కొంత వ్యవధి అవసరం. మొదటి దశలోనే విద్య హస్తగతమైనట్లు కనిపిస్తుందిగాని అలా జరుగదు. ఈ విషయము స్పష్టంగా చెప్పాలంటే విద్యలో "ఫార్మల్" దశ మరియు "రియల్" దశ ఉన్నాయని చెప్పవచ్చు. రియల్ ఎడ్యుకేషన్ బిగిన్స్ ఆఫ్టర్ ఫార్మల్ ఎడ్యుకేషన్, అంటే పట్టి ప్రదానమైన తరువాత అసలు... మనకంతా తెలిసినదే కదా... విద్య మొదలవుతుంది. యువకుని విద్య సంపూర్ణమైందంటే పట్టి పట్టప్రదానమైనదని భావించవలెను. మొదటి రకం విద్య బడిలో జరుగుతుంది. రెండవ రకం విద్య వ్యక్తి ఆశ, ఆకాంక్షలను బట్టి కాలక్రమమున హస్తగతమౌతుంది. ఈ దశలు పరస్పర విరోధముగ కనబడుతాయిగాని అలా కాదు. అందుచేత ఉదంకుడు విద్యను కంఠపాఠం చేశాడు కాబట్టి రెండవ దశలోకి రాలేదు. ఇలా విమర్శించడానికి ఆధారాలున్నాయి. ముఖ్యమైన ఆధారాన్ని శ్రీ సుదర్శనంగారు తీక్షణంగ గ్రహించి స్పష్టముగ తెలిపినారు; "ఇది పగ, కొంగున ముడిచిన అగ్ని, జ్ఞానికి సంయమికి తగని ప్రవృత్తి." దీనికంటె దాఖల మన కనవసరం. ఉదంకునిలో "పగ" ఉన్నది కాబట్టి అతడు సర్వసామాన్యుడు. వేద విద్యను గ్రహించనివాడు సంయమి ఎల అవుతాడు? దార్శనికుడు ఎలా అవుతాడు? వ్యాసకర్త చెప్పినట్టు "చదువు కొన్నవాడూ చాకలివాడూ ఒకటే" ఇది అభినందనీయమైన నిజకడ. పట్ట ప్రదానముతో ఆగిపోయే విద్య, ఉత్త ఫార్మల్ విద్యార్జనతో ఆగిపోతే నేర్చిన విద్య చాకలివాని విద్యతో సరి.

ఇంక ఉదంకుడు మునియా? ఋషియా? అనే విషయమును పరిశోధింపవలసి ఉన్నది. ముఖ్యముగ గమనించవలసినది-ఉదంకుడు కుండలాల కోసం పయనించి తిరిగి వచ్చిన తరువాత తన గురువును తన అనుభవాలకు... పయన సమయములో కలిగిన... అర్థమేమిటని ప్రశ్నించడం అంతటకంటే చాల విశేషము ఇల అడగడం సహజంగా వానిలో ఉన్న విద్యా దోహదాగ్నిని స్పష్టముగ చూపించడమేగాక అతని విద్య సంపూర్ణము కాలేదని నిర్వివాదముగ ఘోషిస్తుంది. అడగడం తన అసంపూర్ణత్వాన్ని స్వయముగ సమర్థించినట్లే కదా? గురువును అడిగినాడు గాబట్టి అతనికి గురుభ క్తి అచంచలంగా ఉన్నదనే విషయాన్ని సూచించడమే గాక గురువును తనకన్న ఎక్కువగా తెలుసు అనే విషయాన్ని అంగీకరించినట్లు వ్యక్తమువుతుంది. విద్య పూర్తి అయినా ఆసక్తి వున్నవాడు విద్యార్జనను నిరంతరము కొనసాగించవచ్చునని విశదమౌతుంది. సంపూర్ణ విద్య అనేది మిథ్య. విద్యార్జనకు ఆసక్తి ఉన్నవాడు యెందుకు యెల్లలను నిర్మించుకోవడం? కాని ఉదంకుని ప్రవర్తనను మనము జాగ్రతగా చూస్తే అది తెలిసీ తెలియనిదిగా కనబడుతుంది. తెలియదు గాబట్టి గురువును ప్రశ్నించినాడు. తెలియనప్పుడు తెలుసుకోవడంవల్ల అమితమైన జ్ఞానం పొందవచ్చు అనే అంశము మనకు తెలుస్తుంది.

గురువు పైలుడు "సమ్మునీంద్ర" అని తన విద్యార్థిని సంబోధన చేశాడంటే కారణమేమిటి? ఆచార్యునికి శిష్యుని సంగతి వేద్యమే కదా? తెలిసీ యిలా సంబోధించడం సమర్థనీయమా? యిదీ కాకుండ ఇది గంభీరమైన మాటేనా? లేక వక్రోక్తా? సహృదయముతో ఈ సందర్భాన్ని మనము పరిశీలిస్తే ఈ పదములో నిగూఢమైన శ్లేషార్థము బైట పడుతుంది.

గంభీరమైన అర్థమును సమర్థించడము అతి సులభముగ కనబడుతుంది శిష్యుడు యువకుడు; విద్యాదోహదమున్నవాడు; గురుభక్తి గలవాడు; విధ్యుక్తముగ విద్యబోధింపబడినవాడు; బ్రహ్మచర్యాశ్రమమును ముగించి గృహస్థాశ్రమంలో అడుగు పెట్టబోయేవాడు. కాని గురుపేరగినట్లు సన్నివేశముల రహస్యార్థమును తెలుసుకోలేనివాడు. విద్యాకాంక్ష ఉన్నదిగాని దానిలో ఏదో కొరత వున్నదని చెప్పదామా? లేక ఎంత చదివినా స్వతంత్రముగ తన కాళ్లమీద తాను నిలబడలేనివాడని చెప్పవచ్చునా? ప్రశ్నించే సహజ క్రియ వుంటే చాలునా? తన ప్రశ్నకు తానే సమాధానం పొందే శక్తి కూడ విద్యయే కదా? ఒక ఎం. ఎ. డిగ్రీ పుచ్చుకొన్న విద్యార్థిని "హలో డాక్టర్" అంటే ఎటువంటి భావాలు వస్తుంవో ఆటువంటి సమాధానం రప్పించడానికి పైలుడు ఉదంకుని "సమ్మునీంద్ర" అని అన్నాడని నా అభిప్రాయము సహజంగ సంశయాస్పదుడైన విద్యార్థిని "హలో డాక్టర్" అంటే తప్పర్థం చేసుకొంటాడు. గురువు తనను హేళన చేయుచున్నాడను కొంటాడు. కాని సహృదయముగల విద్యార్థి అయితే వానిలో ఎన్ని రకాల ప్రతి క్రియ తరంగాలు ఉద్భవిస్తాయి ! అప్పటికే వెలుగుతున్న అగ్నికి ఆజ్యం పోస్తే ఎంత ఎక్కువగా ప్రజ్వలిస్తుంది? ఒకటికి వెయ్యింతలు వెలుగివ్వదా? ఉత్త ఎం. ఎ. డిగ్రీతో మనకేమి పని? ఎప్పుడు డాక్టరు కావలెను అనే అభిలాష పుట్టదా? డాక్టర్ అయిన తరువాత ఎప్పుడు ప్రొఫెసర్ కాగలనని కలవరించడు? క్లుప్తముగ చెప్పదలచుకొంటే ఎప్పుడు తాను నన్నయ్యలాంటి కవివర్యుడౌతానా? ఎప్పుడు వ్యాసు డౌతానా? అని అనిపించదా? పైలుడు ఉదంకున్ని "సమ్మునీంద్ర" అని సంబోధించడంలో ఇదే గూఢార్థమున్నది. తేలిక కాదు, గాంభీర్యమున్నది; ఎగతాళి కాదు, గౌరవమున్నది, ఘనత

వున్నది. విద్యార్థిలో వున్న ఆసక్తి అనే నిప్పుమీద గురువు ఇంకింత ఇంధనాన్ని పోస్తాడు.

కాని ఉదంకుడు తాను "ముని"... అంటే ఋషి... అను కొంటాడు. ఫస్టు క్లాసులో ఎం. ఎ. పాసైనవాడు డాక్టరేటు పొందిన వానితో తాను సరి సమానము అనుకొన్నట్లు ముని కుండవలసిన అర్హతలు నాలో వున్నాయా లేవా అవి పరిశీలించడు కుండలాల కోసం వెళ్ళి తిరిగి వచ్చిన తరువాత తనకు తెలియని విషయాలు యింకా వున్నాయని గ్రహించినప్పుడే "నా విద్య పూర్తికాలేదు" అని తెలిసి కొని గురువు దగ్గిరనే ఉండడానికి అవకాశం పొందేవాడు. అలా పొందలేదు. అందుచేతనే ఉదంకుడు "సమ్మునీంద్ర" అనే సంబోధ నను తప్పర్థం చేసుకొన్నాడని నిర్భయముగ నిర్వివాదముగ చెప్ప వచ్చు. ఇది ఆ విద్యా దోషం కాదు; వివేచనా రహిత విద్యా దోషం.

"ముని" అనే పదము ఒక్క శ్లేష, నానార్థ సంయోగమున్న పదము. ముని అంటే ఉత్సాహ ముండేవాడు అని కూడ అర్థం. మనము ఎల్లప్పుడూ "ముని" అంటే "ఋషి" అని అర్థం చేసుకో కుండ ఉత్సాహము గలవాడని లేక ఉద్రేకం గలవాడని అర్థం చేసు కొంటే ఇక్కడ ఔచిత్యము కనబడుతుంది. అందుచేతనే ఉదంకుడు గంభీరార్థ దృష్టితో "ముని" కాదనవచ్చు. కాని వానిని పైలుడు "సమ్మునీంద్ర" అని పిలవడంలో నాకు తప్పు కనిపించదు. తెలివున్న వానికి ప్రేమతో కూడిన దెబ్బ; లేనివానికి ప్రేమ స్తోత్రము; గ్రహించిన వానికి ముక్తి; గ్రహించని వానికి బంధనము; నింద కాదు, మందలించడము.

ముగింపులో సుదర్శనంగారు నన్నయ్యగారిది ఋష్యాత్మ కాదా? అవునా? అనే మీమాంసలో ప్ర రు. ఒక శంతంతో "నా నృషిః కురుతే కావ్యం" అనే సూత్రం దృష్ట్యా "భారతం" రచించిన నన్నయ్య మహా రాజును "ఋష్యాత్మ" అని పిలిస్తే "ఫరవాలేదు" అని చినరన "నన్నయ్యగారు చేసిన మార్పు తెలిసి చేసిందా లేక తెలియక చేసిందా?... విజ్ఞులే నిర్ణయించాలి. దాన్నిబట్టి నన్నయ్య ఋష్యాత్మ స్థాయి కూడ నిర్ణయం అవుతుంది" అని వ్యాఖ్యానించారు. తొలుత చెప్పిన దానితో చివరకి విభేదించినారు. నన్నయ్యగారిది ఒక దృష్ట్యా ఋష్యాత్మ కావడం ఏమిటి? మరొక దృష్ట్యా కాకపోవడం ఏమిటి? నిర్వివాదముగ నన్నయగారిది ఋష్యాత్మ అని చెప్పలేకపోయారు. దీనికి కారణం ఒకటే; వ్యాస మహాముని వ్రాసిన "ఏక మశ్వమపానె ధమ" అన్నదాన్ని "ఈ అశ్వ కర్ణ రంధ్రాధ్మానంబు సేయు" అని మార్చినారు. తెచ్చిన మార్పు ఉచితమైతే నన్నయ్యగారిది "ఋష్యాత్మ" అని అంటారు. ఈ విషయం పరిశీలించవలసినది.

మొదటి విమర్శకుడు ఎంత గొప్పవాడైనాకాని ఒక ఉదాహర తీసుకొని కవి ఋష్యాత్మ మీద తీర్పు ఇవ్వబోవడం కర్మ బద్ధః కాదని నా విజ్ఞాపన. వెయ్యారు నిర్దేశనాలు, దృష్టాంతాలు ఉన్న కావ్యమును మన ముందర ఉంచుకొని ఒక చిన్న విషయాన్ని పెద్ద చేసి చెప్పడము అంత బాగా లేదు. పైగ నా వాఖ్యయే ఉత్కృష్టమై దని నేననుకో నక్కరలేదు; నిర్వివాదమైనదని కూడ అనుకోను.

నన్నయ్యగారిని గురించి విమర్శించేందుకు ముందుగా మనవ కొన్ని సూత్రాలు గుర్తుంచుకోవడం మంచిది. మొదటిగా "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్యమప్రియం" అనేది ఈ సూత్రాన్ని మహాకవులందరూ పాటిస్తారు. రెండవ మహాకావ్యాలలో ఆనందవర్ధనుడు... "ధ్వన్యాలోకం" గ్రంథకర్త.. చెప్పినట్టు "ధ్వని" వుంటుంది. కావ్య ధ్వనిని పాఠకులందరు గ్రహించలేరు. సహృదయుడైన విమర్శకుడే గ్రహించ గలడు మూడవది శ్రీ సుదర్శనంగారు స్వయముగ పద్య విశ్లేషణ చేసి చూపించినట్లు కావ్య భావ సంకేత భాష. మహాకవి ప్రతి సన్నివేశ ములో ఉపయోగించే ప్రతి పదాన్ని సంకేతముగ ఉపయోగిస్తాడు. అనాది కాలములో వేదాన్ని చదువుకొన్న పండితులందరూ అన్ని సంకేతాలనూ సులభముగా గ్రహించేవారు కాబోలు. మనకు అదంత సులభము కాదని నా అభిప్రాయము.

నన్నయ్య మహాత్ముని దార్శనికత అతను వ్యాస భారతంలో తెచ్చిన మార్పుమీదనే ఆధారపడివుంటే ఆ విషయము అంత పెద సమస్యకాదు. "ఏకమ్ + అశ్వమ్ + అపానే + ధమ" అనే దాన్ని "ఈ అశ్వ + కర్ణరంధ్ర + అధ్మానంబు + సేయు" అని మార్చినది అర్థం చేసుకోడానికి అంత క్లిష్టమైన విషయముకాదు "కర్ణ" అనేది సంస్కృత పదము పైగా శ్లేష. అందరూ ఎరిగిన అర్థం... చెవి అనేది... తీసుకొని వ్యాస కర్త ఒక నిర్ణయానికి వచ్చారు. మోనియర్ విలియంన్స్ దానికి "హుక్" అనే అర్థాన్ని కూడ ఇస్తాడు. కర్ణరంధ్ర మంటే వెనుక వైపువున్న రంధ్రమని అర్థమైనది. "ధమ" మరియు "అధ్మానం" అనే పదములు ఒకే క్రియా పద రూప భేదాలు కాని "అపానము"నకు బదులు "కర్ణ రంధ్రము" వచ్చినది. ఇలా మార్చ డానికి బలమైన కారణం... ధ్వనికాబోలు?... వుండే నన్నయ్య ఆ పని చేసి వుంటారు తప్ప నిష్కారణంగా చేసి వుండరని నా భావన.

"ధమ" అనే పదం రూపు మార్చడంతో పాటు "సేయు" అనే పదాన్ని అతికించారు. దీని మూల ధాతు "సే" అన్నది. ఇది కూడ సంస్కృత అక్షరమే. కాని "అపాను" అనే పదం... అతి సరళమైనది... వదలి పెట్టి ఈ పద చాక చక్య మెందకు? ఈ మార్పు పాండిత్య ప్రదర్శనమా లేక వ్యాస మహాకవిని దిద్దడమా?

ఒక దృష్టితో చూస్తే పాండిత్య ప్రదర్శనమని కనబడుతుంది గాని అలా కాదనడానికి అనేక కారణాలున్నాయి. నన్నయ్య పాండిత్యమును సుదర్శనంగారు పద్య విభజన చేసి చక్కగా చూపించినారు. వారు చూపిన అర్థముకన్నా ఆ తీరు ప్రాధాన్యము. వ్యాఖ్యారీతి గొప్పదిగాని వారు తెలియ జేసిన సంకేత ప్రతినిధులు కావు.

దీన్ని బట్టి చూస్తే ఈ పై ఉదాహరణలో మాత్రము నన్నయ్య వ్యాసుని దిద్దినాడు. ఎందుకంటే "ధమ" అనేది పూరకము, కుంభకము మరియు రేచకము అని మూడు విధములు. "అపానము"ను ఉంచుకొంటే ఈ మూడు సూచించడానికి కాదు. అందువల్లనే నన్నయ్య ఈ పైన చెప్పిన మార్పు చేసినారు. చేసిన మార్పు ఔచిత్యంగ ఉన్నది కాబట్టి నన్నయ్యగారిది సుదర్శనంగారి ప్రకారం ఋష్యాత్మ కాబోలు.

శ్రీ భాస్కర పంతులు

# "నన్నయ ఋష్యాత్మ" పరామర్శ

నన్నయ కవిత్వం గూర్చి ఉపజ్ఞతో కూడిన ఉత్తమ రచనలు వెలువడటమే అరిది. ఈ లోటును పూర్తిచేయ నెంచిన శ్రీ కాజ లక్ష్మీనరసింహారావును నేను అభినందిస్తున్నాను. వారు ఎంతో పరిశ్రమించి, "ఉదంకుని కథ : నన్నయ ఋష్యాత్మ" అనే శీర్షిక క్రింద 'భారతి' (సెప్టెంబరు, 1983) లో ఒక చక్కని వ్యాసం వెలువరించారు. ఉదంకుని కథను వ్యాస రచనతో పోల్చి తులనాత్మక పరిశీలన చేసి ఉండటం దీనిలో విశేషం.

నన్నయ ఉదంకుని కథలో అనేక విషయాలను వాచ్యం చేయలేదు. అతడు వాచ్యం చేయని విషయాలను తిక్కన వాచ్యం చేస్తూ, అశ్వమేధ పర్వం - తృతీయాశ్వాసంలో ఉదంకుని కథను రచించినాడు. నన్నయ రచించిన కథకు, దీనికి సన్నిహిత సంబంధం ఉంది. అయినా శ్రీ లక్ష్మీనరసింహారావు తిక్కన ఏల తడవలేదో తెలియదు. "ఉదంకుడు తక్షకు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయం జింతించి యొక్కనాడు జనమేజయు పాలికిం బోయి" (ఆది 1-120). "నీవు ననేక భూసురాపాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాపకారోదరసంహతిన్" (ఆది 1-124) అని అతనిని పురికొల్పినట్లు నన్నయ భారతంలో ఉంది. ఉదంకుని కథను వైశంపాయనుడు జనమేజయునికి చెప్పినట్లు తిక్కన భారతంలో ఉంది. వ్యాస భారతంలో కూడ ఈ ఉపాఖ్యానం ఉందా? తిక్కన రచనకూ, దీనికీ గల భేద సాదృశ్యాలు ఎట్టివో పరిశీలింప గోరుతాను.

తిక్కన రచన ప్రకారం, ఉదంకుడు గౌతముని శిష్యుడు. గురు సేవలోనే అతడు వృద్ధుడైనాడు. గురువు కరుణించి, అతనికి తన కూతునిచ్చి పెండ్లి చేసినాడు. గురుపత్ని అహల్య ఒకనాడు ఉదంకునితో, మిత్రసహుడనే రాజుభార్య కుండలాలు తెచ్చిపెట్టమని కోరింది. ఉదంకుడు తొలుత శాపగ్రస్తుడైన రాజు కడ కేగినాడు. ఉదంకుడు ఎక్కడ పోయినాడో గౌతమునికి తెలియనే తెలియదు. మిత్రసహుడు "మసజర క్తసిక్త తనువును, గోరమీసములు, వృత్త లోచనములు" కలిగి ఉన్నాడట. అతడు ఉదంకునితో నిన్ను తిని ఆకలి తీర్చుకుంటాను అన్నాడు. గురు కార్యార్థం వచ్చిన తన్ను చంపదగదని ఉదంకుని ప్రార్థించినాడు. అది ఏమిటని మిత్రసహుడడుగగా, నీ దేవి కుండలాలు ఇప్పింపుమని ఉదంకుడు కోరినాడు. అంతట మిత్రసహుడు "అభిజ్ఞానముగ" కొన్ని మాటలు చెప్పి, తన దేవి ఉండేచోటును ఉదంకునికి చూపినాడు. మిత్రసహుని భార్య మదయంతి పరమపతివ్రత, ఆమె తన కుండలాలను ఉదంకునికి ఇచ్చి, వీటిని అప్రమత్తుడవై కొనిపొమ్మని చెప్పింది. సురలు, గంధర్వులు, ఉరగులు ఎన్నో ఉపాయాలతో సంచరిస్తూ ఉంటారని వారు ఆ కుండలాలను తస్కరిస్తారని హెచ్చరించింది.

మదయంతి మాటలలో "ఎంగిలిపొరసిన" "ఏమఱి స్రుడించిన" "నేల నిడిన" - ఆ కుండలాలను సురాదులు అపహరిస్తారు వాటిని ధరిస్తే, "ఆకలి సీరువట్టగ్ని భయము, విష వికారము, భూత భేతాళ బాధలు" పొరయవట అవి బాలుర చెవులకైనా, పెద్దవారి చెవులకైనా అమరు నాయు; [illegible] సరిపెడ్తాయట.

ఉదంకుడు తన వాగ్దానం ప్రకారం, మిత్రసహుని మరల కలిసి కొంటాడు. తత్ఫలితంగా రాజుకు "సమాధాన నూతన సత్వం" కలిగింది. ఉదంకునికి కుండలాలను ఇప్పించటంద్వారా తన పాపం తొలగినట్లు మిత్రసహుడు భావిస్తాడు. ఉదంకుడు అతనిని వీడ్కొని గౌతమాశ్రమానికి పోతూ ఉండగా, ఫలభరితమైన బిల్వవృక్షం కనబడింది. అతడు సకుండలంబైన తన అజినాన్ని వృక్షానికి తగిల్చి, పండ్ల కోసరం చెట్టెక్కినాడు. గాలికి ఊగి, చెట్టునుండి సకుండలంబైన అజినం నేలపడింది. 'ఒక నాగుబా' (తక్షకుడు అని నన్నయ్య) దాని నెత్తుకొని ఒడిచింది. అది ఐరావత సంతానం (నన్నయ ప్రకారం దివ్య పురుషుడెక్కిన వృషభం ఐరావతం; దివ్య పురుషుడు ఇంద్రుడు). ఇంద్రుడు విప్రవేషంతో వచ్చి ఉదంకునికి సాయపడినాడు. 'ఇలతెరువిచ్చె, నమ్మునియునేడెబి జొచ్చె భుజంగ లోకమున్" (అశ్వమేధ 3:108). అక్కడ ఉదంకుడు చింతిస్తూ ఉండగా, "అరుణ వదనంబును నసితాంగంబును, సితవాలంబును"నైన ఒక తురంగం అతనికి అగపడింది. అది అతనిని ఉద్దేశించి, "ఇతతమైన నాదగు నపానము నూదు, మొకింత యేనియున్ జుగుప్సాతుర వృత్తి

నీదు హృదయంబున జొన్పుకు"మని చెప్పింది. నీవెవ్వరవని ఉదంకుడు అడుగగా, తాను "పావకుడ"నని (అగ్ని) సమాధాన మిచ్చింది: ఉదంకుడు అప్రకారమే చేసినాడు. వెంటనే ఘన ధూమం ఉద్గమించి పాతాళ లోకం అంతట వ్యాపించింది. ఉరగులు భీతిల్లి ఆ కుండలాలను తెచ్చి ఇచ్చినారు. ఇక్కడ తక్షకుని ప్రస్తావనయేలేదు.

నన్నయ్య రచన ప్రకారం దివ్య పురుషుడు (ఇంద్రుడు) మహోక్షము (ఐరావతం) నెక్కినాడు. తక్షకుడు భక్షించిన గోమయం అమృతం; "అతి ప్రమాణ తురంగమును" ఎక్కిన (ఆది 1-108) వాడు పర్జన్యుడు; ఇంద్ర సఖుడు ఉదంకునికి ఒక దివ్య పురుషుడు వనంలో, రెండవ దివ్య పురుషుడు నాగలోకంలో కనబడినారు. వనంలో కనబడిన దివ్య పురుషుడు (ఇంద్రుడు) ఉదంకునిచేత "వృషభ గోమయ భక్షణం" చేయించినాడు. నాగలోకంలో కనబడిన దివ్య పురుషుడు అతనిచే "అశ్వకర్ణరంధ్రధ్మానం" (ఆది 1-110) చేయించినాడు. తిక్కన ప్రకారం ఒక తురంగం (అగ్ని) ఉదంకునిచే తన "అపానము"ను ఊదించింది. "అశ్వకర్ణరంధ్రధ్మానం" వల్ల భీతిల్లినట్లే; "అపానము" ఊదినందువల్ల నాగకులమెల్ల భీతిల్లింది. "ఇంద్రు గాంచి యమృతాశివగుట నీ కభి మతార్థ సిద్ధియయ్యె" (ఆది 1-118) అని గురువే ఉదంకునికి తెలిపినాడు. దీనిలో పాప కార్యంగాని, పన్నుగడగానిలేదు.

శ్రీ కాజ లక్ష్మీనరసింహారావు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలతో మనం ఏకీభవించటం కష్టం. ఉదంకుడు "వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి" అని నన్నయ భారతంలో ఉంది. దీనికి శ్రీ లక్ష్మీనరసింహారావు చేసిన వ్యాఖ్యానం విచార్యం. "దివ్య పురుషుడు ఉదంకునిచేత పాపము చేయింప దలచెను" అని వారు చెప్పినారు. "దివ్య పురుషుని కుటిల స్వభావమును వ్యాసుడు వాచ్యముచేయగా నన్నయ వ్యంగ్యము చేసెను" అన్నారు. వాస్తవంలో ఉదంకుడు దివ్య పురుషుని అనుగ్రహానికి పాత్రుడైనాడు. "వృషభ గోమయ భక్షణం" అమృతంవలె పనిచేసింది; ఉదంకుడు "అమృతాశి" అయినందువల్ల ఉరగలోకం నుండి మర్త్య లోకానికి సుఖంగా మగిడి వచ్చినాడు. నన్నయభావం ఇదే.

ఉదంకుడు "వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబుచేసి" అని నన్నయ భారతంలో ఉంది. "పన్నిన" అనేమాటకు శ్రీ లక్ష్మీ నరసింహారావు చెప్పిన అర్థం ఏమాత్రం పొసగదు. "పన్ను అనగా యుక్తిగా కల్పించుట యని యర్థము. ఈ పన్నుగడను ఉదంకుడవలీలగా జయించెను. అతడా గోమయమును భక్షించెను" అన్నారు. దీనితో "పన్నుగడ"గాని, "జయించి"నదిగాని ఏమీలేదు. వ్యాసకర్త ఈ శబ్ద విచారణను కొనసాగించి "వలపన్నుట, మాయలు పన్నుట యిట్టి సందర్భములలో వాడబడిన "పన్ను" అనుక్రియ తత్ కర్తృ మనోగత దుష్ట స్వభావ వ్యంజకముగా నుండును" అని చెప్పినారు. దివ్య పురుషుడు అట్టి దుష్టుడే అయితే "అమ్మహాత్ము ననుగ్రహంబు వడసి" అని నన్నయ ఏల వ్రాస్తాడు?

ఉదంకునిచేత గోమయం భక్షింప జేయటం అంటే "పాపం" చేయించటమే అని శ్రీ లక్ష్మీనరసింహారావు వాదించినారు. "వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబుసేసి" అనటానికి వారు చెప్పింది అంతా దూరాన్వయం. "పాపం" చేయించినవానిని "మహాత్ముడు" అని, గోమయ భక్షణకు అవకాశం కలిగించటం అతని "అనుగ్రహంబు" అని నన్నయ ఏల వ్రాస్తాడు? కవిసార్వభౌముడు శ్రీనాథుడు కాశీఖండంలో "గోమయము" స్నానాంగకాలలో ఒకటిగా పేర్కొన్నాడు (5-207). కాశీఖండం-ద్వితీయాశ్వాసంలో గోవుల మాహాత్మ్యాన్ని విశదీకరించినాడు.

శ్లో. గోమయం యమునా సాక్షా ద్గోమూత్రం నర్మదా శుభా,
నంగా క్షీరస్తుయాసాం వై కిం పవిత్ర మతః పరమ్. 2-21

శ్లో. గవామఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ
యస్మా త్తస్మాచ్ఛివం మేస్యాదిహలోకే పరత్ర చ 2-22

ఈ రెండు మంత్రాలను చదువుతూ గోదానం చేయవలెనని శ్రీనాథుడు చెప్పినాడు. ఈ విషయం నన్నయకు తెలియకుండా ఉంటుందా? అతడు "గోమయము" అనకుండా "వృషభ గోమయము" అని ఏల వ్రాసినాడు. "గోమయము" అంటే ఆవు పేడ అయినా కావచ్చు, ఎద్దు పేడ అయినా కావచ్చు. అందుకని "వృషభ గోమయము" అన్నాడు. కాని శ్రీ లక్ష్మీనరసింహారావు దివ్యపురుషుడు వృషభ గోమయమును పన్నెను" అని వ్యాఖ్యానించినారు. పేడను భక్షింప జేయించటం అంటే, పాపం చేయించటమే అనే భావం, వారి మనస్సులో ఉండిపోవటంచేత ఇట్టి వ్యాఖ్యకు తలపడినారు. వాస్తవంలో ఉదంకుడు దివ్యపురుషుడు "పన్నిన వృషభ" గోమయ భక్షణముసేసినాడు అశ్వాన్ని, రథాన్ని, హలాన్ని "పన్ని"నట్లు దివ్యపురుషుడు వృషభాన్నికూడ "పన్ని"నాడు. ముక్కుదాడు బెట్టటం, దానికి పగ్గంబెట్టి తన వశంలో ఉంచుకొనటం, మునుకోల ధరించటం మొదలైనవి "పన్నుట"లో భాగమే. నన్నయ భావం ఇదే.

నన్నయ "పన్ను" ధాతువును రెండు సందర్భాలలో ప్రయోగించినాడు. ఒకటి: ద్రౌపదీ స్వయంవరానికి వివిధ దేశాధిపతులు ఎట్లు వెడలిరో వర్ణించిన సందర్భంలో ఉంది. "ఉర్వీపతులెల్ల

కొండొరుల గడవ, గడువేడ్కదొడి, పూసి, కట్టి, విభూతితో దమ దమ చిహ్నముల్ దనరి, యెఱక పతగ, వేఱు వేఱ పన్ని, భూతలమ్ము గక్కదల సైన్యపాద ఘట్టనమున, బొలుచు ద్రుపద రాజపుత్త్రి స్వయంవర రంగమునకు జనిరి రమణతోడ'' (ఆది 7-165) అని వ్రాసినాడు. దీనిలో "యుక్తిగా కల్పించుట"గాని, మనోగత దుష్ట స్వభావం"గాని ఏముంది? రెండు: "ఇత్తఱి బన్ని పోయి, పయినెత్తి రణంబుసేసినన్" (అరణ్య 1-74) అని వ్రాసినాడు. ఇక్కడ సైతం అట్టిది ఏముంది? తిక్కన యుద్ధ పంచకలలో పలుచోట్ల "పన్ను" శబ్దప్రయోగం చేసినాడు. యుధిష్ఠిరుడు ధృష్టద్యుమ్నునితో క్రౌంచనామక వ్యూహం "ఘటింపు"మని చెప్పినాడు. (భీష్మ 2-20); ఈ వ్యూహంలో సౌభద్రాదులు భీమసేనువలను నకులాదులు ధృష్టద్యుమ్ను దిక్కునం "బన్నిరి" (భీష్మ 2-21). భీష్ముడు తన తృతీయ దివసయుద్ధ సందర్భంలో గరుడవ్యూహం దీర్చి, దానికి ముక్కులయి నిలబడగా తక్కునుం గలవారలు దానికి వివిధ అంగాలుగా "కలయంబన్నిరి" (భీష్మ 2-96). అంతట ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో వ్యూహరమును "అర్ధేందు చందమున" "బన్నఁబంపు" మని పలికినాడు. "పన్ను"కు మాఱు "అమర్చు" (భీష్మ 1-103), "సమకట్టు" (భీష్మ 1-103), (పద్మవ్యూహంబు) "గావించు" (ద్రోణ 1-394), "సంఘటించు" (ద్రోణ 2-4)అవి తిక్కన భారతంలో ప్రయుక్తం. అభిమన్యుడు తన సారథితో "బలారివచ్చిన, మురారి గణంబులు దాసుబన్నినన్... నే జయింతు" (ద్రోణ 2-15) అని పలికినాడు.

నన్నెచోడుడు తన "కుమార సంభవం"లో కుమార-తారకేసురుల యుద్ధ వర్ణనచేసినాడు. "ఎలమి కుమారు ముంగిలి సురేంద్రుడురా. సుదధీశ్వరుండు పింగలి నడపం, గుభేరుడును గాలుడు నేర్పడ బన్ని ప్రీతితో గెలకుఁ రాగ" (11-16) అని వ్రాసినాడు. కొంత దూరం పోయిన తర్వాత, కుమారుని సైన్యం మహానదీ తీరాన విడిసినట్లు, ఆ దృశ్యాన్ని మనోజ్ఞంగా వర్ణించినాడు. సైనికులు "వాహనంబులు డిగ్గువారును, బన్నులు విడుచువారును...పిన్నలెఱగక దెసదప్పి వెదకువారు, నెఱిగి తమ తమ పిళ్ళకు నేగువారు" అయినారట. (11-29) అ మఱునాడే యుద్ధం జరిగింది. దీనిలో "యుక్తిగా కల్పించుటగాని," "మనోగత దుష్ట స్వభావం"గాని ఏముంది?

దివ్యపురుషుడు "వృషభ గోమయమును పన్ని" ఉంటే ఎట్లు పన్నినాడో సమాధానం లభించదు. కాని యుద్ధంలో "పన్నటం" అంటే మనకు తెలుస్తుంది. వలపన్నటం, మాయలుపన్నటం ఒక రచన; అట్లే వ్యూహంకూడ ఒక రచనయే. యుద్ధంలో తమకు ప్రత్యేకించిన స్థలాన్ని అంటిపెట్టుకొని ఉండటం పన్నటమే. దున్నటానికి నాగలిని అన్ని విధాల సిద్ధపఱచటం పన్నటమే. అట్లు సిద్ధపఱచిన నాగలిని ఎద్దులు పూనుతాయి. 'పన్ను' అనే అర్థంలో తిక్కన "పూన్చు" ప్రయోగించినాడు: 'తేరుబూన్పఁబంపు" అని గవాధ్యక్షునిచేత చెప్పించినాడు. నన్నెచోడుడు "పన్ను"ను సంజ్ఞావాచకంగా ప్రయోగించినాడు. ఒక పద్మవ్యూహం పన్నినట్లు దివ్యపురుషుడు "వృషభ గోమయమును పన్నెను" అని మనం ఊహించటం కష్టం.

"వృషభ గోమయ మనునది యొక చమత్కారమగు సమాసము" అని వ్యాసకర్త పేర్కొన్నారు. నన్నయ భారతంలో ఇట్టివే నాలుగైదు సమాసాలు కలవని, వాటిలో ఏదో "వైలక్షణ్యము" ఉందని సూచించినారు. "నా మిగిలిన వ్యాసములందు వానినిగూర్చి వ్రాయుదును" అని తెలిపినారు. "వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి" ఈ పదబంధాన్ని శ్రీ లక్ష్మీనరసింహారావు వివరించినవిధం ఇప్పుడు మనం తెలిసికొన్నాం. వారి వివరణ నన్నయ అభిప్రాయానికి అనుగుణంగాలేదు. నన్నయ "తమ విడిసినయింట బ్రాహ్మణునకైన యాపద" (ఆది 6-277), "తమ యున్న యింటి బ్రాహ్మణునకుం జెప్పి" (ఆది 7-31) అని వ్రాసినాడు. శ్రీ లక్ష్మీనరసింహారావు చెప్పినట్లు వీటిని వరుసగా తాము ఇంటి బ్రాహ్మణుని విడిసిన, తాము ఇంటి బ్రాహ్మణుని ఉన్న అని అన్వయించుకొనవలెనా? నన్నయ సమాసాలలోని "వైలక్షణ్యాన్ని"గూర్చి వారు ముందు ముందు వివరిస్తామని చెప్పినారు. "పినదగు నెప్పుడు నెప్పిన." కాబట్టి దీనిపై వ్యాఖ్యానం అనవసరం.

శ్రీ లక్ష్మీనరసింహారావు "ఇన్ని దినంబు లేల మసలితి చెపుమా" సు ఉదాహరించి, మసలుట యనగా సలసల క్రాగు యని మరి యొక యర్థము కలదని చెప్పినారు. "ఇన్నాళ్లేల యాలసించితివని పైకి అర్థము వచ్చునట్లు, ఇన్నాళ్ల నుండి యాగ్రహించుచున్నావేమని గూఢముగా నర్థము వచ్చునట్లు" గురువు ఉదంకుని ప్రశ్నించినాడట. తడవు సేతకూ, కాలానికీ సంబంధం ఉంది. తడవు సేత కూడ ఒక ఘటమే. "ఏనేడులగుడెంచె" అని అరణ్య పర్వములో నన్నయ్య వ్రాసినాడు. ఏ ఘటన అయినా కాలాన్ని, ప్రదేశాన్ని ఆశ్రయించి ఉంటుంది. కాని ఆగ్రహం కూడ ఒక ఘటనయేనా? ఇది ఒక నిర్దిష్ట కాలాన్ని ఆశ్రయించి ఉంటుందా? ఉదంకుడు ఒక ప్రదేశంలో ఎడతెగని తడవు సేసినట్లే, ఎడతెగని ఆగ్రహం పూనినాడా? అతని ఆగ్రహం ఎడతెగక "సలసల క్రాగు"తూ ఉండినదా? నీరు "మసల కాగింది" అని నేటి జన వ్యవహారం. దీనిని నన్నయ్య భాషకు ముడిపెట్టటం తగదు. ఉదంకుడు కుండలాలు తెచ్చి ఇచ్చిన

పిమ్మట ఒకనాడు గురువు ఈ ప్రస్తావన చేసినట్లు వ్యాసకర్త చెప్పినారు. అయితే నన్నయ్య ఇట్టి అభిప్రాయం వెల్లడించి యుండ లేదు. "కుండలమ్ములు వేగ కొని రమ్ము నాల్గవ నాటికి" అని గురుపత్ని ఉదంకుని పంపింది (ఆది 1-114). "నేడు పోవనినాడు నిష్ఫలంబిమ్మహా యత్నమంతయు" (అదే పద్యం) అని ఉదంకుడు నాగలోకంలో చింతిస్తాడు. అంతకు ముందు మూడు దినాలు గతించినాయని దీనిని బట్టి స్పష్టం. ఎట్టి ఆటంకం లేనిచో ఉదంకుడు ఆ మఱునాడే కుండలాలు తెచ్చి ఉండును. అతడు గురువుకు ప్రత్యుత్తరం ఇస్తూ, "మీ యానతిచ్చినట్లు మసల వలవదు. తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున నింత మసలవలసె"నని ఆ వృత్తాంతమంతా కవి స్తరంగా చెప్పినాడు. "మసలుట" అంటే తడవు సేయుట అని ఇక్కడ కూడా స్పష్టం. గురుపత్ని ఉదంకుని రాకకై నాలుగు దినాలుగా ఎదురు చూస్తూనే ఉంది. ఉదంకుడు గడువు దాటకుండగనే కుండలాలు తెచ్చి ఇచ్చినాడు.

నన్నయ వ్రాసింది ఏమి? గురుపత్ని "ఉదంకాగమనంబు గోరుచున్నది." "అప్పు డయ్యుదంకుంగని" ఆమె "తద్దయుసంతసిల్లి" నది. "తదానీతరత్న కుండల భూషితయై" నది. "బ్రాహ్మణుల యాజించి నిజసంకల్పిత మహోత్సవం బొనరించి"నది. "అట్లు గురుకార్యంబు నిర్వహించిన యుదంకుంజూచి "గురుండు" విమల తపోమహిమా! యున్ని దినంబులేల మసలితి చెపుమా? అని అడిగినాడు. గురువు చేసిన సంబోధనను శ్రీ లక్ష్మీనరసింహారావు విస్మరించినందువల్ల ఎంతో అనర్థకం జరిగింది. అణిమాది అష్టసిద్ధులు బడసిన ఉదంకుడు "ఇన్ని దినంబులేల మసలి" నాడని గురువుకు సందేహం అంతేకాదు. గురువు మాటలలో అది "ఈ యున్న ప్రోలు-వ్రేటు దూరంలో ఉన్న పట్టణం. దీనికి పోయిరావటం ఒక పెద్ద పనియా? అని గురువు భావం. ఉదంకుడు అతని సందేహ నివృత్తి చేసినాడు.

"మసలుట" అంటే శ్రీ లక్ష్మీనరసింహారావు చెప్పినట్లు "ఆగ్రహం" వహించుట "సలసల క్రాగుట" అనే అర్థాలు ఏమాత్రం పొసగవు. నన్నయ భాషనే మనం దృష్టాంతంగా తీసుకొందాం. అర్జునుడు తీర్థయాత్రా సందర్భంలో "పవన విచల ద్వీచీలాలిత సముద్ర విద్రుమమలా పులిన స్థలముల మసలుచు" (ఆది 8-187) కళింగ విషయంబు సొచ్చికాడట. ఇక్కడ "మసలుచుట" అంటే "సంచరించుట" అని అర్థం. అదికూడ "తడవుసేత"యేం, ఏక కాలంలో సంచారం జరిగి ఉండటం దీనికికారణం. కాని "ఆగ్రహం" దీర్ఘమైనది కానేరదు. అది దీర్ఘ కాలంలో జరగదు. అది క్షణకాలమే; తన యెదకు పట్టితెచ్చిన ద్రుపదుని ఉద్దేశించి ద్రోణుడు ఏమన్నాడు? విప్రుల యలుకయు దృణ హుతాశనంబు దీర్ఘమగునె" అని విడిచి పుచ్చినాడు. "మసలు" శబ్ద ప్రయోగం శ్రీనాథుడు ఎట్లా చేసినాడో చూద్దాం: "నెల మసలె నిందువదనకు" (కాశీఖండం 4-3). ఇది కూడ "తడవుసేత"ను సూచిస్తుంది.

ఉదంకుని కథలో "తగిలియను క్రియ బహు విలక్షణమైన యర్థములో వాడబడినది. తగులు అనగా చిక్కు, పట్టు, తాకు అను మూడర్థములున్నవి" అని శ్రీ కాజ లక్ష్మీనరసింహారావు పేర్కొన్నారు. "వాని తోడనతగిలి"కి ఈ మూడర్థములను అన్వయింపవచ్చును అని చెప్పినారు. దీనికిగల "బహు విలక్షణమైన" అర్థం కూడ విచార్యమే. "దాని పిఱుందనపాటె" (= తక్షకుని పిఱుందన పాటె)—(ఆది 1-101); తో"దనదగిలి" (ఆది 1-103)—ఈ రెండూ దగ్గఱ దగ్గఱనే ప్రయుక్తం. "పాటిన మృగంబు వెంట దగిలి" (ఆది 1-165), "అమ్మగాన్వేషణ శ్రమాకులిత చిత్తుడై తగిలి పాఱుచున్" (ఆది 1-166), "కౌరవానుజుడు దాని పిఱుందనపాఱి" (సభా 2-214) అని నన్నయ "తోడ తగిలి" అనే అర్థంలోనే ప్రయోగించినాడు. ఇవన్నీ 'విలక్షణమై' ఉండగా. లోడ తగిలి ఒక్కటే 'బహు విలక్షణమైన'ది ఎట్లు అయింది? ఆ మాటకు వస్తే నన్నయ కావ్యమంతా విలక్షణమైనదే. అతనిని అనుకరింపనెంచి ఎందరో కవులు వెల్లకిల పడినారు.

నన్నయ "తగులు"కు స్వీకరించిన అర్థాలే వేఱు. దీనికంటె వేర్వేఱు అర్థాలలో, "విలక్షణమైన" అర్థాలలో నన్నయ 'తగులు'ను ప్రయోగించినాడని చెప్పటం ఉత్తమం. అతని ప్రయోగాలు కొన్ని పరిశీలింపుడు: 'అమ్ముని యఱుత దగులవైచి' (ఆది 1-170); 'పరనారీ శపము దగిల్చి' (ఆది 1-169); 'కుండలు దార పరిగ్రహము సేయ దగులుదు బుద్ధిన్' (ఆది 2-146); 'కడు ఘోర నిష్ఠతో దగిలి తపంబు సేసియును' (ఆది 2-149); 'అధిక చింత దవిలియున్న నయ్యుదంకు నభిప్రాయ మెఱిగి' (ఆది 1-114); 'కారణాపతంబును...పోగడుండు వారు విని తగుల నెడన్' (ఆది 6-131); ... 'చదువుపగిలి కడలక విసుచుండు కరులను' (ఆది 4-28); 'ఇది మునికన్యమేని మఱి యేలొకో యీ లలితాంగియందు నా హృదయము దద్దయుండవిలె' (ఆది 4-30); 'మృగయా వ్యసనంబునందగిలి' (ఆది 5-46); "...పుష్ప మకరంద రసముం దగులుచున్" (ఆది 5-139); "చల్లని మారుత మల్లన పితెంచెదగిలి...మునివరు మీదన్" (ఆది 4-40); "తల్లికంటె నిద్రదగిలి సుతులు...మఱచియుండిరేమిమాడ్కి యొక్కొ" (ఆది 6-178); "భారత వాగమృతంబు కర్ణరంధ్రంబను నంజలిం దవిలి త్రావుదురు" (ఆది 1-76)

నన్నయ కాలంలో "ఇల్లు తగులబడింది", "ఇంటిని తగుల బెట్టినారు" అని వ్యవహరింపలేదా? కాని నన్నయ "లక్కయిల్లతి కృశానుహతిగాగె" (ఆది 6-162), "దహనంబు దరికొలిపి" (ఆది 6-139) "అనలంబు దరికొలిపి" అది 6-159) అనియేవ్రాసినాడు. రోగం తగిలింది, దెబ్బ తగిలింది, మంచినీరు తగలేయి, వాడు ఖూనీ కేసులో తగులుకొన్నాడు, ఆమె ఎవరినో తగులుకొన్నది, నాకు ఈ తగులాటంవద్దు మొదలైనవి ఆనాడు జన వ్యవహారంలో ఉన్నాయా? ఒకవేళ ఉన్నా, నన్నయ వాటిని ఆ విధంగానే స్వీకరింపలేదు. సాధువైనవాటిని స్వీకరించి, అసాధువైనవాటిని త్రోసి పుచ్చినాడు. శ్రీ నాధుడు కాశీఖండంలో చేసిన ఒక ప్రయోగాన్ని పరిశీలింపుడు: "మార్తాండుండు కొండప్రక్కంజిక్కి కదలి మొగయక్కాలిం దగులుపడి చిక్కిన జోగుసుంబోలె" సుండెనని సురలు అగస్త్యునితో చెప్పినారు. (2-96) ఇది జన వ్యవహారం.

ఉదంకునిదికూడ "బ్యుషాత్మ" అని వ్యాసకర్త అంగీకరించి నారు. అట్టివాడు లోపల ఒకటి అనుకొని, పైకి ఇంకొకటిచెప్పశాడా? ఉదంకుడు తక్షకుని స్తుతిస్తూ "తక్షకుండు శూరుడు" అని చెప్పిన మాట నిజమే. "తనను మోసగించి కుండలములను దొంగిలించిన శూరుడని యనుట వాడు పిరికివాడని చెప్పుటయే" అని వ్యాసకర్త అనటం యుక్తి యుక్తంగాలేదు. స్తుతినిందతోకూడి ఉంటే, నిందా స్తుతులకు భేదమేమి? నన్నయగాని, ఉదంకుడుగాని "పిట్టిగిచ్చి జోల పాడే"వారుకారు. ఉదంకుడుచేసిన స్తుతులన్నీ ఒక విశిష్టసంప్రదాయానికి చెందినవి. వాటిలో నింద ఎక్కడాలేదు. "శూరుడు" అంటే కార్యశూరుడు అని అతనిభావం కాబోలు. ఆ తర్వాత ఉదంకుడు జనమేజయునితో మాట్లాడుతూ "తక్షకాముధుడు" అన్నాడు. (ఆది 1-125) ఉత్తమ, మధ్యమ, అధమ శ్రేణులను దృష్టిలో ఉంచుకొని అతనిని అట్లు అని ఉండవచ్చు. ఈ పరామర్శలో నేను వెల్లడించిన అభిప్రాయాలను శ్రీ లక్ష్మీనరసింహారావు శ్రద్ధతో పరిశీలింపగలరని నమ్ముతున్నాను.

శ్రీ బండ్లపల్లె ఓబుళరెడ్డి

# ఉదంకుని కథ

శ్రీ శ్రీ న. చ. రామానుజాచార్యులవారికి (భారతి - మార్చి 1984) శ్రీ కాజా లక్ష్మీనరసింహారావుగారివ్యాసం (భారతి-సెప్టెంబరు-1983) నచ్చలేదు.

అయితే ఆచార్యులవారు తమ నచ్చనితనాన్ని ప్రకటించడంలో కొన్ని అసంగతాలూ - మరికొన్ని అనాలోచితాలూ ఐన సిద్ధాంత వాక్యాలను ఇరికించారు.

1. నన్నయభట్టు పాపం మొట్టమొదట తెలుగులో కావ్యం వ్రాశాడు. ఆ ఘనత ఆయనకు దక్కింది. అట్లా అని చెప్పి ఆయన రాసిన ప్రతి పద్యంలోనూ, గద్యంలోనూ మాటా మాటా పట్టుకొని పీకితే యేం ఒరుగుతుంది. ఇదేమన్నా రామరాజభూషణుడి పద్యమా

2. చెప్పవలసింది అయిపోయింది. పద్యం పూర్తవలేదు. తనకి తెలిసినవేవో రెండు ముక్కలు చేర్చాడు.

3. నన్నయ పద్యాలలో సందర్భం ఉన్నా లేకపోయినా సంబోధనలు ఉంటూ ఉంటాయి.

4. నన్నయకి పద్యాలు బాగా రాయడం చేతకాకనే గద్యాలు ఎక్కువగా రాశాడు.

5. నన్నయ భారత భాగంలో ధారాళంగా ఉన్న పద్యాలన్నీ నారాయణభట్టు రాసినవి కావచ్చు.

6. నన్నయ భారతాన్ని గురించి యింతమంది యిన్ని రాస్తున్నారుగాని నారాయణభట్టు యేవిధంగా తోడయి నిర్వహించాడో వివరించడానికి యెవరూ పూనుకొన్నట్లులేదు.

నన్నయగారు మొట్టమొదట తెలుగులో కావ్యం వ్రాసి ఘనత సంపాదించుకొన్నాడనైనా ఆచార్యులవారు అంగీకరించారు. అదే పది వేలు. పాపం! ఆ నన్నయగారి పెద్దలు చేసుకొన్న పుణ్యం ఈనాటికి ఈవిధంగా అడ్డు పడింది.

ఇక పీకుడు కాడికివస్తే రామరాజభూషణుడి పద్యం పీకితే ఫర్వాలేదన్నమాట.

ఇదలావుంచి నిజానికి పీకితేనే పాఠం తెలుస్తుంది. ఇక్కడ ఒక రహస్యంవుంది. ఏమంటే పీకడంకూడా ఒక కళే; అది అందరి వల్లా అయ్యేదికాదు. ఓపిక, ఆలోచన, సంయమనం ఉన్నవాడు పీకితే ఆనందమూ-ఆనందము.

సాహిత్యం ఆలోచనామృతం. ఆలోచన అంటేనే పీకుడు. పదాలనుగూర్చి, అర్థాలనుగూర్చి, ఆ పదాలు వాటి అర్థాలు ప్రత్యక్షంగా, పరోక్షంగాచెప్పే విశేషాలగూర్చి తెలుసుకోవాలంటే ఆలోచించాలి. ఆలోచింపగల మనశక్తినిబట్టి లోయలు అందుతాయి. అంటే ఎంత పీకితే అంతన్నమాట.

కాళిదాసు హిమవంతుడికి మైనాకుడనే కొడుకున్నాడని చెప్పాడు. ఆ శ్లోకంలో తప్ప మరెక్కడా తిరిగి కొడుకు ప్రస్తావన లేదు. మరి అక్కడమాత్రం ఎందుకు? అని ఆలోచించి-ధర్మశాస్త్రి

లను తిరిగేసి 'భ్రాతృపూర్వకాని కన్య వివాహయోగ్య కాదని' ధర్మ శాస్త్రం చెబుతున్నది కాబట్టి పార్వతికి ఆ అపలక్షణం కలుగకుండా వుండేందుకు చెప్పవలసి వచ్చిందని వ్యాఖ్యానించాడు మల్లినాథసూరి. 'కాళిదాసుకు శాస్త్రమూ తెలియదు, వస్త్రమూ తెలియదు - ఇదంతా మల్లినాథుడి పీకుడు' అంటేమాత్రం చేయగలిగిందేమిటి? నమోవాకం ప్రశాస్మహే!

శబ్దం వెంటే అర్థం ఉంటుంది. ఆ రెంటివెంటా అవి చెప్పగల సమస్త విశేషాలు ఉంటాయి. అవి గ్రహించాలంటే సామర్థ్యంకావాలి. ఉద్ధరిణ పట్టుకొని కడివెడు నీళ్ళు కావాలనుకోవటం ఆశమాత్రమే కాదు, దురాశ.

'గురుదయ నణిమాదికాష్ట గుణములు తోడన్' అనడం పాద పూరణమని ఎకసక్కెం చేయడానికిముందు కొంతైనా ఆలోచిస్తే బావుండేది. అసలు ఆలోచన అంటూ ఉంటే ఆ విమర్శ మరో రకంగా ఉండేది.

వ్యాసుడు ఉదంకుని వివరాలు చెప్పలేదు. వ్యాసభారతం తెనిగించిన నన్నయగారు కథను ప్రారంభిస్తూనే రెండు పద్యాలు వ్రాశాడు. (నిజానికి తెనిగించినాడనడం తప్పు. నన్నయగారు కాని తిక్కన ఎఱనలుగాని భారతం ఐద్ధనిరూపితార్థమేర్పడ రచించినారు.)

మారువేషంలో వచ్చిన తక్షకుడు కుండలాల నపహరించి భూ వివరంద్వారా నాగలోకం చేరుకొన్నాడు. అందుకు అతడి సహజరూపం సహకరించింది. ఉదంకుడికి ఆ అవకాశంలేదు. వ్యాస భారతంలో అతడు ఒక కర్రపుల్లతో ఆ వివరాన్ని త్రవ్వడం ప్రారంభించాడు. అందుకెంతో యాతన పడవలసి వచ్చింది. ఇంద్ర చోదితమైన వజ్రం ఆ కర్ర ముక్కను అంటిపెట్టుకొని సాయ పడింది. అయినా నాగలోకం వరకు బిలాన్ని త్రవ్వడంలో శ్రమ సంగతి అలా ఉంచి కాల విలంబనం ఎంతో జరుగుతుంది. నిర్ణీత సమయంలోగా కుండలాలు గురుపత్ని కందించలేకపోతే శ్రమ, ప్రయత్నం అన్నీ వ్యర్థం. 'నిన్ను శపించి ఉండేదాని' నన్నదట గురుపత్ని వ్యాసభారతంలో. అంటే కుండలాల సంపాదనంకన్నా సమయం చాలా ముఖ్యమని తెలుతున్నది.

నన్నయగారు ఇదంతా బాగా ఆలోచించారు. ఆలోచించి కథ ప్రారంభించారు. ప్రారంభిస్తూ ఉదంకుని పరిచయం చేశారు. 'గురు దయననిమాది కాష్ట గుణముల తోడన్' విద్య లభ్యసించాడు కాబట్టి తక్షకుని 'తోడన తగిలి' నాగలోకం వెళ్ళగలిగాడు. ఇది ఆలోచింప గలిగేవాడికి కలిగే అర్థస్ఫూర్తి. మహాకవుల రచన అర్థం చేసుకోవ డానికికూడా కొంతైనా అర్హత ఉండాలి. ఇదేమన్నా తెలుగువాచకం 'గైడా?' 'స్పూన్ ఫీడింగ్' చేయడానికి! ఆలోచనలేక, అర్థంచేసుక లేక? 'అణిమాలేదు - మహిమాలేదు' అంటే 'ఆచార్యులూ లేరు. విమర్శా లేదు.' అంతా మిథ్య!

పంక-తంక - శ్రోత్ర ఇత్యాదులు ప్రాసలో రావాలి కాబట్టి వచ్చాయట. 'ఈ పాండిత్యము నీకుదక్క మరియెందేగంటిమే - ?' ఈ లెక్కన రామరాజ భూషణుడి పద్యమూ, తెలుగు సాహిత్యమూ ఇంతేకదా? 'అంతా దండుగ' ఒక్కమాట రాసిపారేస్తే ఆ పైన రాసే శ్రమ ఆచార్యులకు, చదివే తలనొప్పి అస్మదాదులకు తప్పు తుంది. తెలుగు సాహిత్యానికి, పద్యానికి అలంకారము, గౌరవ కారణమూ ఐన యతిప్రాసల సౌందర్య రహస్యం తెలియనివారితో వాదనకు పూనుకోవలసి రావడం నిజంగా దురదృష్టం.

'ఈ క్షణశ్రోత్ర విభుడు తిట్టుకాదు.' రోడ్లమీద తిట్టుకునే తిట్లే తిట్లని అనుకుంటున్నారు. ఆయా పదాలు ఉపయోగించబడిన తీరు, ఉచ్చారణ రీతినిబట్టి భూషణలుగా వినిపించేవికూడా దూషణలు కావచ్చు.

'కుండలాలు తొడగడం వాడుకలోలేదు' ఎప్పుడు? ఆచార్యుల కాలంలోనా? నన్నయ కాలంలోనా? అసలు ఆచార్యుల కాలంలో కుండలాలు ఉంటేకదా తొడగడం. ఆ రోజుల్లో చీర వస్త్ర సామాన్య వాచి. ధర్మరాజాదులు చీరలు కట్టుకొని ఐదల్లి పూలు పెట్టుకొనే వారట. మరి ఈవాడుకూడానా? అప్పుడు సుగంధ ద్రవ్యాలు 'కంపు' కొడుతుండేవి? ఇప్పుడు ముగుగు కాల్వలు 'కంపు' కొడతాయి... 'తొడగటం'కూడా అంతే! అర్థ విపరిణామం అనేది ఒకటి ఉందని కూడా తెలియక-తెలుసుకోక వ్రాస్తే మరి ఇంతే సంగతులు.

'నన్నయ పద్యాలలో సందర్భం ఉన్నా లేకపోయినా సంబో ధనలు ఉంటూ ఉంటాయి.' ఉదంకుడు పౌష్యుడి వద్దకు వెళ్ళాడు. 'మానవేశ! నేను గుర్వర్థమై వచ్చాను. నీవు దండితారాతివి. నాపూన్కి సఫలంచెయ్యి.' అని అడిగాడు? ఇవి సందర్భంలేని సంబోధనలని ఆరోపణ.

ఓ మంత్రిగారివద్దకో, ఓ అధికారివద్దకో కార్యార్థులమై వెళ్ళాము. ఎదుటి వారెటువంటి వాడైనా, మనకిష్టమున్నా లేకున్నా అతడి మనసు రంజింపచేసేలా మాట్లాడాలి, పొగడాలి. మంచి చేసు కోవాలి. ఆ తర్వాత మన పనిగూర్చి ప్రసంగించాలి. ఏదీ లేక వెళ్ళి వెళ్ళడంతోనే అప్పగాడి సొమ్ము దాచపెట్టుకొన్నట్లు ధాష్టీకం చూపితే మెడలుపట్టి గెంటుతారు.

ఆనాటి పౌష్యుడురాజు. నిరంకుశుడు. రాచరికపు అహం - దర్పం కలవాడు. అట్టి వాడిని 'మానవేశ' - 'దండితారాతి' అని సుముఖం చేసుకోవడం సందర్భం ఉన్నా లేకున్నా సంబోధించత పుట. లోకవృత్తం తెలిసి చేసిన రచన అది. తెలియక చేసిన ఆరోపణ ఇది.

ఎన్నో రకాలుగా సంబోధించవచ్చుకదా! ఇవే ఎందుకు వాడాడు? అని మరో కుశంక కలుగవచ్చు. వేరే సంబోధనలు వాడా డనుకుందాం. అప్పుడు 'ఇవెందుకు' అని చెప్పడంటు ప్రశ్న వేయరని 'గ్యారంటీ' ఏమిటి?

ఇంతకూ నన్నయగారు వాడిన సంబోధనలకూ తరువాత జరిగిన కథకూ సంబంధం ఉంది. ఉదంకుడు 'అంధుడవు కమ్మ'ని పౌష్యుని శపించాడు. పాలకుడు గుడ్డివాడైతే పాలితుల కడగండ్లకు లెక్క ఉండదు. ఇందుకు భారత కథే ఒక ఉదాహరణ. గుడ్డివాడి రాజ్యంలో స్త్రీలు అవమానించబడ్డారు మంచివారు అడవులుపట్టి పోయారు. లక్షలాదిమంది అమాయకులు దుర్మరణంపాలయ్యారు. రాజును గుడ్డివాడివి కమ్మన్న ఉదంకుడు శపించింది రాజు రూపం లోని ప్రజను. రాజు శరీరం ప్రజ. ఈరకంగా ఉదంకుడు ప్రజా ద్రోహం చేశాడు. అందుకు మరణమే శిక్ష. కాని పౌష్యుడు ఉదంకుని అనపత్యుడవు కమ్మని శపించాడు. మరణం ఆ వ్యక్తికి మాత్రమే పరిమితం. అనపత్యత అంటే సంతానం లేకపోవడం అతడి వంశానికే చేటు. ఉదంకుడి శాపం తాత్కాలికం. దానికి తిరుగున్నది. పౌష్యు డిచ్చిన శాపం శాశ్వతం. తిరుగులేనిది. ఆరాతులను దండించి ప్రజలను రక్షించవలసిన మానవేశుడుగా పౌష్యుడు తన కర్తవ్యాన్ని నెరవేర్చాడు. మరేతప్పునైనా స్వల్పంగా శిక్షించవచ్చు. లేదా క్షమించవచ్చు కాని ప్రజాద్రోహిని క్షమించే అధికారం రాజుకుకూడా లేదు. శిక్షకూడా చాలా కఠినంగా ఉండాలి. ఆ శిక్షయొక్క తీవ్రత ఇతరులకు పాఠంగా ఉండాలి. మానవేశ; దండితారాతి అనే సంబోధనలు ఇంత విషయాన్ని సూచిస్తున్నాయి. అందుకే నన్నయగారిని ఋషివంటివాడు అనడం.

"ఉదంకుడు భక్షించిన గోమయం అమృతమైతే ఉదంకుడశుచి ఎట్లా అవుతాడు. ఆ సంగతి ఏమీ చెప్పలేదు. శ్రీ లక్ష్మీ నరసింహా రావుగారు". సరే! నేను చెబుతాను.

ఉదంకుడు గోమయం తిన్నాడు. అది అమృతమని పైలుడు చెప్పే వరకు ఉదంకుడికి తెలియదు. ఆచార్యులకూ తెలియదు. అది గోమయం కూడా కాదు. వృషభ గోమయం. అది అశుచి అనే భావన ఉదంకుడిలో కలిగి ది. భావన మనో వ్యాపారం. మనోవాక్కాయాలలో మనస్సు అగ్రేసరం. 'ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః' అనుకొన్నాడు దుష్యంతుడు. 'యద్భావం తద్భవతి' అన్నారు పెద్దలు. తాడును చూచి పామనుకొని దడుచుకొంటే విష మెక్కుతుందట. అమృతం కావచ్చు అంతకన్నా గొప్పది కావచ్చు. దానిని ఉదంకుడు వృషభ గోమయంగానే భావించాడు. అందువల్లే 'నీ వశుచివని ఎలా అనాలి' అని పౌష్యుడనగానే అతడికి అదే జ్ఞాపకం వచ్చింది వెంటనే! ఎందుకంటే మనసు మెర మెర లాడుతున్నది. అది తప్ప అశౌచం లేని 'అఘపంకక్షాళన తపస్సలిలుడు'. కాబట్టె కాసిన్ని శుద్ధోదకాలు సరిపోయినవి. అతడికి చాలినవి కదా మనకూ సరిపోతాయను కోవడం నక్క వాతలు పెట్టుకోవడం. అసలు సందేహ మందేహాస్పదులైన ఆచార్యులు పుడతారనే నన్నయ్యగారు ఉదంకుని అశౌచం భావనా పరమని స్పష్టం చేశారు. చిత్తగించండి; అశుచి భావంబున గాకేమి యప్పరమపతివ్రత మదీయ దృష్టి గోచర గాకున్నది. విమర్శ వ్రాయాలి. భారతి ప్రచురించాలి. పేరు రావాలి. అన్న తాపత్రయమే కాని విషయం తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఉంటేగా?

ఇక్కడ అసలు రహస్యం మరొకటి ఉంది. వృషభ గోమయ భక్షణంచేత అశుచియైనాడని వ్యాసులవారు వ్రాయలేదు. నన్నయ్యగారూ వ్రాయలేదు. వారిద్దరూ చెప్పినది "భక్షణానంతరంబున నాచమింపమినైనను యశుచి భావంబు గాకేమి? తిన్నాక విధి విధానంగా ఆచమించక పోవడం అశౌచంకాని, తినడం అశౌచం కాదు.

ఒక ముఖ్య విషయం ఉన్నది. సాహిత్య ప్రపంచంలో విమర్శకుడు చాలా ముఖ్యమైనవాడు. కవి-పాఠకుడు నది యొక్క రెండు తీరాలైతే, ఆ రెండిని కలిపే వారధి విమర్శకుడు. అతడు చేసే పొరపాట్లవల్ల పాఠకుడికి రచయితకూ మధ్య అగాథం ఏర్పడడమే కాక సాహిత్య ప్రయోజనమే దెబ్బతినే ప్రమాదం ఉంది అందువల్లే విమర్శకుడికి సహృదయము - లోకజ్ఞత నిరంతర గ్రంథ పరిశీలనా శక్తి, కావ్య రసాస్వాదనాశక్తి కావాలన్నారు. ఏదీ లేకుండా కావ్య విమర్శకు పూనుకోవడం ఆత్మలోకంలో దివాలాకోరుతనం.

"నన్నయ 'వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి యమ్మహాత్మ ననుగ్రహంబు వడసి' అన్నాడు. నన్నయకు 'గో' శబ్దం పుంలింగం అని తెలుసు. మరి 'యెద్దావు పేడ' అని నన్నయ రాశాడనడం దారుణం." నన్నయగారు రాయడంలేదా రాశాడనడం దారుణమైనా కాకున్నా ఈ అతి తెలివి వ్రాత దారుణం మాత్రమేకాదు, ఘోరంకూడాను. ఈ సందర్భంలో రావుగారి వ్యాఖ్య కూడా తృప్తికరంగా లేదు. 'వృషభ గోమయ మనునది యొక చమత్కారమగు సమాసము ఇట్టి సమాసగత వైలక్షణము నన్నయ గారి రచనలో నాలు గైదు సందర్భములయందు గానవచ్చుచున్నది.

నా మిగిలిన వ్యాసములందు దానిని గూర్చి వ్రాయుదు' నంటున్నారు రావుగారు. అంతవరకూ వేచి ఉండక తప్పదు అస్మదాదులకు.

కాని, ఆచార్యుల కా అవసరం లేదు. వృషభం అనగా ఎద్దు. గోవనగా ఆవు. మయమనగా పేడ, అని అర్థం చెప్పుకొని 'యెద్దావు పేడ' అంటూ యెద్దేవా చేయడానికి పూనుకొన్నారు. మయమనగా పేడకాదు. గోమయమనే పదానికే పేడ అని అర్థం. 'మయము' తద్ధిత ప్రత్యయము. వికారము, బాహుళ్యము తదాత్మకములందు సంస్కృతాలపై వస్తుంది. ఉదాహరణకు జలమయము, తేజోమయము, కనకమయము, కాష్ఠమయము. కాష్ఠమయంలాంటి తదాత్మకం గోమయం. మయమంటే పేడ అయ్యే పక్షంలో శునక మయము, గార్దభ మయము, వరాహ మయము ఇత్యాదిగా ప్రయోగించవలసి ఉంటుంది. కాని కావ్యాలలోకాని, లోకంలోకాని ఈ ప్రయోగాలు మృగ్యం. కాబట్టి 'వృషభ గోమయ'మంటే ఎద్దు పేడ ఎద్దావు పేడకాదు.

ఈ 'వృషభ గోమయ' భక్షణంలో మరో విశేషముంది. వ్యాస భారతంలో ఎదురుగా వచ్చిన మహాపురుషుడు వృషభ గోమయ భక్షణం చేయమన్నాడని, ఉదంకుడు సందేహించగా 'మీ గురువు గారు తిన్నాడు. నీవూ తిను' అని రెండోసారి చెప్పగా తిన్నాడని చెప్పబడింది. అయితే నన్నయగారు 'పన్నిన' శబ్దం చేత సూచించారని రావుగారి అభిప్రాయం. కాని, ఇక్కడకూడా రావుగారు సరిగా వ్యాఖ్యానించలేదు.

'పన్నిన' శబ్దం అర్థంకోసం శబ్దరత్నాకరందాకా వరుగెత్తి భారత ప్రయోగాలుచూపి 'ఏర్పాటుచేయడం,' 'సన్నాహం చేయడం' తప్ప విశేషార్థమేదీ లేదని చెప్పడానికి అలసిపోయారు. వారిచ్చిన అర్థాలుకూడా విప్రతిపత్తిలేదు. కాని వలపన్నుట, మాయలుపన్నుట, కుట్రలు పన్నుట అంటే లోకవాడుకలో మోసం చేయడం - వల పన్నుట, రథముపన్నుట అనే రెండు ప్రయోగాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ అర్థభేదం తెలుస్తుంది. ఇంతవరకూ రావుగారి కథనం సరిగానే ఉంది.

"గోమయము తినమని దివ్యపురుష డుదంకుని కోరలేదు. ఉదంకుడే సాహసము చేసెను. ఇది నన్నయగారి కథనము." రావుగారి ఈ వ్యాఖ్య నన్నయగారి హృదయానికి విరుద్ధము. దీనివల్ల "దారిలో పోతూ ఉంటే ఒక దెవడో యెద్దుమీద యెక్కి యెదురైతే ఆ యెద్దు పేడ తినేశాడుదంకుడు. ఎంత చక్కగా ఉంది నన్నయగారి కథనం" అని అపహాస్యం చేయగల వీలు కల్పించింది.

విమర్శకుడి లక్షణాలలో గ్రంథపఠనం ఒకటి. ఇతర గ్రంథాల పేరులు వినకపోయినా, కనీసం ఏ కావ్యాన్ని విమర్శించ దలచినాడో దానినైనా క్షుణ్ణంగా పరిశీలించాలి ఆమాత్రం ఓపిక కూడా లేక కావ్యవిమర్శకు పూనుకుంటే ఆ విమర్శకుడిని దేవుడే రక్షించాలి.

నన్నయగారు 'పన్నిన' ప్రయోగించారనుకొని ఇద్దరూ తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. కాని పాఠాంతరాల విషయం ఇద్దరూ మరచిపోయారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంవారిసంశోధిత భారతంలో ఉచితమూ, అర్థవంతమూ, నన్నయగారి లోకజ్ఞతా ప్రదర్శకమలైన పాఠాంతరాలున్నాయి. (1) వాని నొక్క పురుష మహాతేజస్వింగని, అతని పంచిన; (2) పనిచిన; (3) పంపున. 'పనుచు' క్రియకు ఆజ్ఞాపించు, నియోగించు అని అర్థాలు. అంటే ఉదంకుడు వృషభ గోమయం తనంత తానుగా తినలేదు. ఎదురొచ్చిన మహాపురుషుడు మోసాలు చేయలేదు. వ్యాస భారతంలోలా నచ్చచెప్పలేదు. ఆజ్ఞాపించాడు. నియోగించాడు. ఉదంకుడు తిన్నాడు. 'నన్నయ కథనం' ఎంత చక్కనిదో, ఔచిత్యవంతమైనదో ఇప్పటికీ అర్థంకాకపోతే — "తొలి రోజులలో పాఠకుడిది తప్పు ఈ రోజులైతే రాసినవాడిది తప్పు." అయితే తెలియకపోవడం తప్పుకాదు. తెలుసుకోవాలని అనుకోకపోవడం తప్పు. అంతకన్న తెలియనిదానిని గూర్చి తెలిసినట్టుగా నటిస్తూ తెలియనివన్ని దిట్టతనాన తప్పులనడం మహాతప్పు.

సందర్భశుద్ధి అనేది ఒకటుంది. ఒకమాట - ఒకపని ఏదైనా సందర్భాన్ని అనుసరించి రాణిస్తుంది. ఆ సందర్భశుద్ధిలేని వాడికి, తెలియనివాడికి అన్నీ ఒకేలా వినపడతాయి. కనపడతాయి. వెనుకటి కొక అయ్యగారు పిడుగుకు వడుగుకూ ఒకే మంత్రం అన్నాడట. 'విప్రు'డంటే బ్రాహ్మణుడని అందరికీ తెలుసు. అది ఆ శబ్దంయొక్క సామాన్యార్థం. కాకపోతే ఆ పద్యంలో దానికి కొంత విశేషార్థమున్నదన్నారు రావుగారు. ఆ విశేషార్థం తమకందుబాటులో లేదుకాబట్టి పది పద్యాలెత్తి విప్రుడంటే బ్రాహ్మణుడని నిరూపించడానికి నానా హైరానా పడ్డారు ఆచార్యులు. 'విప్ర' శబ్దానికి రావిచెట్టనికూడా అర్థముంది. రక్షించారు. నన్నయ రావిని వర్ణించాడనలేదు. అంతే మాత్రం ఏం చేస్తాం! విప్రుడంటే బ్రాహ్మణుడని భారతీయముఖంగా తెలుసుకోవలసిన దుర్గతి పట్టిన జాతి ఏదన్నా సహించాలి.

"నన్నయకు పద్యాలు రాయడం చేతకాకనే గద్యాలు ఎక్కువగా రాశాడు." — అహా! నన్నపార్యా! నేడుకదా నీ జన్మ ధన్యంబైనది."

'నన్నయ భారత భాగంలో ధారాళంగా ఉన్న పద్యాలన్నీ నారాయణభట్టు రాసినవి కావచ్చు.' ఇంతదాకవచ్చి ఏదో ముతక సామెత చెప్పినట్లు ఇంకా 'కావచ్చు' ఏమిటి? అసలు నన్నయ అనే

వాడు పుట్టనేలేదంటేపోలా? ఎట్లాగూ 'నన్నయ'శబ్దం 'నారాయణ' శబ్ద భవమని చెబుతూనే ఉన్నారాయె. ఉన్నది నారాయణుడే. అతడే మొదటి తెలుగులో భారత రచనా బంధురుడైనవాడు. 'పాయక పాక శాసనికి'—అనే పద్యం ఓ విశ్వనాథ—ఓ లక్ష్మీనరసింహారావు—ఓ ఈశ్వరచరణ్ వ్రాసి అతికించారు అంటూ ఓ సిద్ధాంత వ్యాసం గీకి పారేస్తే 'పరిశోధనాంబుధి కుంభ సంభవ' బిరుదంతో తెలుగు దేశం సన్మానిస్తుంది.

"నన్నయ తిక్కనాది కవులీ యుర్విం బురాణా వళుల్ తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తా నెట్టిదో తెనుగుం జేయరు మున్ను భాగవత" మని సంబర పడ్డాడు పోతన్నగారు. మళ్ళీ ఇన్నాళ్ళకు ఆ 'గోల్డెన్ ఛాన్స్' ఆచార్యులకు లభించింది. ఇంత మంది రాయకుండా వదలిన నారాయణభట్టు తోడయి నిర్వహించిన విధం తప్పకుండా వారు వ్రాయాలి.

ఇప్పుడు పంచశతిలోని ఒక పద్యం జ్ఞాపక మొస్తున్నది.

"చెలగి నీకును కీర్తినార్జించునట్టి
ప్రతిభలే; దొక్క చక్కని బాటకలదు
శక్తి కలగి యెవ్వడు ప్రతిష్ఠకును నెక్కు
వానితో నీవు ప్రతికా వైరమూను!"

**శ్రీ ముండిగొండ ఈశ్వర చరణ్**

# విద్వత్కవులు. ప్రఖ్యాత విమర్శకులు
# మల్లంపల్లి శరభయ్యగారు

శా. నీ వంశీధ్వని వాహినుల్ పరదమై నిండార బ్రహ్మాండముల్
దోష్పీఠస్ గ్రహతారకాగణము చిందుస్ బిందువై బిందులై
జీవాంతర్ హృదయంబులందు నినదించెస్ స్పందమై మంద్రమై
నీ వేణుధ్వని స్థూల సూక్ష్మములు నిండెస్ వేణుగోపాలకా!

—మల్లంపల్లి శరభయ్యగారు శైవులైనను అద్వైత భావనతో భక్తి తత్పరతతో పలికిన ఈ పద్యము వారి శ్రీ వేణుగోపాలకా శతకమునందలిది. అలౌకిక జగత్తున కెదిగినపుడు శైవ, వైష్ణవ తారతమ్యమేమియు కన్పించదనుటకీ పద్యమే నిదర్శనము.

శరభయ్యగారు 1928 వ సంవత్సరములో కృష్ణామండలము మందలి 'ఎలకుర్రు' గ్రామమున జన్మించిరి. ఆ గ్రామము స్మరింప గనే మన మనోవీథిలో విశ్వదాత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు విహరింపక మానరు. కారణమేమన ఆ మహా పురుషుని జన్మస్థలము అయ్యదియే! శరభయ్యగారు బాల్యముననే తమ తండ్రిగారైన మల్లికార్జునశాస్త్రిగారియొద్ద సంస్కృత కావ్యనాటకా లంకార శాస్త్రములను చదివిరి. ఆంధ్రభాషయందలి ప్రసిద్ధ గ్రంథములను తమ మూడవ అన్నగారైన శ్రీ వీరేశ్వరశర్మ గారియొద్ద పఠించిరి, అనంతరము చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాలయందు విద్యాభ్యాస మొనరించి 'భాషాప్రవీణ' పట్టభద్రులైరి.

వీరికి ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యనాటకములు అనిన గాఢాభిమానము. ఏ కవిని గురించి ప్రశ్నించినను ఆ కవి వీరి నావహించుకొని పలుకుచున్నాడేమో అనునట్లు క్రొంగ్రొత్త దృక్కోణము లతో ఆయా గ్రంథముల శోతులను విశేషములను వెల్లడింతురు. కాళిదాస భవభూతులన పరవశించెదరు. కాళిదాస విరచిత మాళవి కాగ్నిమిత్ర విక్రమోర్వశీయ నాటకములను సులలిత మధురశైలిలో స్వతంత్ర రచనలా యనునట్లు అనువదించిరి. కాళిదాస కుమార సంభవ కావ్యమును మృదు పదముల తెనిగించిరి. అయ్యదియు గద్య మునను! భద్ర కాళేశ్వర, వేణుగోపాల శతకములను రచించిరి. ఆవిష్కారము, ధ్యానదేహళి, పితృతిథి, కాననజ్యోత్స్న, సందేశము మొదలగు కావ్యఖండికలు వీరి లేఖినినుండి జాలువారిన అమృత ధారలు. 'కాటూరికి స్మృత్యంజలి' ఆంగ్లభాషా సంప్రదాయమున ఎలిజీని పోలినది. హరివంశము-సంప్రతిమాధుర్యము (ఎఱ్ఱన హరి వంశ సమీక్ష) గొప్ప విమర్శనాత్మక రచన, 'సౌందరనందము - ఒక పరిశీలనము' - అను ఆలిండియా రేడియోలో చేయబడిన వీరి ప్రసంగము నిశిత పరిశీలనా బుద్ధికి నికషోపలము, 'కన్నుల ఎదుట కైలాసం' (కాళహస్తిలో శ్రీ జమదగ్ని శర్మగారి సన్మాన సమయ మున చేసిన ప్రసంగము) ఒక అపురూపమైన అపూర్వ రచన. ఇవన్నియు భారతి, ఆంధ్రపత్రిక మున్నగు ప్రముఖ పత్రికలయందు ప్రచురింపబడినవియే! వీరు విమర్శనా వ్యాసములేగాక అనేక పద్య కృతులకు కావ్యపీఠికలను ఎన్నిటినో వ్రాసిరి. మాళవికాగ్నిమిత్ర మున వీరొసంగిన లక్ష్య లక్షణ సమన్వయము ఆదర్శనీయ రచన.

ఎచ్చట విద్యనార్జంతుమో అచ్చటనే ఉద్యోగముచేయుట ఒక అదృష్టము. శరభయ్యగారు చిట్టిగూడూరు ప్రాచ్య కళాశాలలో కొన్నాళ్ళు అధ్యాపకునిగా పనిచేసి తర్వాత మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమున పండితోద్యోగము కొనసాగించిరి. అది వీరికి అమూల్య వరమయ్యెను. పెక్కు గ్రంథములను ఆకళింపుచేసుకొను నవకాశముచిక్కెను. అనంతరమువీరు రాజమహేంద్రవర ప్రభుత్వ

బాలికోన్నత పాఠశాలలో ఆంధ్ర పండితులుగా వ్యవహరించిరి. వీరు ప్రస్తుతము రాజమండ్రియందే ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు. ఎందరకో విద్యాదానము చేయుచున్నారు.

'ఇంద్రియ గోచరమైన ఒకానొక విషయము జపాకుసుమము వలె శుద్ధ స్ఫటిక సంకాశమైన కవి హృదయమును రాగరంజిత మొనర్చుచు ఇతర భావములను అస్తమింపజేసి క్రమముగా అంత యును తానై నిండియుండి పొంగి స్వచ్ఛందమున రసస్వరూపమై జాలువారి కావ్యముగ మారును' (భారతి 1982 - శరభయ్యగారి వ్యాసము) - కావ్యావతరణా వధాన విధానమును వీరు వివరించిన ఈ తీరు అక్షర సత్యములు. వీరి వేణుగోపాలక శతక మిట్టిదియే యనుట కెట్టి సందేహములేదు. అదే భారతిలో 'హృదయైక ప్రభవ మైన రసము హృద్యమే యగును. అది ప్రియుల అనురాగమును పోలినది. కవిని చదువరిని ఒక్కటిగా కరగించు కవితాస్పందములు స్వచ్ఛందములు' - అనిన వాక్యములు సార్వకాలీన సత్యములు.

సామాన్యముగా కవి పండితుడగుట అరుదు. ఆ విధముగనే పండితుడు కవి యగుటయు అరుదే! ఈ రెండు లక్షణము లొకవేళ పొసగిన ఆ వ్యక్తి విమర్శకుడగుట అందునా ఉత్తమ విమర్శకు డగుట యింకను అరుదు. ఈ మూడు లక్షణములు త్రివేణీసంగమము వలె శ్రీ శరభయ్యగారియందు మూర్తీభవించినవి. వీరు పుట్టు కవి యగుటవలననే 'బాలకవి కేసరి' యను బిరుదును పొందగల్గిరి. వీరి కవిత్వము, విమర్శనాధోరణి శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ విశ్వనాథ సత్య నారాయణ ప్రభృతులచే ప్రశంసలందుకొన్నవి. ఇంచుమించు తాము రచించిన ప్రతి పద్యమును శ్రీ విశ్వనాథవారు శ్రీ శరభయ్యగారికి వినిపించినగాని సంతుష్టి పడెడివారు కారనుట అత్యుక్తికాదు. బంగా రమునకు పరిమళమువోలె శరభయ్యగారి యీ ప్రజ్ఞలకుతోడు మేధా సంపద నిరుపమానము.

శ్రీ శరభయ్యగారు యశస్సునకు ప్రసిద్ధికి గల సూక్ష్మతర తారతమ్యమును ఒక వ్యాసములో నెట్లు వింగడించిరో గమనింపుడు.

'యశస్సువేఱు, ప్రసిద్ధివేఱు, కాలాంతరములలో రానైనది యశస్సు, బ్రతికినన్నాళ్ళలో బహుమార్గములుగా వచ్చునది ప్రసిద్ధి, కాలము గడచినకొలది యశస్సు సముజ్జ్వల మగుచుండును, ప్రసిద్ధి మాసిపోవును, కవి భావుకుల పరంపరలలో స్థిరముగా నిలచియుండు నది యశస్సు, తత్ కాలమునందు పామరులలో వ్యాపించునది ప్రసిద్ధి, కవితా గుణ వైభవములచేతనే లభింపనైనది యశస్సు. ప్రచారబలముచేత సిద్ధించునది ప్రసిద్ధి. కాళిదాసు మొదలైనవారు కోరుకొన్నది "యశస్సుకాని ప్రసిద్ధికాదు."

'కవి—కవిత్వము' గురించి తెలియజెప్పిన శరభయ్యగారి అభిప్రాయములు లోకోత్తరములు.

'వ్యుత్పత్త్యభ్యాస శక్తులతో వాణీప్రసాద విశేషమువలన తొల్లింటి సంస్కారములు పచేళిమములై వసంతశ్రీ సమారంభవేళ చివురు గుబురులలో దాగియున్న వనప్రియకంఠకహళి నుండి హఠాన్నిర్గతములైన మధుర ధ్వనులవలె, శివమూర్థోపరిఖేలదంబర ధునీ ప్రవాహములవలె జహుతపఃఫలములైన కవితా ప్రహములు'

'మనకు మానవ భాషలు మాత్రమే తెలియును. మన మెఱుఁగ లేని ఒక అపూర్వ భాష కవికి తెలియును.'

'కవి హృదయము కామధేనువు పొదుగు. అది మధుర రస పూర్ణమై మాటి మాటికిఁజేపి అమృత ధారలు కురియుచుండును.'

'మంచి కవిత్వము రచింపజాలనిచో నిస్పృహ నొంద నవసరము లేదు. కుకవిత్వము రచింపకుండుటయే పదివేలు.'

'ప్రకృతిదేవియొక్క నిశ్చల సమాధియో, కనులుమూయని యోగనిద్రయో అనదగు నిశీథ సమయమున నీల గగనాంగణము నందు మిసుకు మినుకుమను తారకల నిమీలనోన్మీలనములే తాళ గతులుగా హృదయతంత్రుల మీటుచు హృదయగతుడగు నొకానొక గాయకుడు పలికించు చున్నాడు. నీ హృదయమునకు అది వినఁగల నేర్పులున్నచో అది విస్పష్టముగ వినిపించును. అది అప్పుడు పుట్టిన నిసువునూరుపుకన్న సున్నితము. కాని ఆ విశ్వాస గర్భములో విపుల జలధి గభీర ఘోషలు వినబడును. అది విష్ణు నాభీ విమల కమల మిళింద నిస్వనమువలె సర్వతోముఖమైన నాదము. అది శ్రవణ హృదయ రసాయనము.' ఎప్పుడు దానిని విని వినిపింప నేర్చునో అది కవనమగును .అతడు కవి యగును...'

మ. జరుగన్ గాఢ తమో విలీనములు నిశ్శబ్దంబులై పెక్కు వ
త్సరముల్ నేటికి పాలబాల శశి భాస్వత్సం విదుద్యోతి త
స్ఫురణన్ నీ కరుణన్ దరంగిత గతిన్ బొంగెన్ వచోగంగ; నీ
చరణాబ్జంబులపైఁ బదింబదిగఁ గృష్ణా! వేణుగోపాలకా!

— అట్టి కవితా గంగయే ఈ పద్యము.

మ. తలఁతున్ నీవనిరాకయే చరమ సంధ్యావేళలన్ గోఖురా
చల చంచత్పదవీ రజఃపటల సంఛన్నాల కాధ్వాంత పే
శల చంద్రోదయపద్మభాసిలలితాస్యస్మేర గోపీదృగం
చల నీలోత్పల సించితామృత కటాక్షా! వేణుగోపాలకా!

ఈ పద్యము వేణుగోపాలుని కటాక్ష వీక్షణమువలె సుదీర్ఘ సమాస గుంఫితమై, కడుంగడు మృదుపద భరితమై యొప్పు చున్నది.

వీరికి తమ మాతృమూర్తి యనిన చెప్పతరముకాని గౌరవాద రములు, భక్తి ప్రపత్తులును.

'చిన్ననాట నన్ను శివకథా ప్రపంచమునఁ ద్రిప్పుచు మా అమ్మగారు నాకు కుమారస్వామి 'కవి' యని చెప్పినది. ఆమె కాళిదాసు కూడ 'కవి' యని చెప్పినది. నా మనసులో స్వామియే నిలిచెను. 'రఘువంశ కుమారసంభవ మేఘసందేశములు, మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయ, అభిజ్ఞాన శాకుంతలములు అను ఆరు ముఖములతో స్ఫురిత వివిధ వర్ణచ్ఛటా దేదీప్యమానమై యాకాశమంతయు నావ రించిన - ఆ భావనాబర్హముతోడి ప్రతిభామయూరముపై నధిష్ఠించి యున్న మహాకవికన్న భిన్నముగా మహాసేనుఁ డెచ్చటఁ గని పించును!'

ఏమి యూహ! ఎంత ఔచిత్య పరిశోభితము!

శరభయ్యగారి నిశిత కుశాగ్ర బుద్ధియే వేరు. వారి విమర్శనా రీతియే వేరు. సంస్కృతాంధ్ర కవులనిన మైమరచెదరు. అట్లని ఆధు నిక కవులయెడ గాని, భావకవిత్వము నెడలగాని ఆయనకు ద్వేషము లేదు. సరికదా భావనా బలమున్న అన్ని రకముల కవిత్వమును ఆదరించగల సహృదయులు వీరు.

కాళిదాసు కుమారసంభవ మనువదించిన తీరు గమనింపుడు.

'విడులుచున్న పూవులతో తీగవలె, నిగుడుచున్న చుక్కలతో రేయివలె, మొగుడుచున్న పులుగులతో నదివలె, తొడుగుచున్న నగలతో నామె (ఉమ) ప్రకాశించెను.'

కన్యాశుల్కంలో గిరీశం చలోక్తిగా 'నాతో మాటాడటమే ఎడ్యుకేషనోస్' అన్నప్పటికీ శరభయ్యగారితో సంభాషణ అనిర్వచ నీయానుభూతి కలిగించుచు సాహిత్యామృతానంద సింధువులలో ఓలలాడించును. మల్లెల పరిమళాలు, మందాకిని గలగలలు, మంచి గంధపు చలువదనాలు, మలయమారుత వీచికల మధురిమలు, మందార మకరంద మధుర ధారలు వీరి ప్రసంగాలు. 'పద్యమును చక్కగా రాగయుక్తముగా చదువవలెను గాని, గద్యమువలె విఱిచి చదువుదు రేమి దౌర్భాగ్యము?' అని నన్నయగారి 'కమ్మని లతాంతములకు మ్మొనసి' అను పద్యమును హాయిగా నాలాపించి సమీప సాహిత్య పరి వేషమును భ్రమర ఝుంకారములతో నింపివేయుదురు.

'ఏదో ఒక కవిని గూర్చి ప్రసంగించుడని నన్ను ఆహ్వా నింతురు. ఆ విధముగానే ప్రసంగించుట క్రమముగా నన్నొక విమర్శ కునిగా ముద్రవేసి విడిచిపెట్టినది. నిజమునకు నా కవిత్వము గుఱించి పట్టించుకొనరేమి?' అని వాకొనుచుందురు.

శరభయ్యగారి జ్ఞాపకశక్తి ఆయనకువలె పఠించిన గ్రంథము లన్నియు సందర్భానుసారముగా సద్యః స్ఫురణకు వచ్చుట అనితర సాధ్యము.

భవభూతి ఉత్తర రామచరిత నాటకమును చెప్పుచుండిరన దానికి తెనుగున గల అనువాదములను పేర్కొనుచు ఎవరే మాటలను ఏ శ్లోకము లెట్లనువదించిరో తులనాత్మకముగా పరిశీలించి విశ్లేషించి చెప్పుట వారి ప్రత్యేకత. ఏ గ్రంథమునైనను చూడకయే అధికారిక ముగా నుట్టంకింపగల ప్రతిభ వారికి పెట్టని సొమ్ము. భారతము పదు నెనిమిది పర్వములు కరతలామలకములే! ఎక్కడ ఏకవి ప్రయోగము నైనను పుస్తకము తెరవకయే, చూడకయే చెప్పగల ధీమంతులు శ్రీ శరభయ్యగారు.

భవభూతి కాళిదాసుల నాటకముల గురించి వారు పేర్కొనిన విషయములు సాహితీ పిపాసువులకు ఉపాదేయములు కాగలవు.

"భవభూతికూడా కాళిదాసువలె మూడు నాటకములను రచిం చెను. కాళిదాసు రచించిన మూడు నాటకములలో మాళవికాగ్ని మిత్రము అనునది చారిత్రాత్మక కథా ప్రసిద్ధము. విక్రమోర్వశీయమ్ పురాణ ప్రఖ్యాత కథ. అభిజ్ఞానశాకుంతలమ్ విఖ్యాత మహాభారతాంతర్గత కథా ప్రాభవమందినది. వ్యాసమహర్షి శకుంతలకు నార వస్త్రము లనే యిచ్చెను. గాని కాళిదాసు మాత్రమామెకు సువర్ణాంగుళీయక కథా వస్తువు నొసంగికాని తృప్తి పడలేదు.

భవభూతి వ్రాసిన నాటకములు మూడింటిలో మహావీరచరితమ్ అను నాటకము పేరుకు తగినట్లుగా వీరరస ప్రధానమై ప్రఖ్యాత పురుషుడైన రాముని కథతో కూడుకొని యున్నది. నవరస భరిత మగుటచే అందలి వస్తువు అతి విస్తృతము. కవి తన ప్రతిభా సామర్థ్యములఁ జూపుట కనువుగా అట్టి ఇతివృత్తము ఎన్నుకొనెను. మాలతీ మాధవమునందలి కథ కాల్పనికము, శృంగార రసప్రధానము. ఈ నాటకమే తనకు చిరయశస్సు నార్జించఁ గలదని తలంచి భవ భూతి తన వైదుష్యము నిబ్బడిముబ్బడిగా నిందు ప్రదర్శించెను. కాని ఆ నాటకమందలి నాయికా నాయకులు కేవల కల్పిత వ్యక్తు లగుటచే అందలి రసవత్తర కథా సంవిధానముకు సహృదయ రంజ నము కాలేకపోయెను.

ఇంక 'ఉత్తర రామచరితమ్' నాటకమునందలి కథ ప్రసిద్ధి నొందినదే! ఇందలి పాత్ర లెల్లరకు సుపరిచితములు. ఇందలి ప్రత్యేకత యేమన భవభూతి మాలతీమాధవమున రచించిన శ్లోకములనే నూటికి ఎనుబది పంక్తులీ నాటకమున మెఱుగులు దిద్ది కథానుసారముగా నిలిపెను, సీతారామనాకు స్పర్శవేదిచే ఆ పూర్వపు శ్లోకములే ఈ నాటకమున అపరంజి కాంతులీనినవి. మాలతీమాధవము కట్టుకథ. ఉత్తర రామచరిత పుట్టుకథ. ఈ కారణము చేతనే మాలతీమాధవము నుండి కవి యాశించిన ఫలితము ఉత్తర రామచరితము మాత్రమే అందియ్యగలిగినది. అభిజ్ఞాన శాకున్తలముచే శృంగార రసభరిత నాటక రచనయందు కాళిదాసు కవి లోకమున ఎట్లు అద్వితీయు డయ్యెనో, ఉత్తర రామచరిత నాటక రచనచే కరుణరస ప్రధాన నాటక రచనయందు భవభూతియు కవి ప్రపంచమున నిరుపమాన కవిగా రాణించెను.

నాటక లక్షణములను గుఱించి శ్రీ శరభయ్యగారి అభిప్రాయములు సర్వదా శిరోధార్యములు. వారి ఆలోచనాదృష్టి పరికింపుడు.

ఎన్ని నదులు ప్రవేశించినప్పటికి ఎట్టిమార్పును చెందక సముద్రు డెట్లుండునో అట్లే ఎన్నిరకములు తనయందుఁ జొచ్చి నిర్గమించినప్పటికి మార్పు చెందక సుస్థిరముగా నిలచునదియే స్థాయీ భావము. శృంగారరస భావము, కరుణరస భావము, సంచారీ భావము ఈ రీతిగా ఎన్నిటిని కాంచినప్పటికిని భావము సుస్థిరమని గోచరింపక మానదు. స్థాయీభావముయొక్క పరిణామ దశయే రసము, రతి యొక్క పరిణామమే శృంగార రసము. నాటకము ఒక రసప్రవాహము. ఆ రసము త్రాగుటకు సామాజికునకు ఉపకరించు ఉపకరణమే పాత్ర. ఈ విధముగా నాటకమున పాత్ర సార్థకతతో నుండునది, నటుడు తాను రసమున లీనముకాక సామాజికుని లీనమొనర్చును, ఈ కారణముచే నాటకమునందలి పాత్రలు రసాపలంబనములు నటుని పరివేష్టించియున్న లౌకిక పరిధి, సామాజికులను ఆవరించుకొనియున్న లౌకిక పరిధి రసధునిచే భేదింపబడినప్పుడే రసానుభూతి, అలౌకికానందము చేకూరగలవు. అట్టి మహోన్నీయ స్థితి నొందుటకై బాహ్య జగత్తునుండి నాటక రసాస్వాద నోన్ముఖులుగా గావించుటకై నిర్దేశింపబడినవియే నాంది ప్రస్తావనలు.

ప్రస్తావనయందు నాటక కథ యంతయు బీజమున వృక్షము వలె నిక్షిప్తమై యుండుట సునిశిత విమర్శనాదృష్టిగల వారలకే గోచరమగును. కాళిదాస భవభూతుల నాటకములందలి ప్రస్తావనలను పరికించిన ఈ విషయము తేటతెల్లముకాగలదు. కాళిదాసు తనకు మందరి కవులనుగాని, సమకాలీన కవులనుగాని సంస్మరింప నిష్టపడినట్లు తోచదు, వాల్మీకినికూడ ఆ మహర్షియందు రూఢమైన'కవి' శబ్దముచేతనే పేర్కొనెను. ఇక వ్యాసుని ప్రసక్తియేలేదు. తదితర కవుల తలంపెట్లుండును? కాని తన శాకున్తలమున మాత్రము 'భాస సౌమిల్లప్రథిత యశసాం' అనుటచే భాసుడు కాళిదాస ప్రశంసపొందగల్గిన ఘనుడని మన మెంచవలెనా ... అట్లని వ్యాసాదులయెడ కాళిదాసునకు గౌరవాదరములు లేవని యెంచుట అపచారమే కాగలదు. భాసుడు తన నాటకములందు అద్భుత రచనా శిల్పమును జూపెను గాని యందలి కథలు రేఖాచిత్రములవలె గోచరించును. అంతేకాని సౌష్టవరూపమునంద లేకపోయినవి. భాసుని నాటకములందు మెచ్చుకొనఁదగినవి ప్రతిమ, స్వప్నవాసవదత్తములు.

భవభూతికూడ 'ఉత్తర రామచరితమ్' నాటకమున ప్రస్తావనయందే కథను సంక్షిప్తముగా నిక్షిప్తముచేసెను.

"సర్వథా వ్యవహర్తవ్యం కుతోహ్య వచనీయతా
యథాస్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః"

అను శ్లోకమున ప్రస్తావనయందే సూత్రధారునిచే రాబోవు కాలమున సంభవింపబోవు సీతాపవాద వృత్తాంతమును సూచించెను. కావ్య వైశిష్ట్యము శంకించువారు, పతివ్రతామతల్లులను అనుమానించువారు లోకమున సహజముగా నుందురని కవి వాక్రుచ్చుట ప్రశంసనీయము.

అంతేకాదు.

దేవ్యామపి హి వైదేహ్యాం సాపవాదోయతోజనః।
రక్షోగృహస్థితిర్మూలమగ్నిశుద్ధౌత్వ నిశ్చయః॥

అను శ్లోకమున సీతాదేవి యగ్నియందు శుద్ధియైనప్పటికి శంకించు అవివేకులుందురను వ్యంగ్యార్థము నిందు నిక్షిప్తమొనర్చిన భవభూతిప్రజ్ఞ సంస్తవనీయము.

అదేవిధముగా ప్రస్తావనయందు "స్నేహాత్సభాజయితు" శ్లోకమున సీతాదేవి భావిస్థితిని వ్యక్తమొనర్చెను.

కాళిదాసు శాకున్తల నాటకము ప్రపంచ సాహిత్య చరిత్రయందు ధ్రువతార. సామాన్యముగా కవులు వసంతర్తువును శృంగార రసప్రధాన నాటకములందు కీర్తింతురు. కాని కవికులగురువు శాకున్తల నాటకమున లేత వేసవిని కీర్తించెను. ఇదొక విలక్షణము. 'సుభగసలిలావగాహాః' ఇత్యాది శ్లోకమున లేత గ్రీష్మమును వర్ణించుచు శకున్తల చేతినుండి యంగుళీయకము జారిపడు సంఘటనను సూచించెను. 'దివసాః పరిణామ రమణీయాః' అని వెనువెంటనే నాటక సుఖాంత మోదాంతముల తెలిపెను. కాళిదాసు ఆ నాటకమున భ్రమరమునెట్లు గిరిగిర త్రిప్పెను! భ్రమరము నిజముగా నిచ్చట భ్రమరముకాదు. బాగుగా యోచించిన అది దుష్యంతుని కోరికకు నిల్చిన ప్రతీకయే!

'ఈ షచ్చుమ్మితాని' ఇత్యాది శ్లోకమున అవతరించిన ఏమరము నాటకమందంతటను సంచరించుచు ఝుంకారము చేయు న్నట్లే గోచరించును. 'అహో సలిలసేక స్రమ్భుమోద్గతో' అను ీట మధుకరమే కనుపించును. 'సాధుబాధనమపి' ఇత్యాదీ శ్లోకమున చలాపాఙ్గం దృష్టిం." ఇత్యాది శ్లోకమున భ్రమరనాట్యమే వీక్షింప గును. చివరకు చతుర్థాంకారంభమున వసుమతి గీతాలాపన ింపచుచు 'అభినవమధులోలుపత్వం' అని హెచ్చరించిన హెచ్చ కయు ద్విరేఫమును గురించియేకదా! ఈ తీరంతయు పరికించిన ధుకరము దుష్యంతుని కోరికగా భావించుట యెంతయు నౌచిత్య రిశోభితము.

మహాకవుల రచనలు సామాన్యం కర్థము కానేరవు. అందునా పాచీన కవులు తమ కావ్యశృగారాభరణముల పండిత విమర్శ గ్నిజ్వాలల్రవేల్చి వెలగట్టెడివారు. అందుచే సత్కావ్యములు నిలు టకవకాశముండెడిది. క్షుద్రకావ్యములు అంతరించెడివి. ఈ విష యములను దృష్టిలో నుంచుకొనియే కాళిదాస భవభూతులు తమ తమ వ్యముల గుఱించి కథాప్రాసంగికముగా పేర్కొనినట్లు పేర్కొనుచు మ కావ్యములను పఠింపగోరువారెట్టివారై యుండవలెనో పరోక్ష ముగా హెచ్చరించుట గమనింపవలసిన విషయము.

"ఆ పరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానమ్
బలవదపి శిక్షితానామాత్మన్య ప్రత్యయంచేతః"॥"

అని అభిజ్ఞాన శాకున్తలమున కాళిదాసు ఉద్ఘాటింపగా

'యేనామ కేచి దిహనః ప్రథయ న్త్యవజ్ఞామ్
జాన న్తితే కిమపితాం ప్రతినై షయత్నః
ఉత్పత్స్యతే హి మమకోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ'

అని మాలతీమాధవమున భవభూతి వ్రాకుచ్చెను.

శరభయ్యగారి సాహిత్య సమీక్ష భావితరాలకు ఒజ్జబంతి కావలయును. వారి ప్రసంగములు అక్షర రూపము ధరించి అందరకు అందుబాటైనచో సాహిత్యమునకెంతో మేలు కలుగును. 'వెలయునది తేజమేకాని బలుపుకాదు' అను సూక్తి శరభయ్యగారి యెడల సార్థక మైనట్టిది. వారే వేరొక కవినిగూర్చి పలికిన అభిప్రాయములు ఉత్తమ ఉపాధ్యాయుడు, గ్రంథవ్యసని, మననశీలి, కావ్యతత్త్వవేత్త, రసజ్ఞులు, భక్తులు, కవియోగి, ద్రష్ట — ఇవి శ్రీ శరభయ్యగారికిని అన్వయించుననుట సత్యదూరముకాదు. ఇంత ప్రతిభాశాలియు ఎంత వినయము చాటుకొనెనో గమనింపుడు.

తలపన్ నేరను, నేరశబ్దములు నర్థవ్రాతమున్ గావ్యశో
భ, లలంకారములున్ గుణంబులు ధ్వనివ్యంగ్యంబులున్ మున్నుగా
నలసుండన్ బలికించితయ్య! శతపద్మశ్రేణి నానోట, న
ర్మిలి వెన్నాడుచు నన్ను రేఁబవలహో! శ్రీ వేణుగోపాలకా!

ఇతి శివమ్.

[1073వ సంవత్సరములో కొన్నాళ్ళు శ్రీ శరభయ్యగారితో సాహిత్య వ్యాసంగముచేయు అదృష్టము కలిగినది. అప్పుడు నా డైరీయందు వ్రాసిన వారి ప్రసంగ విషయములే ఈ వ్యాసమును వ్రాయ ప్రేరేపించినవి. శరభయ్యగారి జనన విద్యాభ్యాసాది విషయ ముల సేకరణకు తోడ్పడిన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తికి కృతజ్ఞతలు]

## శ్రీ కొలచిన వెంకట రమణమూర్తి

---

**గమనిక**

సెప్టెంబరు భారతిలో నా లేఖలో "త్రప్తె" బదులు "త్రీస్తె" అని పడింది.

గంటి రామలింగం,
మదరాసు.

---

# కం విమర్శ వద్దు

మార్చి (1984) భారతిలో శ్రీ శ్రీ న. చ. రామానుజా చార్యులుగారు శ్రీ కాజవారి 'ఉదంకుని కథ - నన్నయ బుష్యాత్మ" అను వ్యాసముపై ఒక విమర్శ చేసినారు. అది సద్విమర్శ అనిపించు కొనదని మనవి చేసెదను.

వేద వాక్యములకు, పురాణములకు, కాళిదాసాది మహాకవుల కావ్యములకు వాచార్థమ్ ముఖ్యమని కూర్చొందుట తగదు. వాటిలో అంతరార్థము కలదనుట ప్రాచీన కాలమునుండి విద్వాంసు లెల్లరు అంగీకరించిన విషయము. "ప్రజాపతి ర్వైస్వాం దుహితర మభ్యధ్యా యత్" అను వేదవాక్యము 'తన కన్నకూతురును తానె పెండ్లాడడె వారిజ గర్భుండు వాలి దప్పి...' అనురీతి వాచ్యార్థము చిచ్చుచున్నది. పై మంత్రములో ప్రజాపతి, దుహితృ సంగమములను నిరుక్తికారులు ఎట్లు వ్యాఖ్యానించిరో — ఎట్లు వ్యాఖ్యానింపవలెనో చూపినారు పండిత శ్రీ దుర్గాప్రసాదద్వివేదీ మహాశయులు. [చూ. సాహిత్య దర్పణ భూమికా. పుట 13]

"ప్రజా పాలనాధి కారాదిత్య ఏవోచ్యతే। సహారుణోదయ వేలాయాం ఉష సముద్య న్న భ్యైత్। సా తదాగమనాదేవోప జాయతే। ఇతి దుహితృత్వేన ఉపదిశ్యతే। తస్యాంచ అరుణ కిరణాఖ్య బీజ నిక్షేపణాత్ స్త్రీ పురుష యోగవ దుపచారః" అని పై వేద వాక్యమునకు వివరణము. అనగా ప్రజాపతి శబ్దముచే ఇచట బ్రహ్మ అను అర్థము చెప్పబడదు. ప్రజలను పాలించెడి అధికారముకల అదిత్యుడే ఇచట ప్రజాపతి. అరుణోదయ సమయములో ఆదిత్యుడు ఉషస్సుతో సంగమించుచున్నాడు. ఆ ఉషస్సు ఆదిత్యుని రాకచే నిష్పన్నమగుటచే ఆదిత్యునకు ఆమె కూతురైంది. అరుణ కిరణము లనే బీజములను ఆ కుమార్తెయందు ప్రజాపతియైన ఆదిత్యుడు నిక్షే పించుటనే స్త్రీ పురుష సంయోగమని వేదమంత్రము లక్షణావృత్తి నాశ్రయించి చెప్పినిది. ఇట్లే అహల్యాజారాది వృత్తాంతాదులన్ని టిలో వివక్షితార్థ మొకటి కాగా, వాచ్యార్థము లోకములో వ్యాపించిన తీరు వేరొక్కటిగా నున్నది.

కావున సామాన్య మేధస్సునకు అందని అర్థ విశేషములను వెలికితీయుట 'దుర్మార్గము' కాదు. దీనికి కీ॥ శే॥ విశ్వనాథ ఆద్యు పురుషులును కారు.

"శబ్దార్థ శాసన జ్ఞాన మాత్రేణ న వేద్యతే।
వేద్యతే సహి కావ్యార తత్త్వజ్ఞై రేవ కేవలమ్॥" అనునది ధ్వని

కారుని మతము. వాచ్యార్థమునందే పరిమితమైన జ్ఞానము కలవారికి నూతనార్థములను వెలికి తీయుట సాధ్యము కాదు. శ్రీ న. చ. రామానుజాచార్యుల వంటివారు కావ్య విమర్శకు పూనుకొనునపుడు ఈ ప్రాథమిక సూత్రమును అధ్యయనము చేయగలరని ప్రార్థించెద.

శ్రీ ఆచార్యులుగారు వ్రాసిన విమర్శలో మరెన్నో అంశములు కూడా అభ్యంతరకరములుగా ఉన్నవి. ఒకటి చూపించెదను. "నన్నయ రాణీనైనా దాసినైనా 'అది' అంటారు" అని పేర్కొని, నన్నయ తెలుగువాడు కాడేమొ అని వీరు సందేహించినారు. 'నన్నయ తెలుగు' భాషపై వెలువడిన భాషా చారిత్రికుల పల్కు లేవీ వీరి దృష్టికి రాలేదని తెలియుచున్నది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మొ॥ విమర్శకులు సోది చెప్పి జనాన్ని ఏడిపించుకు తింటున్నారని ఈ విమర్శకుని అభి ప్రాయము.



రుచి నచ్చనప్పుడు, ఆరోగ్యమునకు పడనప్పుడు పనస తినటం మానుకోవాలిగాని, కమ్మగా చేసేవారిని, తినేవారిని తి సభ్యత కాజాలదు. మన చక్కటిదే ఆకాశం కాదుగదా!

శ్రీ కాజ లక్ష్మీనరసింహారావుగారు వ్రాసిన వ్యాసమెంతవ సమర్థనీయము-అన్నది ప్రస్తుతముకాదు. శ్రీ కాజ వారి వ్యాసమ '84 జనవరి సంచికలో శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారి వాక్యమ విమర్శన అనిపించుకొనును. అది విమర్శనాపద్ధతి. విమర్శ ఎప్పు సత్యాన్వేషణకు ఉన్ముఖముగా ఉండవలయును.

"తేజస్వినా వధీతమస్తు — మా విద్విషావహై"

**జయ**

## "ఆంధ్రభృత్య" సమాసము తత్పురుషమా, బహువ్రీహియా?

భారతి (ఏప్రిల్ 1984)లో శ్రీ ఇవటూరి యోగదుర్గ మ కార్జునగారి వ్యాసము "గోవిందవర్మ ప్రాకృత శాసనము : ఆంధ్ర భృత్యత్వము" చదివితిని.

"ఆంధ్రభృత్య" అను సమాసమును "పులోమావిదాస" అ శాసనగత శబ్దమునుబట్టి "ఆంధ్రులకు భృత్యులు" అని తత్పురు సమాసముగా అర్థము చేయుచున్నారు శ్రీ ఇవటూరివారు. ఫలా వారి సేవకుడను అని చెప్పుకొనుట సహజమే కాని, ఫలానావా సేవకులు అనునది ఒక వంశమునకే, అందునను రాజులు పెట్టు కొనుట విడ్డూరముగా కన్పింపక మానదు. అందుకే "ఆంధ్రభృత్య సమాసమును ఆంధ్రులు భృత్యులుగా కలవారు అని బహువ్రీహి అర్థముచేసికొనవలసిన అవసరము కలదు. ఆంధ్రులు భృత్యులు కల ఆ రాజులెవ్వరు అనునది తేల్చవలసిన విషయము.

"తి

# గ్రంథ విమర్శలు

## కువలయాశ్వ చరిత్రము

[ గ్రంథకర్త : సవరము చిననారాయణనాయక కవి. డెమ్మీ సైజు. 15 + 32 + 199 పేజీలు. వెల రూ. 5-25. ప్రకాశకులు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-4 ]

పద్య కావ్యాలకు ప్రజాదరణ ఎక్కువగా ఉండిన ప్రబంధ యుగంలో ఎన్నో ప్రబంధాలు వచ్చాయి. వాటిలో ఈ కువలయాశ్వ చరిత్రం ఒకటి. ఆ కాలంలో రాజుల ఆస్థాన కవులేకాక ప్రభువులు కూడా గొప్ప విద్వాంసులూ, కవులూ అయి ఉంటడంవల్ల, వారు కూడా ప్రబంధాలను రచిస్తూ ఉండేవారు. దానికి విజయనగర సామ్రాజ్య చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలూ, తంజావూరును పాలించిన రఘునాథరాయలూ మున్నగువారు దృష్టాంతం. వారి వలెనే పాలకుడైన సవరం చిననారాయణనాయకుడు కూడా ప్రబంధ రచనకు పూనుకుని దీనిని రచించాడు.

ఇది అయిదాశ్వాసాల ప్రబంధం. సాకేత పురపాలకుడగు ఋతధ్వజుని చరిత్ర యిందు వర్ణింపబడినది. మార్తాండదత్తమగు కువలయాశ్వమును స్వీకరించి దానిమూలంగా శత్రువును జయించుట వల్ల కువలయాశ్వుడనే ప్రసిద్ధి పొందాడు. ఆ పేరే యీ ప్రబంధానికి పెట్టబడింది. ఋతధ్వజునివద్దకు గాలవ మహర్షివచ్చి పాతాళకేతుని దుండగాలను వివరించడం, ఋతధ్వజుని కోపం, కువలయాశ్వావతరణం, దాని ప్రభావం, రాజప్రయాణ సన్నాహం, ఆశ్రమ ప్రవేశం, రాక్షసమాయ, పాతాళకేతుని రాయబారం, సమర సన్నాహం, పాతాళకేతుని దుర్గ సంరక్షణ, పాతాళకేతుని వధ, మదాలసా వృత్తాంతము, విరహము-వివాహము ప్రధాన కథాంశములు. పాతాళకేతునిమాయలు,-జయంత, నలకూబర, తారాదుల అవాంతర వృత్తాంతములునుకలవు. రచన సరళముగా, రసవంతముగా సాగినది.

ఈ ప్రబంధం రమారమి ఎనభై యేళ్ళకు క్రిందటనే తొలిసారిగా ముద్రితమైనది.ఇప్పుడు ఇది అలభ్యంగా ఉన్నది. ఇప్పటివారిలో చాలా మందికి దీని సంగతే తెలియకపోవచ్చును. ఇట్టి స్థితిలో అనేక మార్గాలలో ఆంధ్రసాహిత్యోద్ధరణకు కంకణం కట్టుకొన్న ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారు, చాలా యేళ్ళక్రిందట ముద్రితాలయి యిప్పుడు అలభ్యంగా ఉన్న ఉత్తమ కావ్యాలను తగిన విద్వాంసుల చేత పరిష్కరింపజేసి, చక్కని పీఠికలతో ప్రచురించి తక్కువ వెలలకే అందించడానికి సంకల్పించి యిదివరకే చాలా ప్రబంధాలను వెలువరించారు. ఆ ప్రణాళికకు చెందినదే యీ ప్రబంధం. చెన్నపురి రాజధానీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులూ, సమర్థులూ అయిన డాక్టర్ దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు దీనికి సంపాదకులు. ఆయన పెక్కు శ్రమలకోర్చి ముద్రితాముద్రిత గ్రంథాలను పరిశీలించి, సరియైన పాఠాలు గ్రహించి దీనికి రూపురేఖలు దిద్దారు. విపులమైన వారి సంపాదకీయం వారి పరిశోధనా విశిష్టతను వెల్లడిచేస్తున్నది. ప్రబంధంలో సముచితస్థలాల్లో విషయాన్ని తెలియజేసే చక్కని లఘు శీర్షికలు నూతన పద్ధతిని సమకూర్చబడినవి. సరళమైన శైలికో చక్కని పీఠికతో ప్రకటించబడిన యీ ప్రబంధం సాహిత్యాభిమానుల ఆదరాభిమానాలను చూరగొనగలదని విశ్వసిస్తున్నాను.

## ఉపనిషత్సుధ

[రచన : డాక్టర్ శ్రీ ఇలపావులూరి పాండురంగారావు, డెమ్మీసైజు 6 + 104 పేజీలు. వెల : 6 రూ॥ లు. ప్రకాశకులు, ప్రాప్తిస్థానం: యువభారతి, 5-కింగ్స్ వే, సికిందరాబాదు-500003, లేదా యువభారతి కార్యాలయము, ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు, తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001.]

వేదాలు వివిధ దేవతల స్తుతులకూ, మంత్రాదులకూ నిలయాలు కాగా, ఉపనిషత్తులు ఆత్మతత్త్వ బోధకాలుగా ప్రసిద్ధాలై ఉన్నవి. అన్నీ ఆత్మతత్త్వాన్ని నిరూపించినా, వాని వాని మార్గాలను బట్టి ఆ ఉపనిషత్తులు అనేకంగా ప్రచారంలో ఉన్నవి. అయినా వేదాలకు అంగాలయిన ఉపనిషత్తులు- ఈశ- కేన- కఠ- ప్రశ్న- ముండక- మాండూక్య- తైత్తిరీయ- ఐతరేయ- ఛాందోగ్య- బృహదారణ్యక- శ్వేతాశ్వతరాలు పదకొండు మాత్రం పరమ ప్రమాణాలుగా స్వీకరించబడుతున్నవి. వాని ప్రాశస్త్య ప్రచారాల ననుసరించి, ఆత్మను గురించిన తమతమ అభిప్రాయాలను వెల్లడించుటకై శతాధికంగా ఉపనిషత్తులు వచ్చాయి. మార్గాలు విభిన్నంగా ఉన్నా, అన్నిటికీ గమ్యం మాత్రం ఒక్కటే!

ఆత్మతత్త్వము చాల నిగూఢమైనది. అది సులభ గ్రాహ్యము కాదు. ఉపనిషత్తుల భాషకూడా కేవలము విద్వజ్జన గ్రాహ్యం. ఉపనిషత్తుల వ్యాఖ్యలుకూడ పండితైకవేద్యములు. వాని వ్యాఖ్యాతలు

తమ తమ అభిప్రాయములనుకూడా జోడించి, వానిని రచించుట వలన విషయమును నిస్సందేహముగా తెలిసికొనుట కష్టము. ఉపనిషత్తులలోని సారమును సులభముగా గ్రహించుటకు ఈ 'ఉపనిషత్సుధ' రచించబడినది.

సంస్కృతాంగ్లాంధ్ర హిందీ భాషలలో గట్టి విద్వాంసులైన రచయితకు ఆధ్యాత్మిక విషయాల్లో ఆసక్తి ఎక్కువ. వారు తత్త్వాన్ని చక్కగా అవగాహన చేసుకుని, తాము గ్రహించిన విషయాలను సామాన్య పాఠకులకు అందించాలనే సంకల్పంతో లలిత లలితమైన భాషలో సులభశైలిలో ఆధ్యాత్మిక సారాన్ని తమ రచన ద్వారా ఆంధ్రలోకానికి అందిస్తున్నారు. వారి ఆదిత్యహృదయం, భగవద్గీత మున్నగు గ్రంథాలు ఇదివరకే ప్రజామోదాన్ని చూరగొన్నవి. ఆకర్షణీయమైన నూతన నామాలతో విషయం కరతలామలకమైనట్లు రచన సాగించారు. 'ఉపనిషత్సుధ' అనే దీనిపేరు సార్థకంగానే ఉన్నది.

ముఖ్యమైన ఏకాదశోపనిషత్తులలోని అంశాలు క్రమంగా "త్యాగం-భోగం, కరణం-కారణం, ఇహం-పరం, ప్రాణి-ప్రాణం, అక్షరం-అక్షయం, ఆత్మ-బ్రహ్మ, అన్నం-ఆనందం, సృష్టి-దృష్టి, ధ్యానం-జ్ఞానం, అమృతం-బృహత్, కోఽహం-సోఽహం" అనే శీర్షికలతో వివరించబడినవి. పుస్తకం చివర శాంతిపాఠం ఇయ్యబడినది. పుస్తకం మొదట వేదవేదాంతాలను గురించిన అమూల్యమగు చర్చ చేర్చబడింది.

అపూర్వమైన పరిశీలన గ్రంథాలు ప్రకటిస్తూ, ఆంధ్ర సాహిత్యానికి, ప్రజానీకానికి ఎనలేని సేవ చేస్తున్న "యువభారతి" సంస్థ దీన్ని ప్రకటించినది. ఇది ఆధ్యాత్మిక జిజ్ఞాసగల అందరి హృదయాలనూ ఆనందింప జేయగలదని చెప్పక తప్పదు.

**శ్రీ బులుసు వేంకట రమణయ్య**

## భగవాన్ శ్రీకృష్ణ గురువాయూరప్పన్

[అనువాదం : డా॥ ఎ. వై. నారాయణాచార్య, ప్రతులకు : శ్రీమతి అమరవాది లక్ష్మి, 9-10-130/3 - పిన్నావారివీధి, వరంగల్ - 506 002. మూల్యం : రూ. 20/-]

శ్రీ కె. ఆర్. వైద్యనాథన్‌గారు రచించిన 'శ్రీకృష్ణ, లార్డ్ ఆఫ్ గురువాయూర్' అనే ఆంగ్లమూలానికి ఆంధ్రానువాదమిది.

భక్తి, మత, తాత్త్విక గ్రంథ ముద్రణకై రచయితలకు తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సాహాయ్యముతో అచ్చయినది.

కేరళరాష్ట్రానికి సంబంధించిన దేవాలయాల్లో తిరువనంతపురమునందలి అనంతపద్మనాభస్వామి దేవాలయం, త్రిచూరుకి సమీపంగా ఉన్న శ్రీ గురువాయూరప్ప దేవాలయం ప్రథమ గణనీయాలు.

గురువాయూరప్ప కృష్ణుడే. కృష్ణావతారానంతరం ద్వారకయందున్న కృష్ణ విగ్రహాన్ని దేవగురువయిన గురువూ వాయువూ తీసుకువచ్చి శివునివాక్కు ననుసరించి యిక్కడ ప్రతిష్ఠించినట్టు స్థలపురాణం...

'సురాచార్య! త్వయానేన వాయునా చ నిమిత్తతః
అశబ్దమేతత్ క్షేత్రంస్యాత్ గురువాయుపురాభిధమ్'—

అని ప్రమాణం. ఆ విధంగా దీనికి గురువాయుపురం అనే పేరున్నూ, ఈ క్షేత్రాధిపతియైన శ్రీకృష్ణునకు 'గురువాయూరప్పన్' అనే పేరున్నూ వచ్చాయని గ్రహించాలి.

నారాయణభట్టతిరి అనే ఒక కవి తన రోగ నివృత్తికై యీ దేవుణ్ణి స్తుతిస్తూ 'శ్రీకృష్ణ చరిత్ర, సంగ్రహించి వెయ్యి శ్లోకాల్లో చెప్పిన గ్రంథం 'నారాయణీయం' చాలా ప్రసిద్ధం యీ ప్రాంతాన.

ఎందరెందరో భక్తులు గురువాయూరప్పను సేవించి కృతార్థులైన విశేషాలు యీ గ్రంథాన తెలుస్తాయి.

నిన్న మొన్నటి ప్రసిద్ధ గాయకుడు శ్రీ చెంబై వైద్యనాథ భాగవతార్ అనుభూతికూడా దీనివల్ల తెలుస్తుంది.

ఈ దేవాలయ నిర్వహణ వగైరా విషయాలుకూడా దీనియందున్నాయి. ముఖ్యంగా యీ గ్రంథమందలి పదునాలుగవ అధ్యాయం 'భక్తిమార్గము' సర్వులూ చదువదగినది.

గురువాయూరప్పను గురించి ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్న తెలుగువారికి యీ గ్రంథం అన్నివిధాలా చక్కగా ఉపకరిస్తుంది. అనువాదం సాఫీగా నడిచింది. ముఖపత్రం చిత్రం ముద్దుగా వుంది.

## తిరువిరుత్తము అను శ్రీ శఠారి వాక్సుధ

[వ్యాఖ్యాత : శ్రీ చరణరేణువు. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు-521207, కృష్ణాజిల్లా. వెల: రూ॥12-00]

నమ్మాళ్వారు-ఈ మహనీయుడే శఠారి, శఠకోపుడు, దివ్యసూరి అనే పేర్లతో ప్రసిద్ధుడైన దివ్యశక్తి సంయుక్తుడు. ద్రావిడ

భాషలో యీయన పలికినది 'తిరు విరుత్తమ్' దీనికి శ్రీ శరణరేణువు వ్యాఖ్యాత. 'సుధాసారము' అని తెలుగు వ్యాఖ్య పేరు సార్థకమని నా అభిప్రాయం.

దక్షిణ దేశములో తామ్రపర్ణీ నదీతీరాన ఉన్న దివ్యక్షేత్రం 'కురుకూర్' (కురుకాపురి). అక్కడ నాల్గవ జాతివాడైన 'విభూతి నాగేంద్రుడు' అనే భాగవతోత్తముని వంశీయుడైన కారికి భార్య నాథ నాయకి. ఆ దంపతుల కొడుకు తల్లిదండ్రులు పెట్టిన పేరేదైనా 'మాఱన్' అనే పేరుతో ప్రసిద్ధుడైనాడు. విష్ణుసేనాపతియైన విష్వక్సేనుని అంశలో పుట్టినవాడని ప్రాచీన గ్రంథం చెప్తూంది.

ఈయనే 'నమ్మాళ్వారు.' ఈయన చెప్పిన నాలుగు దివ్య ప్రబంధాలూ నాలుగు వేదాలుగా ద్రావిడ వాఙ్మయములో ప్రసిద్ధాలు. కనుకనే ఈయనకు 'వేదం తమిళ్ శెయ్‌దమాఱన్' వేదములను తమిళ భాషలో రచించిన మాఱులు- అనే ప్రసిద్ధివచ్చింది. ఆ నాలుగు గ్రంథాలలో ఒకటి యీ 'తిరు విరుత్తమ్'.

శ్రీ=తిరు, వృత్తమ్=విరుత్తమ్. తమిళ ఛందస్సులో ఒక విధమైన పద్యం అనీ, దివ్యచరిత్ర అనీ రెండర్థాలు చెప్పవచ్చు.

దీనిలో మూడు వృత్తాలున్నాయి.

తాను (భక్తుడు) ఇష్టదైవాన్ని నాయికగా, సఖిగా, తల్లిగా తనను భావించుకుని ప్రార్థించడం. ఒక విధంగా ఇది స్వాత్మాశ్రయ కవితగా గణనీయం. తెలుగులో వచ్చిన భావకవిత యీ ధోరణికే చెందుతుందని చెప్పవచ్చు.

భక్తిచే, రక్తిచే, విరక్తిచే, పగచే, వగచే ఇలా ఏదో ఒక భావం ప్రధానంగా దైవాన్ని ఆరాధించి కృతార్థులయిన వారు పురాణ గ్రంథాల్లో కనిపిస్తారు. నమ్మాళ్వారు దీనిలో అలాటి ఆవేదనతో స్వామిని ఆరాధించారు.

'మేఘములారా! మీరు తిరుమలకు పోవుచున్నారుకదా! స్వర్ణ రత్నశిఖరములతో దేదీప్యమానముగ శోభించుచున్న వేంకటాచలమున నివసించియున్న వేంకటేశునికి నా దురవస్థ దయచేసి విన్నవింపుడు. మిమ్ము దూతలుగా వరించుచున్నాను...'

ఇలా ఉండే భావాలను విపరిస్తూ శ్రీ చరణరేణువు సంతరించిన వ్యాఖ్య మనోహరంగా ఉంది. నమ్మాళ్వార్ సుకుమార భావాలకు శ్రీ చరణరేణువు వివరణ సున్నితంగా ఆంతర దర్పణంగా ఉంది. భాష ఏదైనా కావలసినది భావం. ఆస్తికులు చదవవలసిన ప్రశస్త కృతి.

# నామ మహిమ

[రచయిత : శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకటనరసింహాచార్యులు, వెల రు. 6-00, భక్తిప్రబోధకమైన నాటకం. అంకాలు-౭.]

నారదుడు వైకుంఠానికివెళ్ళి విష్ణువును స్తుతించి 'నీకళ్యాణ గుణములను తెలుసుకొన్నానుగాని నీ నామ మహిమ మటుకు ఇంత వరకు నాకు అర్థం కాలేదు. మహానుభావా!' అని అడుగుతాడు. 'భూలోకములో ఒక పేద పురుగునూ చిలుకనూ అడగమన్నాను కదా! వాటిని అడగలేదా?' అంటాడు విష్ణువు. అడిగానుస్వామీ! అవి రెండూ నానోటినుండి నారాయణ అనే మాట వినగానే క్రిందపడి విలవిలలాడి తన్నుకుచచ్చాయి. ఇదేనా స్వామీ! నీ నామ మహిమ? అని నారదుడంటాడు. సరే యీమారు భూలోకములో గుణవర్ధనుడనే రాజుకి ఒక కొడుకు పుట్టి పెరుగుతున్నాడు. ఆ బాలుణ్ణి అడుగు, నా మహిమ చెప్తాడు, అని విష్ణువు చెప్తాడు. ఇక్కడినుంచి చదివి ప్రధాన విషయం తెలుసుకోవలసి ఉంటుంది.

రాజకుమారుడు, అజామీళుడు, జ్ఞానపూర్ణుడు, పోలిసెట్టి, కిరాతుడు (వాల్మీకి), బ్రహ్మదేవుడు, గొల్లభామ, ఒక భక్తుడు, వీరివల్ల నారదుడు భగవన్నామ మహిమను తెలుసుకుంటాడు. అక్కడా యిక్కడా ఉన్నవాటినీ విన్నవాటినీ నాటకరూపంగా సంతరించి ఆచార్యులుగారు ధన్యులయ్యారని అభినందిస్తున్నాను.

జ్ఞానపూర్ణ, గొల్లభామలకు సంబంధించిన విషయం రామకృష్ణ పరమహంస కథల్లోకూడా ఉన్నది.

ఎప్పుడో త్రేతాయుగములో పుట్టబోయే రామునకు సంబంధించిన కథ వ్రాయవలసిందని బ్రహ్మ చెప్పడం, అతికినట్టు నాకు తోచలేదు. అలాగే నూరుకోట్ల శ్లోకాలతో నిండి ఉన్నది రామాయణం అని అన్నారు ఆచార్యులవారు. ఇదీ అబ్బురమే. దీని సమన్వయం ఎలాగో.

వైకుంఠములో విష్ణువు శేషశయ్యమీద ఉంటాడా? ఏమో మరి...నాటకంలో భాష సరళంగా ఒక్క ఊపున చదవాలని పిస్తుంది...

చివర శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారు రచించిన శ్రీ గోదాత్రింశన్మాల (30 కంద పద్యాలు) గోదాస్తుతి అందమైన భక్తిభావ బంధురమైన రచన. మనోజ్ఞంగా ఉంది.

శ్రీ యనమండ్ర పద్మనాభస్వామి

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrik Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.